# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర

ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది



అది పుట్టిన రోజయినా..
మరే శుభసందర్భమయినా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..


డిడి లేదా ఎంఓ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.

వివరాలకు : ఈనాడు టోల్ ఫ్రీ నెం : 18004258888 లేదా
vipula.chatura@gmail.comకు మెయిల్ కూడా చేయొచ్చు

# చతుర

సంపుటి -33
సంచిక - 2
మార్చి 2010
386వ సంచిక



ముఖచిత్ర
ఛాయాగ్రాహకుడు : దిలీప్ బెనర్జీ
ముఖపత్రాలంకరణ : రాజుయాట



శేర్ ముందు దోషిలా నిలబడ్డాడు బతికిచెడ్డ రైతు కొడుకు గోపి.
'మిత్తి కట్టలేదేంరా బేవకూఫ్. ఒళ్లు కొవ్వెక్కిందా?'
చింతనిప్పులు కక్కేడు శేర్.
'క్షమించు శేర్. ఈ నెలలో మా నానమ్మ చనిపోవడంతో ఆ ఖర్చులవల్ల..'
'బహుత్ లోగ్ రోజ్ మర్తే హై! ఎవరో ఛస్తే నాకేంరా.. నావడ్డీ కక్కాల్సిందే. ఎప్పుడు కడతావ్?'
'వారం రోజుల్లో..'
'ఫో, మాట తప్పితే మనిషిని కాను'
పట్నంలో బతుకుదామని వచ్చిన ఓ రైతు కుటుంబం జీవన పోరాటాన్ని ఆర్ద్రభరితంగా ఆవిష్కరించిన

**సింహ ప్రసాద్ కొత్తచిగురు**

6వ పేజీలో..

బొమ్మలు : బాలి

# మనసున ఉన్నదీ...



★ చతురలో యర్రంశెట్టి శాయి రచన అతి పెద్ద ఆకర్షణ. హాస్య రచనలకోసం చూసే నాలాంటివారికి అపార్ట్‌మెంటాలజీ ఎంతో ఆనందం కలుగజేస్తోంది. కొత్తగాలిలో వచ్చే చిన్నచిన్న కవితలు కూడా చాలా బాగున్నాయి. అప్పుడప్పుడు చతురలో హాస్య నవలలు కూడా వేయాలని కోరుతున్నాను.

– ఎ.వి.రెడ్డిశాస్త్రి, శ్రీకాకుళం

★ వెంకటేష్ 'ఆత్మకథ' ఆత్మహత్య వద్దని చెప్పే సందేశాన్నిచ్చే ఇద్దరు వ్యక్తుల గురించి వ్యాసంలా అన్పించింది. అయినా బాగుంది. ప్రముఖ తెలుగు రచయితల అలభ్య రచనలను వెలికి తెచ్చి వారి జయంతులు, వర్ధంతుల సందర్భంగా ఈనాటి పాఠకులకు పరిచయం చేస్తే బాగుంటుంది. 'సరదాగా... గుర్తింపు' చాలా బాగుంది. టాంక్‌బండ్ కథలు 'నేను మారాను' ఆకట్టుకుంది.

–మంచాళ శ్రీలక్ష్మి, విశాఖపట్నం

★ అందమంతా తనదేనన్నట్టు పోజ్ ఇస్తున్న ప్రియమణి ముఖచిత్రంతో ఫిబ్రవరి చతుర మురిపించింది. నేతాజీని తీర్చిదిద్దింది చిత్తరంజన్‌దాస్ అని నిన్నటి నిజం ద్వారా తెలుసుకున్నాం. ప్రకృతి తమాషా ఆకృతులు నిజంగా 'వారెవ్వా!' అనిపిస్తున్నాయి. ప్రేమ ఎంత మధురం అంటూ సాగిన విస్మయ స్కెచ్.. ప్రేమైకంగా సాగి ఆనందపరిచింది. కొత్తగాలిలో నిస్సందేహంగా బాగా స్పార్క్ ఉన్నవే రావాలని కోరుతున్నాను. 'స్మితం' నవ్వులు పూయిస్తోంది. ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదికను ఏర్పాటు చేయటం ఉత్తమ అభిరుచిగల చదువరులకు సదవకాశంగా భావించవచ్చు

–నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం

★ ఇతివృత్తపరంగా చతురలో వస్తున్న నవలలు చాలా బాగున్నాయి. ఉన్నత ప్రమాణాలతో మంచి నవలలను, గొప్ప విషయాలను అందిస్తున్న చతురకు అభినందనలు. కాలాతీతంలో జార్జి గిస్సింగ్ నవల 'న్యూ గ్రబ్ స్ట్రీట్' పరిచయం ద్వారా శతాబ్దం క్రితమే ఇంగ్లండ్ పత్రికల్లో, సాహిత్యంలో తలెత్తిన వ్యాపార ధోరణికి రచయితలు ఎలా బలయిపోయారో చక్కగా తెలియజేశారు.

– సోనియా సుమన్, బెంగళూరు

★ ఆత్మకథ నవల అద్భుతం. ఇలాంటి ఇతివృత్తంతో నవల రావడమే చాలా విశేషం. అరుదైన నేపథ్యం, చక్కని శైలితో సందేశాన్నిచ్చింది ఈ నవల. సామాజిక స్పృహతో కూడిన ఇలాంటి నవలలు అన్ని భాషల్లోనూ రావాలి. ఈ నవలకు కూడా మంచి ప్రచారం జరగాలి. ఇందులోని సందేశం ప్రపంచానికంతా పంచాలన్పిస్తుంది. ఇలాంటి మంచి నవలను అందరూ ఆదరించాలి. గొప్ప నవలను అందించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

–లక్ష్మి, అయినవిల్లి

★ పైడికొండల వెంకటేష్ చతుర నవల 'ఆత్మకథ' మొదటి అర్ధభాగం పేద ప్రజల అనాలోచిత ధోరణి ఎంతటి దారుణాలకు దారితీస్తుందో, వారిలో రేకెత్తే ఎన్నో కోరికలను ఎలా అణగారుస్తుందో పరిశీలనాత్మకంగా వివరించింది. ఈ నవల నిరాశ నిస్పృహల్లో ఉన్నవారిలో పాజిటివ్ దృక్పథం వృద్ధిచేసేలా ఉంది. ముగింపు కూడా చక్కని సందేశంతో ఉండటం చాలా బాగా నచ్చింది. ఇక మినీ కవితలు హృదయ స్పందనలకు నెలవులు. ఇతర శీర్షికలు సైతం భేషుగ్గా ఉన్నాయి.

–అనుముల శివాణి, కిషన్‌పుర, హన్మకొండ

---


చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
vipula.chatura@gmail.com

చిన చేపను పెద చేప మింగే సామాజిక న్యాయానికి రైతులు, చిరువ్యాపారులు, ఉద్యోగులు చెల్లిస్తున్న మూల్యమేమిటి? ఆశపడి చేపల చెరువులు తవ్వించిన సన్నకారు రైతులు బికారులుగా మారడానికి దారితీస్తున్న పరిస్థితులేమిటి? అన్ని రంగాల్లోకి జొరబడే బడా వ్యాపార వర్గాల ఉక్కుపాదాల కింద చిరువ్యాపారులు చిత్తవుతున్న తీరు ఎలాంటిది? పెరిగిపోతున్న యాంత్రీకరణ కార్మికుల్ని రోడ్ల పాలెలా చేస్తోంది? వీటన్నింటి కారణంగా అతలాకుతలమవుతున్న సామాన్యుడి బతుకు ఘోషను ఆద్యంతం ఆసక్తికరంగా, కరుణార్ద్రభరితంగా ఆవిష్కరించిన సింహప్రసాద్ నవల **కొత్త చిగురు** చతుర ఉగాది కానుక!



ప చ్చని తివాసీ పరిచినట్లుండే వరి చేల స్థానే చెరువులు, ఎత్తైన గట్లు, కొన్ని గట్లమీద కొబ్బరి చెట్లూ, ఆయిల్ ఇంజన్లూ!

అక్కడక్కడా దిష్టి చుక్కల్లా చేలు!

ఆ దృశ్యం చూస్తోన్న వెంకన్న గుండె బరువెక్కింది. నిలబడే శక్తిలేనట్టు చెరువు గట్టుమీద కూర్చుండిపోయాడు.

చెరువు వంక చూశాడు. పదెకరాల రొయ్యల చెరువు. పాలేర్లు సీడ్ వేస్తున్నారు. రొయ్యలు ఎగిరెగిరి పడ్తూ ఆహారాన్ని అందుకుంటున్నాయి. కొబ్బరిచెట్లు ఎదిగాయి గాని ఎంచేతో కాపుకి రాలేదు.

ఆ చెరువు సుందరమూర్తిది.

ఆయనకి ఇలాంటి చెరువులింకో ఐదు ఉన్నాయి. సీడ్‌ని, ఫీడ్‌ని సప్లై చేసే దుకాణమూ ఉంది. అనాదిగా వస్తోన్న వడ్డీ వ్యాపారమూ ఉంది.

మరో పక్కకి చూశాడు వెంకన్న.

ఎనభైసెంట్ల వరిచేను పలచగా ఉంది. పీలగా ఉంది. రంగు మారి ఉంది.

అతడి కళ్ళల్లో కన్నీటి పొర కదలింది.

ఆ చేను వెంకన్నదే.

సుందరమూర్తి చెరువుని తవ్వుతూ ఆ పొలాన్ని అమ్మమన్నాడు. అమ్మడానికి ఇష్టపడలేదు వెంకన్న. రొయ్యల చెరువు పక్కన వరిచేను ఉంటే ఉప్పు పండుతుందిగాని వరి పండదని హెచ్చరించారంతా. గుండె గుభేలు మనగా గ్రామపెద్దల దగ్గర మొరపెట్టుకున్నాడు.

"ఓపికుంటే నువ్వూ తవ్వుకో. సిరిరా మోకాలడ్డుతానంటావేంటి? సుందరమూర్తే కాదు స్తోమతున్న ప్రతీవాడూ చెరువు తవ్వుతున్నాడు కదా? మనం వూరికే గోల చేస్తే ఎమ్మార్వో వచ్చి రంకెలేస్తాడు. ఎవరూ చెరువులు తవ్వకూడదని అడ్డు పడతాడు. నీ గురించి అందరి నోట్లో మన్ను కొడతానంటావేంటి? " అని సన్నగా మందలించారు.

పొలం అమ్మటమో, ఉంచు కోవటమో తేల్చుకోలేక వూగిసలాడాడు. కడకి దేవుడి మీద భారంవేసి ఊరుకున్నాడు.

వరి ఊడ్చాడు. ఒక పంట బాగానే ఉంది. తర్వాతి పంట నుంచి దిగుబడి తగ్గిపోయింది. ప్రక్కనే ఉప్పు చెరువు ఉండటంవల్ల భూమిలో మార్పు వచ్చింది. ఇలాగే ఊరుకుంటే చేను కాస్తా ఉప్పు బీడుగా మారిపోతుందని భయపడ్డాడు.

ఎక్కడో అక్కడ అప్పుచేసి చెరువు తవ్వుదామా అని చూశాడు. కాని నిరుత్సాహపరిచారంతా. ఎనభైసెంట్లలో సగం గట్లకే పోతుందన్నారు. మిగిలిన కాస్తలో చెరువు తవ్వి రొయ్యపిల్ల వేసినా ఖర్చెక్కువై మిగిలేదేం ఉండదన్నారు.

గాఢంగా నిట్టూర్చాడు వెంకన్న.

లేచి చేను చుట్టూ తిరిగి నీళ్ళూ పాళ్ళూ చూసి ఇంటిముఖం పట్టాడు.

"చేనెలా ఉంది? " దారిలో ఒకాయన అడిగాడు.

"పక్కనే సుందరమూర్తి చెరువు తవ్వేడు కదా. ఎండుతూ మాడుతూ ఉంది. నన్ను ముంచేస్తుందేమోనని గుబులుగా ఉంది బాబాయ్.."

"నువ్వు శానా తప్పు చేసేవొరేయ్. మఱ్ఱి చెట్టు నీడన మొక్క ఎదగదు. ఆయన అడిగినప్పుడు అమ్మేయ్యాల్సిందిరా"

"నీకు తెలిందేముంది బాబాయ్. నాకున్నది ఇక్కడ ఎనభై సెంట్లూ పత్రలో ఎకరవూనూ. ఈ చెక్క కాస్తా అమ్ముకుని ఏం తినను? "

"ఇప్పుడు బంగారం తినేస్తున్నావేంటి? ఇక వ్యవసాయాలు లాభం లేదోరేయ్. ఏవైనా కొట్టుకొస్తే రొయ్యల చెరువుల్లోనే! పత్రలోని చెరువు ఎలాగుందిరా? "

"ప్రస్తుతానికి బాగానే ఉంది మరి. ఏ రోజుకెలా మారుద్దో ఎవరుచెప్పగలరు? !"

"ఇదివరకు నాలుగురాళ్ళు మిగల్లే? "

"మూడు పంటల్లో మిగిలిందంతా

రెండు పంటల్లో పోయింది"

"వచ్చినా అంతే.. పోయినా అంతే. ఏమైనా మిగిల్తే అందులోనే మిగలాలి. లేదంటే" వాక్యాన్ని మధ్యలోనే తుంచేశాడు.

ఎందుకో ఒక్కసారిగా చెప్పలేనంత నీరసం ఆవహించేసింది వెంకన్నకి. తెలీని బాధ గుండెల్లో సుళ్ళు తిరుగుతోంది.

అన్యమనస్కంగా ఇంటికెళ్ళాడు. అరుగు మీద బస్కీ వేసుక్కూర్చుని గణగణ చదువుతున్నాడు శీను. ఆగి చిన్నకొడుకు వంక అపురూపంగా చూశాడు.

తొమ్మిదో తరగతి చదువుతున్న చిన్నకొడుకు ఆశాదీపంలా కన్పించాడు. అతడి కళ్ళల్లో కార్తీకమాసపు దీపాలు వెలిగాయి.

పెద్దకొడుకు గోపి చేతికందొచ్చేట్టులేడు. బాధ్యత లేకుండా తిరుగుతాడు. ఎవర్తో తిరుగుతాడో ఎందుకు తిరుగుతాడో!

శీను బుద్ధిమంతుడు. బాగా చదువుకుంటాడు. ఎలాంటి గర్వమూ లేకుండా గేదెల పని, పిడకల పని కూడా చూస్తాడు.

సన్నగా బక్కగా కురచైన దుస్తుల్లో ఉన్న శీను దగ్గరికెళ్ళాడు. తలనిమిరి "ఏం చదువుతున్నావు బిడ్డా" అన్నాడు.

"సోషల్ స్టడీస్. పంచవర్ష ప్రణాళికల గురించి చదువుతున్నాను"

"అంటే ఏంట్రా? "

"గ్రామాలు పట్టణాలూ అన్నీ అభివృద్ధి చెందటానికి ప్రభుత్వం పథకాలేసింది. ప్రజల సౌభాగ్యం కోసం అయిదేళ్ళ ప్రణాళికలని రూపొందించారు..."

"ఏం బాగో ఏవోఁ! నువ్వు మాత్రం శ్రద్ధగా చదువుకోరా బిడ్డా. మంచి ఉద్యోగం వస్తే నీడపట్టున సుఖపడుదువు గాని. నీ వల్లే సంసారం ఒడ్డున పడాలి. ఇక నా వల్లేంకాదు..."

స్వరం వణికింది. రెండు కన్నీటిబొట్లు ఉబికి వచ్చాయి. అవి కొడుకు కంటబడకుండా తల తిప్పుకుని లేచాడు.

చెప్పులు గుమ్మం బయట విడిచి ఇంట్లో కెళ్ళాడు. చేతి కర్రని గోడ మూలన నిలబెట్టాడు. పెరట్లో నులక మంచం వాల్చుకుని కూర్చున్నాడు.

బియ్యంలో రాళ్ళేరుతోన్న కనకం "మల్లీ! మీ నాన్నకి మంచినీళ్ళు తెచ్చివ్వే" అంది.

"పెళ్ళీడుకొచ్చింది పిల్ల! ఒకటి రెండు పంటలు కలిసొస్తే బావుండ్ను ఏదో సంబంధం చూసి ముడిపెట్టేద్దును" అనుకున్నాడు.

"గోపీ ఇంకా రాలేదా? ఎదవ స్నేహాలూ ఈడునూ. ఎక్కడెక్కడో తిరుగుతాడు. దమ్మిడీకి పనికిరాడు. ఈడి వయస్సు కుర్రాళ్ళు రొయ్యల చెరువులు చూసుకోడంలేదూ. ఈడికేమొచ్చిందో దొబ్బుడాయి!" విసుక్కున్నాడు.

"దేనికైనా కాలం కర్మం కలిసి రావాలి...." అంది కనకం.

"ఆఁ వస్తుందొస్తుంది. కాళ్ళు చాచుక్కూర్చుంటే వచ్చేది కాలం కాదు వయస్సు!"

వెంకన్న మాట విన్పించి వసారాలో పడుకున్న తల్లి "ఒరే అబ్బాయ్ చెరువులెలాగున్నాయిరా? " అని అడిగింది.

"బాగానే ఉన్నాయమ్మా."

"ఈ సారైనా ఆ భగవంతుడు చల్లగా సూత్తే బావుడ్ను. అప్పుచేసి లచ్చలట్టుకెళ్ళి చెరువులో పోశావు. ఈ రొయ్యలు నిన్నూ నన్నూ తింటాయి గాని మనల్ని బతికించవురా అంటే ఇన్నావు కాదు..."

"మీదంతా చాదస్తం. ఊళ్ళోవాళ్ళు మేడలూ మిద్దెలూ కడుతోంది రొయ్యలతో కాదూ! అత్తగారి మాటలకి దీర్ఘం తీసింది కనకం.

"నీదంతా పైచూపు. పరుగెత్తి పాలు తాగటం కన్నా నిలబడి నీళ్ళు తాగటం మంచిది ఏవఁనుకున్నావో!"

"మీది పాతకాలపు పద్ధతి. ఇది ఒంటెద్దు బండ్ల కాలం కాదు. రైళ్ళూ విమానాల కాలం!"

"చాల్లే. పెద్దదేదో అన్నదని వూరుకోవ

చ్చుగా. మాటకి మాట అనాలేంటి" భార్య మీద కోప్పడ్డాడు వెంకన్న.

"అనండనండి. నేనేగా పరాయిదాన్ని. అంతా కలిసి నన్నే అనండి!" పమిట కొంగుతో ముక్కు తుడిచింది.

"పుల్లారావు మావయ్యవాళ్ళూ భీమవరం వెళ్లిపోతున్నార్ట" స్థిమిత పడ్డాక అందామె.

"ఎందుకూ? "

"ఎందుకేవిటీ, బతకడానికి!"

అవాక్కయ్యాడు. భార్య వంక వెర్రిగా చూశాడు. పిమ్మట నిస్త్రాణగా మంచం మీద వెనక్కి వాలాడు.

పుల్లారావూ చిన్నరైతే. రెండెకరాల రొయ్యల చెరువు లీజుకి తీసుకుని చేశాడు. చావుదెబ్బ కొట్టింది. ఉన్నది కాస్తా అమ్మేసి అప్పులు తీర్చాడు. ఇప్పుడు పొట్ట చేత బట్టుకుని పట్నం వెళ్ళిపోతున్నాడు!

ఒకప్పుడు తూర్పు నుంచి కూలోళ్ళు పనుల కాలంలో ఇక్కడికి వలస వచ్చే వారు. ఇప్పుడు వారి రాక ఆగిపోయింది. కానీ ఇక్కడ్నుంచి రైతులూ కూలీలూ మరో చోటకి వలస పోతున్నారు. ఎంత చిత్రం! బతుకు కోసం ఆరాటం! పోరాటం!!

కడుపులో దేవినట్టనిపించింది.

చటుక్కున లేచాడు. కర్ర తీసుకుని చెప్పులు తొడుక్కుని వడివడిగా చెరువు దగ్గరికెళ్ళాడు వెంకన్న.

అప్పటికే వచ్చిన సాంబయ్య చెరువులోకి చూస్తున్నాడు.

ఇద్దరికీ చెరో ఎకరం పక్కపక్కనే ఉంది. ఇద్దరూ కలిసి చెరువు తవ్వేరు. జాయింటుగా రొయ్యల సాగు చేస్తున్నారు.

"ఎలా ఉన్నాయిరా సాంబయ్యా? "

"కొంటు బాగానే వచ్చేట్టుంది. ఈసారి మంచి సీడ్ దొరికింది"

"నీ నోటి సలవన ఈసారి నాలుగు రాళ్లొస్తే ఊపిరి పీల్చుకుంటాన్రా"

"మొన్నటి వైరస్ దెబ్బకి అంతా భయ పడుతున్నారు. ప్రతివాడూ లీజుకిచ్చేసి ఎక రానికి పన్నెండువేలో, పదేనువేలో జేబులో వేసుకోడం మంచిదనుకుంటున్నారు"

"లీజుకి తీసుకునేవోళ్ళూ తగ్గేరుగా. పైగా అరువు అంటున్నారు. వాళ్ళైనా నాలుగు రాళ్ళు మిగిల్తేనే కదా ఇచ్చేది"

"అరువిత్తే లాభం లేదురా. రొయ్య దగా చేసిందా పైసా ఇవ్వరు. చెరువొదిలేసి పోతారు"

"చావో బతుకో అన్నట్టుంది నా పని. ఉప్పుపాయ తగిలి వరిచేను రంగొస్తోంది. అప్పేమో రాత్రీ పగలూ పెరిగిపోతోంది. నా పేణాలన్నీ ఈ చెరువు మీదే పెట్టుకు న్నాన్రా సాంబయ్యా"

తోటి రైతు వంక సానుభూతిగా చూశాడు తప్ప జవాబివ్వలేదతడు. అతడి పరిస్థితీ అలాగే ఉంది మరి!




ఆకాశం బద్దలైనట్టు మిన్ను మన్నూ ఏకంచేస్తూ వర్షం...!

గోదావరి పొంగింది. వాగులూ వంకలూ పొంగాయి.

చెరువుల కట్టలు తెగాయి.

ప్రళయం సంభవించిందా అన్నట్టు భూమిని ముంచెత్తుతూ వరద...!

ఎటు చూసినా బీభత్సం! హాహాకారాలు!

చెరువులు మునిగాయి. ఇళ్ళు ముని గాయి. ఊళ్ళూ మునిగాయి.

రొయ్యలు కొట్టుకుపోతున్నాయి. 24 కౌంట్ రొయ్యలు.

"నా రొయ్యలు నా రొయ్యలు..."

వెంకన్న అరుస్తున్నాడు. వాటిని పట్టుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. ఈదుతున్నాడు. పడుతున్నాడు. లేచి వెంటబడుతున్నాడు. వెనకాల ఏడ్పులు వినిపించాయి. వెనక్కి తిరిగాడు. వరదలో కొట్టుకుపోతున్నారు తల్లీ, భార్యా, పిల్లలూ...!

"ఆగండాగండి రొయ్యలు పట్టుకొచ్చేస్తా"

వాళ్ళు మునిగి తేలుతున్నారు.

ఇటు రొయ్యలు... కాదు రూపాయల నోట్లు కొట్టుకుపోతున్నాయి.

వాటి వెంటపడ్డాడు. అరుస్తూ పిలుస్తూ ఏడుస్తూ...!

సుడిగుండం చుట్టేసింది.

అందులోంచి బయటపడాలని విశ్వప్రయత్నం చేశాడు. ఊహూ లాభంలేకుండా ఉంది. కాళ్ళు తేలిపోతున్నాయి. శక్తి సన్నగిల్లుతోంది... అరె! సుందరమూర్తి తన కాళ్ళు పట్టుకుని లాగేస్తున్నాడు... విదిలించబోయాడు, సాధ్యం కావట్లేదు...!

చిత్రం! రొయ్యలన్నీ తేలిపోతున్నాయి. మెల్లగా అతడూ తేలిపోసాగాడు...!

వెర్రిగా అరుస్తూ నిద్రలేచాడు వెంకన్న.

గుండె డొక్కు మోటారు కార్ల శబ్దం చేస్తోంది. ఒళ్ళంతా ముచ్చెమటల్లో తడిసి ముద్దయ్యింది.

పక్కనే చిన్న మంచంమీద పడుకున్న కనకం ఉలిక్కిపడి లేచింది. భర్తని చూసి కలవరపడింది.

భుజం పట్టుకుని కుదిపింది. ఎగసి పడుతోన్న గుండెల్ని చేత్తో నిమిరి "గుండెలెలా కొట్టుకుపోతున్నాయో చూడండి. పీడకల వచ్చిందా? " అడిగింది.

తలాడించాడతను భయం భయంగా.

"ఏదేదో ఊహించుకుంటూ ఇదైపోతారు. ఇంత అధైర్యం అయితే ఎలాగా...! మీకేమైనా అయితే మా గతేంకాను? "

మంచం కింద వున్న నీళ్ళ చెంబు అందించింది.

ఆమె మాటలకి మరింత బెదిరాడు. ఆత్రంగా చెంబెడు నీళ్ళూ తాగేశాడు.

"అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడు. కళ్ళు మూసుకుని పడుకోండి" పమిట కొంగుతో అతడి ముఖం, వక్షం తుడుస్తూ అంది.

"భయంగా వుందే కనకం. అప్పుల ఊబిలో నిలువునా కూరుకుపోయాం. ఎనభై సెంట్ల మీద వచ్చే పంటకోత ఖర్చుకే చాలదు. రొయ్యల పంట చేతికందితే అదృష్టమే. లేకపోతే...!"

"రాత్రీ పగలూ అని లేకుండా తిరుగుతున్నారు. చంటిబిడ్డని సాకినట్లు సాకుతున్నారు. మీ కష్టం ఊరికే పోదు"

"పిచ్చిదానా! అవి సత్తెకాలపు మాటలు. ఇప్పుడు గట్టుమీద కూకున్నోడు మారాజై పోతున్నాడు. చేలోదిగి చెమటోడ్చినోడు తిండిలేక చెదపట్టి పోతున్నాడు"

"మీవన్నీ అనవసర భయాలు. లోకంలో ఎందరు బతకడంలేదు? "

ఆమె మాటలు విన్పించుకోకుండా అన్నాడు, "పెద్దోడు దారిలో పడలేదు. పిల్ల గుండెలమీద కుంపటిలా కూర్చుంది"

"గంతకి తగ్గ బొంత దొరక్కపోదు. పడుకోండి.. మనసులో దిగులు పెట్టుకోమాకండి. అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడు. నారు పోసినోడు నీరు పోయడేంటీ..."

ఆ మాటలు అతడి మీద పనిచేశాయి. మనస్సు కుదుటపడింది. ఏదో ఆశ పెట్టింది. భవిష్యత్తు భరోసా ఇచ్చింది.

కళ్ళు మూసుకుని పడుకున్నాడు

## కొత్తగాలి...

**చుట్టాలు**
**రావటం చూసి**
**పారి పోయింది**
**కోడిపుంజు**

**- ఆచార్య కొలకలూరి ఇనాక్, హైదరాబాద్**

వెంకన్న. అయినా కనురెప్పల ఉలికిపాటు తగ్గలేదు!

★ ★ ★

గోపీకి అన్నం వడ్డించి ఆ పక్కనే పీట వాల్చుకుని కూర్చుంది కనకం.

తల్లి హితబోధ చెయ్యబోతోందని అర్థమయిందతడికి. ముఖం అప్రసన్నంగా పెట్టుకుని "ఎప్పుడూ ఇవే కూరలా? వంకాయ పులుసు, గోంగూర పచ్చడి. తినలేక ఛస్తున్నాను" అన్నాడు అరుస్తున్నట్టుగా.

"దొడ్లో నాలుగు మొక్కలున్నాయి గనుక ఈ మాత్రమైనా తింటున్నాం. అందుకు సంతోషించు"

"నాకు చాతకాదు"

"సంపాదించుకురా. రోజూ మాంసమూ చేపలూ వండుతాను"

"చూస్తూండు ఏదో రోజున మీ కళ్ళు తిరిగేంతగా సంపాదిస్తాను"

"ఆ రోజొస్తే మాకంటే సంతోషపడే వాళ్ళెవరూ ఉండర్రా. నువ్వు సంపాదనాపరుడివి కావాలి, సుఖపడాలి అనే కదుర్రా మా ఆశా ఆరాటమూను, నా మాట విని మళ్ళీ పరీక్ష రాయరా"

"బికామా? ఇప్పటికి మూడుసార్లు ఓడిపోయాను. ఇక నాతరం కాదు"

"పోనీ రొయ్యల పని చూస్తూ నాన్నకి సాయపడకూడదూ. నీ గురించి ఒకటే ఇదై పోతున్నారు ఆయన. ఎటూ కాకుండా ఏమైపోతావో అని ఆయన బెంగ!"

"వ్యవసాయాలేం లాభం లేదమ్మా. పుట్టినప్పట్నుంచి వ్యవసాయం చేస్తున్నాడు నాన్న. ఏమైనా సంపాదించారా? లేదు. ఈ ఇల్లు కూడా తాత కట్టిందే. తాత నాన్నకి అయిదెకరాలిస్తే ఇప్పుడు రెండెకరాలు మిగిలింది. రేపు మా చేతికొచ్చేక అదీ మిగల్దు. హారతికర్పూరమై పోతుంది. మట్టి నమ్ముకుంటే నోట్లో మన్నే"

బుగ్గలు నొక్కుకుందామె.

"అన్నిటికీ అన్నీ చెబుతావు. ఇంకెలా బతుకుతానంటావురా? !"

"వ్యాపారం చేస్తా. ఇవాళ రేపు లాభాలన్నీ వ్యాపారస్తులవే. నాన్నని ఓ యాభై వేలు సర్దమను. ఏడాది తిరిగేసరికి లక్ష సంపాదిస్తా. నాలుగేళ్ళలో మేడ కట్టేస్తా"

"నువ్వంతటి వాడివైతే సంతోషమేరా కాని అంత డబ్బు ఎక్కడ పుడుతుంది చెప్పు? ఇప్పటికే రొయ్యల్ని మేపడానికి ఉన్నదంతా ఆ సుందరమూర్తికి తాకట్టు పెట్టేశారు మీ నాన్న"

"ఎనభై సెంట్ల చెక్క అమ్మేస్తే సరి. సుందరమూర్తి గోతికాడ నక్కలా కాచుక్కూర్చున్నాడు కదా, వెంటనే కొనేస్తాడు!"

"నీకు పుణ్యం ఉంటుంది గాని గట్టిగా అనకురా. నానమ్మ విన్నదంటే నిన్నూ నన్నూ కలిపి తిట్టిపోస్తుంది"

"అక్కడికి ఆవిడ తిట్లని మనం లెక్క చేస్తున్నట్లు! తను గొణుగుతూనే ఉంటుంది మనం చేసేది చేస్తూనే ఉంటాం"

"ఆ పొలం నానమ్మకి పుట్టింటి వారు పసుపు కుంకాల కింద ఇచ్చిందిరా. అది అమ్మడానికి నానమ్మ ససేమిరా ఒప్పుకోదు. ఏ కళనో ఉండి ఆవిడ ఒప్పుకున్నా మీ నాన్న ఒప్పుకోరు. అదంటే ఆయనకి ప్రాణం. తిండానికి నాలుగ్గింజలిస్తోంది అదే కదురా. అది లేకపోతే బియ్యం కూడా కొనుక్కోవాల్సిందే ఖర్మ!"

"డబ్బు పడేస్తే అంతకంటే మంచి బియ్యం బజార్లో బోల్డు దొరుకుతాయి"

"చాల్లేరా. నోటికెంత వస్తే అంత అనేసెయ్యడవే. లోకానికి అన్నం పెట్టేవాళ్ళంరా. మనం బియ్యం కొనుక్కోవడం ఏవిటి దరిద్రం కాకపోతే!"

"మీకన్నీ దరిద్రాలే. బతుకు తెరువు చూసుకుంటానంటే డబ్బివ్వనంటారు. ఇంకెలా బతకాలి? ఈ బతుక్కన్నా చావు నయం" కోపంగా విసురుగా కంచంలో చేతులు కడిగేసి లేచిపోయాడు గోపి.

తల్లి పిలుస్తున్నా బయటికెళ్ళిపోయాడు.

"మాయదారి పిల్లలు! రేపేం తవ్వి తల కెత్తుతారో గాని ఇప్పుడు మాత్రం చంపుకు తింటున్నారు...!" ఉక్రోషపడింది కనకం.

బిడ్డ కడుపారా తినకుండా లేచి వెళ్ళినం దుకామె కళ్ళల్లో నీళ్ళూరాయి.

"ఎవర్నే తిడుతున్నావ్" ముసలావిడ అడిగింది.

"ఇంకెవర్నీ మీ పెద్ద మనవడ్ని. అన్నం తినకుండా లేచిపోయాడు"

"వాడ్నేమీ అనకే, మీ మావగారి పేరెట్టు కున్నాడు. ఇవాళ గాకపోతే రేపు ఇవరం తెలుసుకుని దార్లో పడతాళ్ళే"

"ఏం తెలుసుకుంటాడో? వాడూ వాడి పద్ధతులూ మాటలూ చూస్తోంటే భయమే స్తోంది" కళ్ళు తుడుచుకుంటూ అంది.

దోసెడు కనకాంబరాలు కోసుకుని తూనీ గలా ఎగుర్తూ వచ్చింది మల్లిక.

"ఎక్కడి కెళ్ళేవే..."

"బుల్లి తాతగారి దొడ్లో..."

"ఈ వేళప్పుడు ఆ దొడ్లో ఏం పని? జర క్కూడనిదేదైనా జరిగితే నీ బతుకేంకా వాలి!..." కొడుకు మీద కోపాన్ని కూతురు మీద ప్రదర్శించింది కనకం.

మొహం ముడుచుకుని పెరట్లోని వేప చెట్టు నీడకెళ్ళి కూర్చుంది మల్లిక.

"నేను అలంకరించుకుంటే కిట్టదు. అందంగా ఉంటానని అమ్మకి కుళ్ళు!" అను కుంది.

పూలు గుచ్చుతూ దానితోబాటు అంద మైన కలల్ని కూడా గుచ్చసాగిందామె.

తన అందాన్ని చూసి రాకుమారుడు రెక్కల గుర్రంపై వచ్చి తీసుకెళ్తాడని ఆశ!

ఇంతలో 'అన్నయ్యా' అంటూ జనార్ధనం వచ్చాడు.

అతడి స్వరం వింటూనే కాళ్ళు కడుక్కో డానికి చెంబుతో నీళ్ళిస్తూ "ఎప్పుడొచ్చా వయ్యా? " అడిగింది కనకం.

"పని వుండి నర్సాపురం వచ్చాను. ఎలాగూ ఇంతదూరం వచ్చాను కదా అన్న య్యని చూసి వెళ్దామని! లేడా వదినా? "

గదిలోంచి పాత చెక్కకుర్చీ పమిట కొంగుతో తుడిచి తెచ్చివేస్తూ అంది, "చెరు వులొచ్చేక క్షణం తీరికుండట్లేదనుకో. కంటి మీద కునుకు లేకుండా కనిపెట్టుకుని వుండాల్సొస్తోంది..."

మాటల్లోనే వచ్చాడు వెంకన్న.

ఇద్దరూ అన్నదమ్ముల బిడ్డలు. జనా ర్ధనం కన్నా వెంకన్న రెండేళ్ళు పెద్ద. కాని పదేళ్ళు పెద్దలా కన్పిస్తాడు. జనార్ధనం హైదరాబాదులో కేంద్ర ప్రభుత్వ ఆఫీసులో ఆఫీసరుగా పనిచేస్తున్నాడు.

"ఏవిట్రా.. ఎప్పుడొచ్చావు? మరదలూ పిల్లలూ అంతా బావున్నారా" ఆప్యాయంగా పలకరించాడు వెంకన్న.

మంచినీళ్ళిస్తూ "నాగమణికి సంబంధం చూడటానికొచ్చాట్ట" అంది కనకం.

"నర్సాపురం సంబంధమే. కుర్రాడు కాలే జీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు..."

"మరింకేంరా.. మన ప్రాంతం! తెలిసిన సంబంధం. అంతకంటే ఏం కావాలి చెప్పు? మంచిరోజు చూసి కదుపుదాం"

"వాళ్ళని కలిసి వచ్చాన్లే. అబ్బాయి హైదరాబాదు రాడట..."

"రాకపోతే పోనీయ్. ఇక్కడే ఉంటారు. మేమంతా లేమా? "

"మణికి హైదరాబాదు వదలటం ఇష్టం లేదు. మీ మరదలు కూడా అక్కడి సంబం ధమే చెయ్యాలంటోంది..."

అయోమయంగా చూశాడు వెంకన్న.

"మన ఊరు మన వాడా కాదని అక్కడె క్కడో మహానగరంలో ఊరేగుతానంటారే విట్రా. అక్కడేం బావుకుంటారు? ఇక్కడైతే బంధువులూ, కావాల్సిన వాళ్ళూ ఉన్నారాయె. రిటైరయ్యాక నువ్వు మాత్రం ఇక్కడి కొచ్చెయ్యవూ? !"

ఆ మాటలు జనార్ధనానికి రుచించలేదు.

"నీకు తెలీదులే అన్నయ్యా. సిటీలో పుట్టి పెరిగిన వాళ్ళకి పల్లెలో ఊపిరాడదు.

నేనూ అక్కడే సెటిలైపోతాను. అక్కడే ఇల్లు కట్టాను కదా. మొన్నీ మధ్య పిల్లల పోరు పడలేక మారుతీ కారు కొన్నాను"

"మీ అన్నయ్య మాటలేం పట్టించుకోకయ్యా. ఆయనకి ఈ ఇల్లే కైలాసం, ఊరే వైకుంఠం. ఈ గాలి, ఈ భూమి, ఈ గోదారి నీళ్ళు లేకపోతే బతకలేమనుకుంటారు" చిన్నగా నవ్వుతూ అంది కనకం.

"అన్నయ్య ఎరిగిన ప్రపంచం ఇదేమరి"

"త్వరగా వంట చెయ్యవే. ఎప్పుడు తిన్నాడో ఏమో..." అన్నాడు వెంకన్న.

"భోంచేసే వచ్చాను. ఇప్పుడలాటివేం పెట్టుకోవద్దు"

మల్లిక టీ తెచ్చిచ్చింది.

"ఏం మల్లికా.. ఏం చదువుతున్నావు? "

"ఇది చదివి ఉద్యోగాలు చెయ్యక్కర్లేదు, ఊళ్ళేలక్కర్లేదుగాని గోపీ గురించే దిగులుగా ఉందయ్యా. బీకామ్ తప్పేడు. ఏదైనా ఉజ్జోగం చూసి పుణ్యం కట్టుకో"

"హైదరాబాద్ పంపించండి. ఏదో కంపెనీలో పెట్టిస్తాను"

"నీ కడుపు చల్లగా ఎంత చల్లని మాట చెప్పేవు. నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళు బతకవయ్యా" సంబరపడిపోయింది కనకం.

వెంకన్న కూడా ఆనందపడ్డాడు "వాడికో దారి దొరికితే అంతేశాన నా పని తేలాటం అయిపోద్దిరా జనార్ధనం"

జనార్ధనాన్ని సాగనంపడానికి బస్టాండుకు వెళ్ళాడు వెంకన్న.

"వచ్చిందెవరే? " సూరమ్మ అడిగింది.

"మీ తోడికోడలు కొడుకు జనార్ధనం..." కోడలంది.

"మరి నన్ను పలకరించలేదేమే? "

"పడుకున్నారనుకున్నాడేమో..."

"అదేం కాదులేవే. నాలుగు రాళ్ళు సంపాదించేసరికి కళ్ళు నెత్తిమీద కొచ్చాయి. బంధాలూ బంధుత్వాలూ ఎక్కడ గుర్తుంటాయి! చిన్నప్పుడు వెంకన్నతోబాటు వాడికి ఇంతింత మీగడ పెట్టేదాన్ని. కంచం నిండా గడ్డపెరుగు పోసేదాన్ని. నెయ్యికాచి సున్నుండలు చేసి పెట్టేదాన్ని. అవన్నీ ఎక్కడ గుర్తుంటాయీ! ఒక ముద్ద పెట్టినా కుక్కకి విశ్వాసం ఉంటుందిగాని నిలువునా దోచిపెట్టినా మనిషికి ఉండదు."

"చిన్న కారు కొన్నాట్ట. ఇదంతా జనార్ధనం భార్య అదృష్టం. కారుల్లో తిరిగే యోగం పట్టింది దానికి!" నిట్టూర్చింది కనకం.

"కార్లూ, మేడలూ అని ఊరేగుతాం గాని రేపు పోయేటప్పుడు ఇవన్నీ పట్టుకుపోతామా ఏవన్నానా! ఈ భోగాలూ భాగ్యాలూ మూణ్ణాళ్ళ ముచ్చటేనే పిచ్చిదానా. పోయేప్పుడు పూచికపుల్ల కూడా వెంటరాదు..." తనలో తను గొణుక్కోసాగింది ముసలమ్మ.




"ఒరే వెంకన్నోయ్! సర్వనాశనం అయిపోయిందిరోయ్!" వీధిలోంచి గావుకేకలు పెట్టాడు సాంబయ్య.

కంచం ముందు కూర్చుని, ముద్ద నోట్లో పెట్టుకోబోతున్న వెంకన్న ఉలిక్కిపడ్డాడు.

మరుక్షణం ముద్ద కంచంలో వదిలి, "ఏంట్రా" అంటూ వీధిలోకి పరుగెత్తాడు.

ఆడవాళ్ళు అదుర్తోన్న గుండెల్తో అనుసరించారు.

"వైరసొచ్చిందిరా. రొయ్యలన్నీ చచ్చిపోతున్నాయి" ఘొల్లుమన్నాడు సాంబయ్య.

వెంకన్న గుండెల్జారిపోయాయి.

నిలువునా కంపిస్తూ పిచ్చిగా చూశాడు.

మరుక్షణం నారి సంధించి వదిలిన బాణంలా పరిగెత్తాడు. అతడి వెనక సాంబయ్య, శీను ఉరికారు.

ఏడుస్తూ పరుగెడుతూ పడుతూ లేస్తూ చెరువు దగ్గరికెళ్ళాడు వెంకన్న.

చెరువు మీద రొయ్యలు పరిచినట్టుగా ఉందా దృశ్యం!

అది చూసి తట్టుకోలేకపోయాడు. గుండె పట్టుకుని కూలబడ్డాడు.

అది సాంబయ్య గమనించలేదు.

"నిలువునా నాశనం అయిపోయాంరా. పెళ్లాం పిల్లలకి రెండు ముద్దలు కూడా పెట్టలేంరా. అంతా కలిసి ఎండ్రిన్ తాగాల్రా" శోకాలు తీశాడు.

గిలగిలా కొట్టుకుంటున్న తండ్రిని గట్టిగా పట్టుకుని "నాన్నా నాన్నా..." అంటూ అరుస్తూ ఏడ్చాడు శీను.

కొడుకుని చూశాడు. బాధని బిగబట్టి చూశాడు. సానుభూతిగా చూస్తూ తలని మిరి వక్షానికి హత్తుకున్నాడు. మాట రావట్లేదు. చెమటతో తడిసి ముద్దయ్యాడు. మరుక్షణం కుప్పకూలిపోయాడు వెంకన్న.

పక్కపొలాల్లో పనిచేస్తున్న నలుగుర్ని కేకేశాడు సాంబయ్య. అంతా వచ్చి చేతుల మీద వెంకన్నని ఇంటికి మోసుకెళ్ళారు.

ఘొల్లుమన్నారు ఆడవాళ్ళు. వాళ్ళని కసిరి మంచంమీద పడుకోబెట్టారు. ఒకరు డాక్టర్ కోసం పరుగెత్తారు.

గుండెల్ని మర్దన చేయమన్నాడో పెద్దాయన. మెల్లగా గుండెప్రాంతాన్ని రుద్దసాగాడు శీను.

డాక్టరొచ్చాడు. ఇంజెక్షన్లు చేశాడు. మందులిచ్చాడు.

మరో గంటకి తేరుకున్నాడు వెంకన్న.

"రొయ్యలు..." అంటూ సాంబయ్య కోసం కలయచూశాడు.

"ఇప్పుడే సాంబయ్య వెళ్ళాడు. రొయ్యల్ని పట్టించేత్తానన్నాడు" ఎవరో చెప్పారు.

నిట్టూరుస్తూ కళ్ళు మూసుకున్నాడు. కన్నీటి ధారలు మౌనంగా కారుతున్నాయి!

★ ★ ★

వెంకన్న కోలుకున్నాడుగాని గడప దాటటం లేదు.

ఇంట్లోవాళ్ళంతా బిక్కు బిక్కుమంటూ ఉన్నారు. జరిగింది తలచుకోవాలంటేనే భయంగా ఉంది అందరికీ.

రొయ్యల చెరువు భారీగా దెబ్బతీసింది. సీడ్ ఖర్చు కూడా రాలేదు. ఎక్కడి అప్పులు అక్కడే ఉండిపోయాయి. భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంది!

ఊళ్ళో వాళ్ళొచ్చి ఎవరెవరి చెరువులు దెబ్బతిన్నాయో చెప్పి ఓదార్చుతున్నారు.

చెరువు ఎండగట్టి ఒకపంట ఆపేస్తే మరో పంట బ్రహ్మాండంగా ఉంటుందని ఆశపెట్టారు కొందరు.

"రొయ్యల సాగు లాటరీలాంటిదొరేయ్. తగిల్తే అందలం ఎక్కేస్తాం. దెబ్బకొడితే అగాథంలో పడిపోతాం" అంటూ వేదాంతం వల్లించారు.

మౌనంగా ఉండిపోయాడు వెంకన్న.

మనోవ్యాధేమోనని హడలిపోతున్నారు సూరమ్మా కనకమూ.

గోపీ మాత్రం నిర్లక్ష్యంగా తలెగరేశాడు.

"వ్యవసాయంకన్నా వ్యాపారం నయమని ఎప్పుడో చెప్పేను. ఇప్పుడైనా కళ్ళు తెరవండి" అన్నాడతడు.

ఒకరోజున "వెంకన్నగారూ" అంటూ వచ్చాడు రొయ్యల ఫీడ్ వ్యాపారి. అతడి దగ్గర అరువుకి ఫీడ్ కొన్నారు. పాతబాకీ కొంత మిగిలే ఉంది. కొత్త బాకీ పూర్తిగా అలాగే ఉండిపోయింది.

"బాకీ పూరాకి పూరా అలాగే ఉండిపోయింది. సగమైనా జమేస్తే బావుంటుంది. నాకైనా రొటేషన్ తిరగాలి కదా..."

"కాలూ చెయ్యీ కూడదీసుకునే దాకా కొంచెం ఆగండి. మీ బాకీ ఎగేసే రకాన్ని

కాదు. కొంచెం ఓపిక పట్టండి చాలు. నేనే వచ్చి మిమ్మల్ని కలుస్తాను"

"సాంబయ్యగారిక్కూడా చెప్పండి. ఆయన బాకీ కూడా ఎక్కువగానే ఉంది. వీలుపడితే కలిసే వెళ్తాన్లెండి"

అతడెళ్ళాక, "ఏవంటాడు? " భార్య అడిగింది.

"తల తాకట్టు పెట్టి అయినా సరే కొంత బాకీ తీర్చాలట. అప్పుడు గాని మళ్ళీ అరువివ్వట్ట. ఇంకొకరి దగ్గరకి అరువుకెళ్తానేమోనని వెళ్ళొద్దని హెచ్చరిస్తున్నాడు. వాళ్లంతా ఒకటేలే. తోడు దొంగలు. మేం ఒకటిగా ఉండలేం గాని వాళ్లుంటారు. అందుకే రూపాయికి నాలుగు రూపాయలు వడ్డీ గుంజుకుంటున్నారు. అసలీ రొయ్యలు వీళ్ళ బాగు కోసమే వచ్చాయి"

"ఏం చేద్దామంటారు..."

"ఏవీ పాలుపోవడం లేదు. మళ్లీ రొయ్య పిల్ల వెయ్యలేనేమో అన్పిస్తోంది. సుందరమూర్తి కూడా అప్పివ్వడు..."

"పోనీ అబ్బాయి అన్నట్టు..."

అతడు సూటిగా చూడటంతో మిగతా మాటలు మింగేసింది కనకం.

సాయంత్రం ఎండ తగ్గేక పైపంచెని భుజాల చుట్టూ కప్పుకుని సాంబయ్య ఇంటికెళ్ళాడు వెంకన్న.

అరుగుమీద చతికిలబడి ఒంటరిగా కూర్చున్నాడు సాంబయ్య. అతడి పక్కన సగంలోనే ఆరిపోయిన చుట్ట ఉంది.

కాస్సేపు మౌనం వహించేక మెల్లగా అన్నాడు వెంకన్న, "ఒక క్రాపు వెయ్యకుండా ఊరుకుంటే మంచిదంటున్నారు. ఒకవేళ వేద్దామన్నా ఎక్కడా అప్పు పుట్టేట్టు లేదనుకో. నువ్వేమంటావు"

"అమ్మేద్దామనుకుంటున్నాను"

నెత్తిన పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాడు.

"ఇప్పటికే కుదేలైపోయాను. ఇంకోపాలి దెబ్బతిందనుకో ఇల్లుసైతం అమ్మినా బాకీ తీరదు. అందుకని ఇప్పుడే అమ్మేసి కర్నాటక వెళ్ళిపోదామనుకుంటున్నాను"

"అక్కడా భూమిని నమ్ముకోవాల్సిందేగా"

"రొయ్యల కన్నా భూమే నయంరా. ఒక్కసారే దివాలా తీయించదు... సింధనూర్లో భూములు చౌకట. బాగు చేసుకుని వ్యవసాయానికి అనుకూలంగా మార్చుకుంటే బంగారం పండుతుందంటున్నారు. తణుకు ఏరియా వాళ్లు చాలామంది వెళ్ళార్లే. వాళ్ళ ద్వారా వాకబు చేస్తున్నాను. కొందరేమో తెలంగాణా వెళ్ళమంటున్నారు. నా కంతగా ఇష్టం లేదు..."

"తెలంగాణా అంటే ఎక్కడ? "

"గద్వాల దగ్గర. ఏదో ప్రాజెక్టు వచ్చిందట. అక్కడా భూమిరేట్లు పెరుగుతున్నాయట్లే. అయితేనేం? ఇక్కడ ఎకరం అమ్మి అక్కడ పదెకరాలు కొనుక్కోవచ్చు అందులో సగం సాగులోకొచ్చినా అదృష్టమే కదా"

"ఇదేదో బాగానే ఉన్నట్టుంది. నలుగురూ ఏవంటారో అడుగుతానుండు..."

తిన్నగా ఇద్దరు పెద్దల దగ్గరికెళ్ళి విషయమంతా వివరించాడు వెంకన్న. అప్పు సంగతి, ఎదిగిన పిల్లల బాధ్యత గురించి చెప్పి సలహా కోరాడు. సాంబయ్య ఆలోచన గురించి కూడా చెప్పేడు.

"ఇప్పటికే ఊళ్ళో నీ పని అయిపోయిందని చెప్పుకుంటున్నార్రా. సాంబయ్యలాగే నువ్వూ అప్పుకి ఓ గీత గీసేస్తే ఇక మిగిలేదేదో మిగుల్తుంది. లేకపోతే ఉన్నదంతా చుట్టబెట్టేయొచ్చు" అన్నారు.

ఆ రాత్రి ఇంట్లోని అందర్నీ కూర్చోబెట్టి అన్ని విషయాలూ చెప్పేడు వెంకన్న.

"ఈ సెరువులూ, రొయ్యలూ మన ఇంటా వంటా లేవురా. వాటి జోలికెళ్ళొద్దురా అని నెత్తీ నోరూ కొట్టుకున్నాను. ఇన్నావా. లచ్చలొత్తాయని పరుగెట్టావు. సూడేవయిందో బొక్కబోర్లా పడ్డావు. పెనం మీంచి పొయ్యిలోకి దూకేవు కదరా ఎంకన్నా!" అంది తల్లి సూరమ్మ బాధగా.

"కలిసొచ్చినోళ్ళకి రాలేదేంటిగాని ఇక వ్యవసాయం కట్టిపెట్టేద్దాం. ఉన్నదమ్మేసి నర్సాపురమో భీమవరమో వెళ్ళి బిజినెస్ చేద్దాం" ఉత్సాహంగా అన్నాడు గోపి.

"వ్యాపారమంటే మాటలు కాదురా. ఆనూ పానూ తెలియాలి. తాత ముత్తాతల్నుంచీ భూమినే నమ్ముకున్నాం. సింథనూరో గద్వాలో వెళ్ళి భూములు కొనుక్కుందాం..." అన్నాడు వెంకన్న.

"ఇన్నేళ్ళూ భూదేవికి చేసిన చాకిరీ చాల్దేంటి? హైదరాబాదెళ్ళిపోదాం" కనకం మాటలకి తుళ్ళిపడ్డారంతా.

వెంకన్న అయితే నోరు వెళ్ళబెట్టి గుడ్లప్పగించాడు. పట్నమంటే ఏవిటో కూడా తెలీని భార్య అలా అనడం నమ్మలేనంత వింతగా ఉందతడికి.

"అక్కడేం చేద్దామే. రోడ్లూడుద్దామా!" నవ్వేడు వెంకన్న అంత బాధలోనూ.

"అంత కర్మేంటి. మీ తమ్ముడు జనార్ధనం ఉన్నాడు కదా. పెద్ద ఆఫీసరాయె. మీకూ గోపీకీ ఉజ్జోగాలేయిస్తాడు. మల్లికి సంబంధం చూస్తాడు..."

కోడలి మాటకి అడ్డొచ్చింది ముసలామె.

"వూరుకోయే కనకం. గుమ్మంలో కొచ్చినోడు పెద్దదాన్ని నన్ను పలకరించడానికి నోర్రాలేదు గాని మీకు చేదోడౌస్తాడా? హవ్వ! ఎవరైనా వింటే నవ్విపోతారు!"

"అన్నయ్యని పంపించండి ఉద్యోగం వేయిస్తానని బాబాయ్ చెప్పేడుగా" అంత వరకూ శ్రోతలా వున్న మల్లిక అంది.

హైదరాబాద్ పేరు విన్నప్పట్నుంచీ ఆమె శరీరంలోని అణువణువూ పరవశిస్తోంది. కళ్ళముందు రంగు రంగుల ప్రపంచం వలయాలుగా తిరుగుతోంది!

"బాగా చెప్పేవు. అతగాడికి మీరెంత చేశారో గుర్తులేదూ? "

కనకం మాటలకి పాత సంగతి నెమరు వేసుకున్నాడు వెంకన్న.

జనార్ధనం ఇంటర్ పాసయ్యాక షెడ్యూల్డ్ తెగంటూ దొంగ సర్టిఫికెట్టు సాయంతో పెద్ద ఉద్యోగంలో చేరాడు. తర్వాత మరెవరు పిటీషను పెట్టారో మరెందుకనుమానం వచ్చిందో గాని అతడి కులం గురించి ఎన్క్వైరీకి వచ్చారు.

జనార్ధనం వచ్చి అన్నగారి చేతులు పట్టుకున్నాడు. వెంకన్న కరణాన్ని, రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ని, తాశీల్దార్ని అర్థించాడు. కాళ్ళు పట్టుకున్నాడు. చేతులు తడిపాడు.

పూర్వమెప్పుడో కొండ ప్రాంతం నుంచొచ్చి ఆ ఊళ్ళో స్థిరపడ్డారని అంచేత ఎస్టీ అవడం నిజమేనని రాయింపించాడు. గొడవ సద్దుమణిగింది. జనార్ధనం ఉద్యోగం నిలిచింది. త్వరత్వరగా ప్రమోషన్లూ వచ్చాయి.

"జనార్ధనం చేసిన మేలు మరిచే రకం కాదు" అన్నాడు వెంకన్న తలపంకిస్తూ.

"మీరు చేసిందానికి అతగాడు చెర్మంతో చెప్పులు కుట్టిచ్చినా రుణం తీరదు" అంది కనకం.

"బాగానే ఉంది సంబడం! కుక్క తోక పట్టుకుని గోదారి ఈదినట్టు ఆ జనార్ధనం గాడ్ని నమ్మి పట్నం ఎళ్తారేంటే? " బుగ్గలు నొక్కుకుంది ముసలావిడ.

"మరి ఇక్కడేం బంగారం మిగిలిందనీ!"

"ఇంటి కప్పు కింద కూచుని అలా ఎలా అంటున్నావే కనకం? మీరెళ్తే వెళ్ళండి. నేను మాత్రం ఈ ఇంటినీ ఊరినీ వదిలి రాను. నా కట్టె ఈ మట్టిలో కలిసిపోవాల్సిందే" తెగేసి చెప్పింది సూరమ్మ.

**కొత్తగాలి...**

**సెకనుకి**
**విలువొచ్చింది**
**పాపం!**
**నిమిషం**
**నివ్వెరబోయింది!!**

– కె. హుమాయూన్ సంఘీర్, హైదరాబాద్

"మీ గురించి మమ్మల్నందర్నీ ఇక్కడే చావమంటారా? " అంది కోడలు.

"ఇది గాకపోతే ఇంకోటి చూసుకోవాలి గాని ఏకంగా ఊరొదిలిపోవాలా? ఇంట్లో ఎలుకలున్నాయని ఇంటికి నిప్పెట్టిందట ఎనకటికెవతో నీలాటిది!"

"నిప్పు పెట్టింది నేను కాదు అప్పులోళ్ళు. ఆ పొగకి ఊపిరాడక ఉక్కిరి బిక్కిరవుతున్నారు మీ అబ్బాయి"

"చాలు చాలుగాని ఇంక తగ్గండి. సలహా ఇమ్మంటే కోడిపుంజుల్లా లేస్తారేం" విసుక్కున్నాడు వెంకన్న.

"పెళ్లాం బెల్లం తల్లి అల్లం అని ఊరికే అన్నారా! నీకు పెళ్లాం మాటే నచ్చుద్ది. దాని మాట పట్టుకుని ఏ గంగలో దూకుతావో దూకు..." అంటూ లేచి వెళ్ళబోయింది సూరమ్మ.

"కూర్చోమ్మా. ఇప్పుడు నీ మాటెవరు కాదన్నారనీ. మంచీచెడ్డా చెప్పాల్సిన దానివి నువ్వే కోప్పడితే ఎలాగే అమ్మా"

కొడుకు మాటలకి మెత్తబడింది. తిరిగి కూర్చుంటూ "అప్పు ఏ మాత్రం ఉంటుందంటావురా అబ్బాయ్" ఆరా తీసింది.

"ఫీడ్ కొట్టతను లక్షా ముప్పైవేల బాకీ ఉన్నానన్నాడు. అంతకాకపోయిన లక్షా పదివేల దాకా ఇవ్వాల్సుంటుంది. సుందరమూర్తి దగ్గర యాభైవేల దాకా అప్పు చేశాను. ఓ ముప్పైవేలు వడ్డీ అయి ఉంటుంది. చిల్లర మల్లర బాకీలు ఇరవై ముప్పైవేలు మించవు..."

"ఓర్నాయనోయ్ ఓరి దేవుడోయ్! ఇంతింత అప్పులు పెట్టుకుని ఎలా నిద్రపోతున్నావురా వెంకన్నా" ఆందోళనగా అంది సూరమ్మ గుండెలు బాదుకుంటూ.

"ఎక్కడ నిద్రపోతున్నారూ. దిగుల్తో అర్ధరాత్రుళ్ళు లేచి కూర్చుంటున్నారు!" అంది కనకం.

"ఆ హింస పగోడికి కూడా వద్దురా బిడ్డా. నా పొలం అమ్మేసైనా సరే, ముందు అప్పు తీర్చెయ్యరా. మనం రాత్రుళ్ళైనా నిద్రపోతాంరా. వడ్డీ ఉందే అది రాత్రీ పగలూ కూడా నిద్రపోకుండా పెరిగిపోద్దిరా. అంతా ఊడ్చెయ్యక ముందే మేల్కోరా ఎంకన్నా".

తల్లి మాటల్తో ఏకీభవిస్తూ తలాడించాడు వెంకన్న.

"అలాగేనమ్మా, సాంబయ్య ఎలాగూ బేరం పెడతానంటున్నాడు గనక ముందు చెరువు ఎకరమూ బేరం పెట్టేస్తాను. అప్పులన్నీ తీర్చేశాక ఏం చేస్తే బావుంటుందన్నది అప్పుడు ఆలోచిద్దాం".

ఆ మాటలు కనకానికి రుచించలేదు. మొత్తం అంతా అమ్మేసి పట్నం వెళ్ళిపోతే బావుండునని ఉందామెకి!




**వెం**కన్నా సాంబయ్యా రెండెకరాల రొయ్యల చెరువుని అమ్మకానికి పెట్టారు. కలిసి అమ్మితే మంచి బేరం రావొచ్చని ఆశించారు. అవసరమైతే విడివిడిగా ఇద్దరికి అమ్ముదామని కూడా అనుకున్నారు. ఎకరానికి మూడు లక్షలపైనే వస్తుందని లెక్కవేసుకున్నారు.

ఎంచేతో కొనడానికెవరూ ఉత్సుకత చూపలేదు. ఇంకో ఇద్దరు కూడా అమ్మేట్లున్నారని తెలిసి కంగారు పడ్డారు.

డబ్బున్నవారినీ, స్తోమతగల వారినీ కలిశారు. తమ గోడు చెప్పారు. పొలం గొప్పతనం వివరించారు. కొనుక్కోమని ఒకర

కంగా అర్థించారు. కాని ఎవర్నుంచీ సాను కూల సమాధానం లభించలేదు.

కొందరు అమ్మేవాళ్ళెక్కువయ్యారన్నారు. భూమి ధరలు పడిపోయాయన్నారు. రొయ్యల చెరువుల పని అయిపోయినట్టే అన్నారు. ఊడ్పు భూముల్లో రిస్క్ తక్కువన్నారు. రొయ్యల పంట దెబ్బతినడంతో ఎవరి దగ్గరా డబ్బు లేదన్నారు. ఉన్న డబ్బు మళ్ళీ పెట్టుబడికి కావాలన్నారు.

హతాశులయ్యారిద్దరూ.

"కొంటే సుందరమూర్తే కొనాల్రా. వెళ్ళి అడుగుదాం" అన్నాడు సాంబయ్య.

ఆయన్ని తప్ప ఊళ్ళోని ధనికుల్నందర్నీ అడిగారు. ఆయన్ని అడగటం వెంకన్నకి ష్టంలేదు. అయినకాడికి వేసుకుంటాడని అతడి భయం. ఆయన కొన్న భూములన్నీ చిన్న, సన్నకారు రైతుల్ని ఇరుకున పెట్టో, అప్పు ఒత్తిడి మీదో కొన్నవేనని అతడి నమ్మకం.

"కొంచెం ఓపిక పడదాం. వీలైన బేరం రాకపోదు. పొరుగూరి బ్రోకర్‌కి కూడా చెప్తాను" అన్నాడు వెంకన్న.

పెరట్లో మంచం వాల్చుకుంటూ ఉక్రోషంతో మండాడు వెంకన్న.

"కాలం చెడిపోయింది. ప్రతోడికీ ఎదుటోడిసొమ్ము ఊరికే ఏసుకోవాలన్న యావే!"

"ఏవయిందండీ" కనకం అడిగింది.

"ఇంకా ఏమవ్వాలే. పొలం బేరం పెట్టి అందరికీ లోకువైపోయాం. అయినకాడికి పొలం వేసుకుందామని చూస్తున్నారంతా"

"ఎంతకడుగుతున్నారు? "

"ఎకరం రెండు లక్షల నలభైవేలంట! వీళ్ళ బాబుసొమ్ము దాచి పెట్టారని తేరగా ఇస్తాననుకుంటున్నారు కామోసు...!"

"ఈ లెక్కన మొత్తం పొలం అమ్మినా అప్పులు తీరవు. ఏం తింటాం ఎలా బతుకుతాం!" ఉసూరుమంది కనకం.

కళ్ళు తిరిగినంత పనయ్యింది వెంకన్నకి. గబగబా మనసులో లెక్కవేసుకున్నాడు.

తల్లి పేరనున్న ఎనభై సెంట్లని కూడా అమ్మితే బొటా బొటీగా సరిపోతుంది.

హళ్ళికి హళ్ళి సున్నకి సున్న!

గుండె జారిపోయింది. కళ్ళలో కన్నీటి పొర కదిలింది.

కళ్ళ ముందు ఎదిగిన కూతురూ చిన్న కొడుకూ కదిలారు.

"ఏం చెయ్యను? ఎలా చావను? " పై పంచెతో ముఖం కప్పుకుని ఏడ్చేశాడు.

"ఛా. అంత ఇదైపోతారెందుకూ ఊరుకోండి. మీ అమ్మ వింటే బాధపడ్తారు..." అనునయించింది కనకం.

ఎంత చిన్నగా మాట్లాడుకున్నా వారి మాటలు సూరమ్మ చెవిలో పడనేపడ్డాయి.

కొడుకు గుండెల్లో సుళ్ళు తిరుగుతోన్న బాధ కన్నతల్లి పేగుల్ని మెలితిప్పింది.

"ఏంట్రా అబ్బాయ్. ఏవయిందిరా. నీలో నువ్వే కుళ్ళిపోతావెందుకురా. నేన్లేనూ. నా పొలం లేదూ. అప్పు ఊబి నుంచి నువ్వు త్వరగా బయటపడితే అంతే శాన. చెరువుకి బేరాలు రాకపోతే నా పొలం బేరం పెట్రా. బంగారంలాంటి పొలం. కంత తీస్తే చాలు పంటనీరు చేలోకొచ్చిపడద్ది. ఇట్టే తన్నుకుపోతారు.." కాళ్ళీడ్చుకుంటూ వచ్చి కొడుకు ప్రక్కన కూర్చుని వీపు నిముర్తూ అంది సూరమ్మ.

"ఇదివరకు నాలుగెకరాలు కౌలుకి చేసేవాడ్ని. పట్టుబడికి బండి తోలుకెళ్ళేవాడ్ని. ఏదోలా సంసారం ఈడ్చుకొచ్చేవాడ్ని. ఈ రొయ్యలొచ్చేక నా పని దివాలా అయిపోయిందమ్మా. ఎలా బతకాలో తెలీడం లేదు. నా బిడ్డల్ని తలచుకుంటే గుండె తరుక్కుపోతోంది..." తల్లి ఒడిలో తల పెట్టుకుని బావురుమన్నాడు.

"ఆడదాన్లా ఆ ఏడుపేంట్రా. వూరుకో. అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడ్రా. ఎన్నడూ ఒకరికి అన్యాయం చేసినవాళ్ళం కాదు. ఒకరికింత పెట్టేంగాని ఎవరి

సొమ్మా దోచుకున్న వాళ్ళం కాదు. మనకా దేవుడు అన్యాయం చెయ్యడ్రా అబ్బాయ్. చేసిన్నాడు వాడు దేవుడు కాదు వట్టి రాయి అయిపోతాడు..!" శపించిందా మాతృ హృదయం.

మల్లిక వచ్చింది. కూతురు కంటబడ కుండా కళ్ళు తుడుచుకున్నాడు. ధైర్యం తెచ్చుకున్నాడు వెంకన్న.

"మీకూ గోపీకి మంచి ఉజ్జోగాలు చూడ మని జనార్ధనానికి ఉత్తరం రాస్తే మంచిది. ఇప్పుడు మంచి బేరం రాకపోతే మళ్ళీ పంటల్లో అమ్మొచ్చు. ఈలోగా మనమూ హైదరాబాదులో నాలుగురాళ్ళు సంపాదించుకోవచ్చు" మెల్లగా తన అభి ప్రాయాన్ని నచ్చేలా చెప్పింది కనకం.

అదే మంచిదన్పించింది. పెట్టుబడి అక్కర్లేనిది అదొక్కటేనన్న సంగతి అతడు పదేపదే గుర్తు చేసుకున్నాడు.

భర్త ఎటూ తేల్చి చెప్పకపోయేసరికి మరో అస్త్రం ప్రయోగించదలిచింది కనకం.

ఆవిడకి ఎలాగైనా సరే హైదరాబాద్ వెళ్ళిపోవాలనుంది. అక్కడ బోల్డన్ని అవకా శాలుంటాయనీ చక్కని ఉద్యోగాలు లభిస్తా యనీ, జీతం నెల నెలా వచ్చి ఒళ్ళో పడు తుందనీ పిల్లలంతా ప్రయోజకులవుతారనీ కార్లలో తిరగొచ్చనీ మరిది జనార్ధనంలా బోల్డు సంపాదించుకోవచ్చనీ ఆమె ఆశ! కల!! ఆకాంక్ష!!!

"అక్కడికెళ్తే జనార్ధనం పుణ్యామా అని శీను చక్కగా చదువుకుని పెద్ద ఆఫీసరవు తాడు. మన కష్టాలన్నీ తీరిపోతాయి"

తలెత్తి శీను వంక చూశాడు. పితృ హృదయం పాలకడలిలా పొంగింది.

"నిజమే. శీను కోసమైనా వెళ్ళిపోదాం. ఇక్కడెలాగూ కాలేజి లేదు. రోజూ నర్సా పురం వెళ్ళి రావటం కష్టం. హైదరాబా దులో అయితే బోల్డన్ని కాలేజీలు. గొప్పగొ ప్పోళ్ళు చదివే పెద్ద కాలేజీలున్నాయి. శీను అక్కడే చదవాలి. గొప్ప వాడవ్వాలి. వాడి ద్వారా కుటుంబం వెలుగులోకి రావాలి".

వెంకన్న కళ్ళల్లో గుప్పుమన్న వెలుగు చూసి తృప్తిగా నిట్టూర్చింది కనకం.

ఆమెకి భవిష్యత్తు మోహినిలా ముగ్ధ మోహనంగా కన్పిస్తోంది!

★ ★ ★

శీను చేత జనార్ధనానికి ఉత్తరం రాయిం చాడు వెంకన్న.

రొయ్యల చెరువులొచ్చేక వరిసాగు తగ్గిం దన్నాడు. గతంలో కౌలుకి చేసేవాడ్ననీ కానిప్పుడా పరిస్థితి లేదని వివరించాడు. చెరువు లీజుకి తీసుకుంటే పెట్టుబడి లక్షల్లో కావాలన్నాడు. అప్పుచేసి తవ్విన చెరువువల్ల దివాలా తీశానన్నాడు. ఇక వ్యవసాయం చెయ్యగలస్థితిలో లేననీ, ఏదో నౌకరీ చూసుకోడం తప్ప గత్యంత రంలేదనీ రాయించాడు. సకుటుంబంగా హైదరాబాద్ రావాలనుకుంటున్నానని తెలియపరిచాడు. తనకీ గోపికి చిన్నవో చితకవో ఉజ్జోగాలూ, తలదాచుకోడానికో ఇల్లు చూసి పెట్టమని మరీ మరీ అర్థిస్తూ రాయించి సంతకం పెట్టాడు వెంకన్న.

ఉత్తరం పోస్టు చేశాక ఎంతో ఊరటగా అన్పించిందతడికి.

అద్దరి చేరేందుకు పడవ లభించినట్టు పొంగిపోయాడు.

"లక్షల మంది బతికే ఆ మహానగరం తమకింత నీడనిచ్చి కూడు పెట్టకపోదు. ఇక్కడ పనీపాటా లేక సంపాదన లేక మాడిపోయేకన్నా అక్కడే కలో గంజో తాగుదాం. అదృష్టం కలిసొస్తే ఇల్లూ వాకిలీ సమకూర్చుకుంటాం. శీను అందొచ్చే వరకూ కష్టపడితే చాలు ఆపైన సుఖమే సుఖం. చదువులో ప్రతీసారీ ప్రథముడిగా వచ్చే శీను చుక్కలు చూడటం ఖాయం!" అని వెన్ను తట్టుకున్నాడు.

సైకిల్ మీదెళ్తూ గోపి కన్పించాడు. పిలి చాడు వెంకన్న.

"ఎలాగూ వెళ్ళిపోతున్నాం కదాని

ఫ్రెండ్సుందర్నీ కలుస్తున్నాను"

"వాళ్ళేమంటున్నారేంటి? "

తండ్రి ముఖంలోకి చూసి అన్నాడు.

"ఊరొదిలి వెళ్ళిపోతున్నప్పుడు ఇల్లూ పొలం అన్నీ అమ్మేసుకుంటే మంచిదికదా అంటున్నారు. ఎవరూ చూడకపోతే ఇల్లు పాడుబడుతుంది. పొలం కౌలు సొమ్ము సరిగ్గా ఇవ్వరు. అంతా అమ్మేసి ఏ లక్షో చేతబట్టుకెళ్ళి హైదరాబాదులో వ్యాపారం చేసుకోవచ్చుగా అంటున్నారు. చిన్నా చితకా ఉజ్జోగాలు చెయ్యలేం. ఒకరికింద పాలేరుగా పనిచెయ్యలేం. వ్యాపారమైతే ఘరానాగా ఉంటుంది..."

ఆ మాటల్లో యథార్థముందనిపించింది.

"నువ్వేమంటావురా..."

"నా మాటలు నీకెక్కవుగాని నేనూ అదే బెస్టు అనుకుంటున్నాను. ఇవాళ రేపు బిజినెస్‌ని మించింది లేదు. లాభాలెక్కువ. అమ్మకాలు తగ్గినా సరుకుంటుంది గనుక వ్యవసాయంలోలా మునిగిపోం..."

"సరే. ఏ వ్యాపారమైతే బావుంటుందో వాటి ఆనుపానులేవిటో తెలుసుకో"

అతడి ముఖం వెలిగింది. కాని వెంకన్న మనస్సుకి మబ్బు పట్టేసింది.

"ఇంకా ఆ పనిమీదే ఉంటాను" హుషారుగా వెళ్ళిపోయాడు.

కొంపా గోడూ అమ్ముకుని ఊరుతో తెగతెంపులు చేసుకోవాలన్న ఊహకే పేగులు మెలి తిప్పినంత బాధగా వేదనగా ఉంది.

ఇక నిజంగా అలా చేయాల్సిన దుస్థితి దాపురిస్తే తట్టుకోగలడా? !

భూమిని నమ్ముకొన్న భూమిపుత్రుడు భూమిని అమ్మేసి భూమికి దూరంగా వెళ్ళిపోగలడా?

అంతకుమించి గత్యంతరం ఏముంది? గోపి అన్నట్టు ఆ మహానగరంలో మరొకరి మోచేతి నీళ్ళు తాగి బతికేకన్నా ఏ వ్యాపారమో చేస్తే మంచిది. వ్యాపారమంటే పెట్టుబడి కావాలి. అందుకోసం పశువుల్తో సహా సర్వం అమ్మక తప్పదు!

## కొత్తగాలి...

**ఈర్ష్య, అసూయ**
**తోబుట్టువులు**
**వారు చేసేవి**
**ఆత్మాహుతి దాడులే**

– అంబల్ల జనార్దన్, ముంబయి

★ ★ ★

"అనసూయా! మేం హైదరాబాదెళ్ళిపోతున్నాం"

పేరంటానికెళ్ళిన కనకం అక్కడికొచ్చిన ఆడవాళ్ళంతా వినేలా గొప్పగా చెప్పింది.

"విన్నానక్కా ఏం ఎందుకెళ్తున్నారు? " తెలియనట్టే అడిగింది అనసూయ.

"బాగుపడదామని! ఇక్కడున్నంతకాలం ఎదుగూ బొదుగూలేని గొర్రెతోకలానే ఉంటాదీ సంసారం!" చెప్పింది కనకం.

"ఏంటోనమ్మా ఒక్కొక్కరుగా ఊరుని వదిలి వెళ్లిపోతున్నారు" బాధగా అందో పెద్దావిడ.

"ఇక్కడ బావుకోడానికేమీ లేనప్పుడు వెళ్ళక ఎందుకుంటారు! నా మట్టుకు నాకు ఈ బతుకు రోతగా ఉందనుకో. పేడ పిసుక్కోడాలూ, కట్టెలపొయ్యి ఊదడాలూ... తలుచుకుంటేనే కంపరంగా ఉంది!"

కనకం మాటలకి వింతగా చూశారు కొందరు. అబ్బురపడ్డారింకొందరు.

"పట్నంలో అయితే గ్యాస్ పొయ్యిలుంటాయి. ఎంచక్కని మేడలుంటాయి. కుళాయి నీళ్ళు ఇంట్లోకే వచ్చేస్తాయి. ఎక్కడికెళ్ళాలన్నా కార్లలో తిరగొచ్చు. కాలికి మట్టి అంటదు. నెలొచ్చేసరికి విచ్చు రూపాయలు ఒళ్ళోకొచ్చి పడతాయి. సెలవుల్లో అక్కడికీ ఇక్కడికీ తిరిగి అన్నీ చూడొచ్చు. కొత్తరకాల బట్టలు కట్టుకోవచ్చు. సినిమాలు చూడొచ్చు. టింగురంగా అంటూ తిరగొచ్చు. అసలా లోకమే

వేరు. స్వర్గమంటే నమ్ము"

పంచరంగుల స్వప్నాన్ని కళ్ళముందు ఆవిష్కరించింది కనకం.

"కనకం అదృష్టవంతురాలు" అనుకున్నారు కొందరు.

"అంతా బడాయి! దూరపుకొండలు నునుపు" అని మూతి తిప్పుకున్నారు ఇంకొందరు.

"నిజమే. పట్నం బాగుంటాదిగాని డబ్బున్నోళ్ళకే హారతులు పడతారక్కడ" అనుకున్నారింకొందరు.

"అక్కడికెళ్ళి ఏం పనిచేస్తారూ" పారిజాతం అడిగింది.

'అదేం పిచ్చి ప్రశ్న' అన్నట్టు చూసింది కనకం. "మీ అన్నయ్య వ్యాపారం చేస్తారు. గోపి ఉజ్జోగం చేస్తాడు. మా మరిది జనార్ధనం అక్కడ పెద్ద ఆఫీసరు తెలుసా. అక్కడ అతడికి బోల్డంత పలుకుబడి ఉంది. వాళ్ళకి స్వంత కారు కూడా ఉంది. నీకీ సంగతి చెప్పేనా? అతడా స్థితిలో ఉండడానికి మీ అన్నయ్యే కారణమంటే నమ్ము. హైదరాబాదొచ్చేయండి మీకన్నీ అమరుస్తాను- అంటూ పోరుతున్నాడు. ఇన్నాళ్ళకి వెళ్ళగలుగుతున్నాం"

"ఇంక పిల్ల పెళ్లి కూడా అక్కడ చేస్తారేమో" శాంతమ్మ అంది.

"పట్నపోళ్ళని కాదని పల్లెటూరి సంబంధం ఎందుకు చేస్తామూ! మల్లి కుందనపు బొమ్మ. టెన్త్ చదివిందాయె. కట్నకానుకల్లేకుండా కోడలిగా చేసుకుంటామని ఎగబడరూ!"

"నేన్నమ్మనమ్మా, ఆడదాని బతుకు అడవిలో అయినా ఒకటే, పట్నంలో అయినా ఒకటే. మగాడి కాలికింది చెప్పులా పడి ఉండాల్సిందే. కట్నం కింద రూపాయలు దోసిళ్ళతో దోచివ్వాల్సిందే" ఈమధ్యనే పెళ్ళైన అరవింద అంది.

కనకానికి రుచించలేదు. "అందుకే చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత అన్నారు" అంటూ దీర్ఘం తీసింది.

తను విన్న వాటికి, కన్న వాటికి ఊహల రెక్కలు తొడిగి రంగూ రుచీ వాసనా చేర్చి పట్టణవాసపు వైభోగాన్ని నోరారా నోరూరేలా వర్ణించేసింది.

కనకానికి చాలా సంబరంగా ఉంది.

అసలా వార్త అందరికీ పంచుదామనే పనిగట్టుకుని వచ్చిందామె. తను చెప్పకపోతే దివాలా తీసి వెళ్ళిపోయారనో, అప్పులపాలయ్యి మొఖం చూపించలేక మకాం ఎత్తేశారనో అనుకుంటారని ఆమె భయం!

ఆమెకి నిజంగానే మహానగరం ఓ స్వర్గంలా కనిపిస్తోంది. కోరికలు తీర్చే కల్పవృక్షంలా అన్పిస్తోంది!




**వెం**కన్న సాంబయ్యల పొలం కొనటానికి సరైన బేరాలు రావటం లేదు. కారణం సుందరమూర్తని అర్థమైంది.

అతడు మానవరక్తం రుచి మరిగిన పులి. అతడి పంజా నుంచి తప్పించుకోవడం అసాధ్యం.

మారు బేరగాళ్ళని పంపించి తక్కువ రేటుకి అడిగించి వారిని మానసికంగా దెబ్బతీశాడు. దెబ్బకి వీళ్ళెళ్ళి ఆయన కాళ్ళ దగ్గర పడ్డారు. బతిమాలారు.

బెట్టు చేశాడాయన.

ఆయన మాటకోసం ఆశగా చూశారు. అదుర్తోన్న గుండెల్తో చెవి ఒగ్గారు.

కడకి "రెండూ యాభైకైతే నేను తీసు

కుంటాను. ఆపైన మీ ఇష్టం. ఇందులో బలవంతమేమీలేదు" అన్నాడు.

హతాశులయ్యారు. వెంకన్నకైతే ఏడుపు ముంచుకొచ్చింది.

బంగారం లాంటి పొలాన్ని అమ్ముకోడానిక్కూడా దేబిరించాల్సిన గతి పట్టింది! ఇంతకంటే దౌర్భాగ్యం ఏముంటుంది? !

మరోప్పుడైతే లేచిపోయేవాడే. ఇప్పుడు అవసరం తనది. అవకాశం ఆయన్ది!

"పెద్దమనసు చేసుకోండి..." కన్నీళ్ళతో అర్థించాడు సాంబయ్య.

"రెండూ అరవైకి మించి పైసా ఇవ్వను. ఇష్టమైతే చెప్పండి. మా చెరువు పక్కనున్న వెంకన్న పొలాన్ని కూడా అమ్మితేనే చెరువుని కొంటాను. దానికి ఇంకో పది వేలు ఎక్కువిస్తాన్లే"

సుందరమూర్తి మాటలకి బిక్క చచ్చిపోయారంతా. ఆయన ధోరణి పెద్దలకీ రుచించలేదు. కానేమీ అన్లేకపోయారు.

వెంకన్న దీర్ఘంగా నిశ్వసించి అన్నాడు. "నా ఎనభై సెంట్ల చెక్క ఎలాటిదో మీకు తెలీంది కాదు. పక్కన చెరువు తవ్వినందువల్ల గాని లేకపోతే బంగారం పండేది. మూడు లక్షలైనా ఇవ్వటం న్యాయం."

"అమ్మకాలు కొనుగోళ్ళల్లో లాభనష్టాలుంటాయి గాని న్యాయాన్యాయాలుండవురా. సరే నోరు తెరచి అడిగావు రెండూ ఎనభై చేసుకో. పిల్లలు గలవాడివి. నా పేరు చెప్పుకుని నాల్రోజులు తినండి!"

★ ★ ★

రెండో ఉత్తరానికి జనార్దనం దగ్గర్నుంచి జవాబొచ్చింది.

మొదటి ఉత్తరం అందలేదని రాశాడు. ఎప్పుడొచ్చేదీ ముందుగా రాస్తే వారికోసం అన్ని ఏర్పాట్లూ చేస్తానన్నాడు.

ముక్కుబడిగా రాసినట్టు నాలుగు ముక్కలే రాశాడు.

అయితేనేం వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లు అనుభూతి చెందాడు వెంకన్న.

"కొండంత అండగా జనార్దనం ఉంటాడు. దిగుల్లేదు" అనుకున్నాడు.

వెంటనే పురోహితుడ్ని కలిసి పట్నం వెళ్ళడానికి ముహూర్తం పెట్టించాడు.

ఇక్కడి పనులన్నీ ఒక కొలిక్కి వచ్చాయనీ ఫలానా రోజున బయల్దేరి రైల్లో వస్తున్నామని ఉత్తరం రాయించేశాడు.

ఎకరం చెరువునీ ఎనభై సెంట్ల భూమినీ సుందరమూర్తి కొడుకు పేరన రాసి రిజిస్ట్రేషన్ చేసి వచ్చారు వెంకన్న, అతడి తల్లి, పెద్ద కొడుకూనూ.

సుందరమూర్తి ఒక్క పైసా కూడా వడ్డీ తగ్గలేదు. కాళ్ళా వేళ్ళాపడ్డా ప్రయోజనం లేకపోయింది.

పొలం బేరం అయినరోజున ఎంతో

## వీరేశలింగం చతురోక్తులు

గొప్ప సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగంగారి ప్రసంగాలు సహజ గాంభీర్య చమత్కారాలతో ఆకట్టుకుంటాయి. ఆయన చతురోక్తులు కొన్ని..

### సరస్వతీ విలాపం



'సరస్వతీ నారద విలాపం'లో కుకవిత్వానికి వీరేశలింగం చురకలు వేశారు. అందులో నారదుడు తన తల్లి సరస్వతి వికృత, వికార రూపాన్ని చూచి ఆనవాలు పట్టలేక 'ఈ దుస్థితికి కారణమేమిటి తల్లీ?' అంటాడు. దాని కామె 'గర్భ, బంధ, చిత్ర కవిత్వాలలో చిక్కుకునిపోయి వికృతిని, విరూపినైతి. అడుగడుక్కూ అర్థస్వారస్యాన్ని పూర్తిగా చెరిచి, అవయవాలు విరిచి నన్ను విరూపిని, కురూపిని చేశారు' అని భాషావధూటి విలపిస్తుంది. ఈ మాటలలోని వ్యంగ్యం స్పష్టంగా అర్థమవుతుంది. పదిహేడో శతాబ్దాంతం నుంచి తెలుగుకవులు స్వారస్యాన్ని వదిలి ఎవరికీ తెలియని నిఘంటువులలోని క్లిష్టపదాలతో కవిత్వాన్ని రాశారన్న బాధే ఈ వ్యంగ్యానికి కారణం.

మెత్తగా మాట్లాడిన ఆయన బాకీ లెక్కవే సేప్పుడు చాలా కఠినంగా, పరుషంగా మాట్లాడాడు. పెద్దగొంతుతో అరిచాడు.

"నిన్ను నమ్మి అప్పు ఇచ్చినందుకు ఇదా నువ్వు చూపే కృతజ్ఞత? నేను అప్పివ్వక పోతే నీకు ఊళ్లో ఉప్పు కూడా పుట్టేది కాదు తెలుసా? " అంటూ ఎగిరిపడ్డాడు!

రొయ్యల ఫీడ్ షాపతను మాత్రం అయిదువేలు తగ్గించాడు.

అసలుకన్నా వడ్డీ ఎక్కువయ్యింది.

దేశంలో ఎన్ని బ్యాంకులున్నా మరెన్ని ఆర్థిక సంస్థలున్నా ముఖ్యమంత్రులూ ప్రధానమంత్రులూ ఎవరెన్ని కబుర్లు చెప్పినా విరిగిన రైతు వెన్నెముకని నిలబెట్టే వారొక్కరూ లేరు!

అన్ని అప్పులూ తీర్చేసరికి వెంకన్న చేతిలో మిగిలింది పాతికవేల చిల్లర!

పూర్తిగా దగా చేయబడ్డట్టు నిలువునా దోచెయ్యబడ్డట్టు కూలబడిపోయాడు!

తనిప్పుడు రెక్కల్లేని పక్షి!

కుళ్ళికుళ్ళి ఏడ్వాలనిపించింది. కాని కళ్ళల్లో కన్నీళ్ళెప్పుడో ఇంకిపోయాయి!

"ఇంకా లక్ష రూపాయలైనా మిగుల్తాయనుకుని గాలిలో మేడలు కట్టాను. లిక్కులిక్కుమంటూ పాతికవేలు మిగిల్చావా? ఆ డబ్బు కిళ్ళీకొట్టు పెట్టుకోడానికి కూడా చాలదు!" నిరసనగా అన్నాడు గోపి.

"మధ్యలో మీ నాన్నని అంటావేమిట్రా? వడ్డీలు మనల్ని నంజుకు తింటాయని ఆయన మాత్రం కలగన్నారేవిటి? " భర్తని వెనకేసుకొచ్చింది కనకం.

"అప్పులేనంత అదృష్టం లేదంటారిందుకే. చూస్తూండగానే మొత్తం అంతా హారతి కర్పూరమైపోయింది" కళ్ళు తుడుచుకుంది ముసలావిడ.

"పశువుల్ని అమ్మేస్తున్నాం కదా. ఇహ ఇల్లు కూడా అమ్మేద్దాం" అన్నాడు గోపి.

వినకూడనిది విన్నట్టు చూశాడు వెంకన్న.

"వాడన్నదీ పాయింటే. మళ్ళీ ఇక్కడికి వస్తామా ఏవిటీ. ఇక్కడ ఇల్లుండి ఏం లాభం? అమ్మేస్తే ఎంత లేదన్నా ఇరవై వేలన్నా వస్తాయి" అంది కనకం.

"అదేం మాటే కనకం. బతకడానిగ్గాకపోయినా చావడానికి ఇల్లు కావాలే. పరాయి ఇంట్లో ఛస్తానంటే ఎవరూ ఊరుకోరు. కాలికి తాడు కట్టి బయటకీడ్చేస్తారు..." ఏడుపు స్వరంతో అంది సూరమ్మ.

ఆవిడ భయం ఏమిటో అందరికీ అర్థమైంది. గుండెలు బరువెక్కాయి.

కడుపులో దేవినట్టనిపించింది వెంకన్నకి.

"అవేం మాటలే అమ్మా. నిన్ను కంటికి రెప్పలా చూసుకుంటానే" అన్నాడు.

"నీ సంగతి నాకు తెలీదుట్రా వెర్రినాగన్నా. లోకంతీరు చెబుతున్నానంతే..." అందావిడ సర్దుకుంటూ.

ఊరు విడిచి వెళ్ళిపోవాలనుకున్నప్పట్నుంచీ ఆవిడకి సరిగ్గా నిద్రపట్టడం లేదు.

తనెక్కువ కాలం బతకదు. పరాయి గడ్డ మీద కన్ను మూస్తుంది. అయిన వాళ్ళెవరూ ఉండరు. బంధువులెవరూ రారు మోయడానికి నలుగురైనా ఉంటారో లేదో అనుమానమే. ఆఖరి ఘడియలు ఇంట్లో గడవనిస్తారో లేక ప్రాణముండగానే బయట పెట్టించేస్తారో- అని భయం! బెంగ!!

"ఏమోనే అమ్మా. సెంటు భూమి లేకుండా చేశాను. పిల్లలు పసివాళ్ళు. ఎలా పెరుగుతారో ఏమో! వెళ్ళేచోట తలదాచుకోడానికైనా జానెడు జాగా అయినా దొరుకుతుందో లేదో!" వేదన పడ్డాడు వెంకన్న.

"అలా అధైర్యపడతారేంటి? హైదరాబాద్‌లో లక్షలాది మంది బతకటం లేదూ. రెక్కల కష్టంతో ఎదగటంలేదూ. అంతా మన మంచికే అనుకోవాలిగాని పూరికే భయపడి కుంగిపోతే ఎలాగా? " ధైర్యం చెప్పింది కనకం.

"నేల నుంచి వేరైన మొక్క బతకదే పిచ్చిదానా!"

అనాలోచితంగా అన్న సూరమ్మ మాటల్లో అశుభం ధ్వనించి భయభ్రాంతు లయ్యారు వెంకన్న దంపతులు!

★ ★ ★

నరసాపురం బస్టాండులో బస్సుకోసం చూస్తున్నాడు వెంకన్న.

"ఏవోయ్ వెంకన్నా ఇలా వచ్చావేంటి కథ? " పుల్లతో పళ్ళు కెలుక్కుంటూ వచ్చాడు పాత కరణం. ఆయన కరణీకం పోగానే నర్సాపురం మకాం మార్చాడు. దస్తావేజుల లేఖకుడిగా మారిపోయాడు. ఈ మధ్యనే ఇల్లు కూడా కొన్నాడు.

"చిన్న పనుండొచ్చానండి... తమరి ఒంట్లో బాగుంటున్నాదాండీ"

"లేచిన్నాడు నాలుగడుగులేయటం, లేని నాడు లేదు. అయినా కరణం బాగుకోరేదె వర్లే. నీలాంటి వాళ్ళు ఒకటీ అరా ఉంటా రేమో అంతే"

"అదేం మాట కరణంగారూ. ఒకప్పుడు ఊరోళ్ళంతా మీ ముందు చేతులు కట్టు కుని నిలబడ్డవాళ్ళే గదా"

"అది నా గొప్ప కాదు, నా చేతిలో ఉన్న అధికార మహత్మ్యం. తెలంగాణాలో ఒక సామెతుందిలే. కరణం కుక్క చస్తే ఊరంతా వస్తుందిట. కరణంచస్తే ఒక్కరూ రారట. నా గొడవకేం గాని ఆ సుందరమూర్తి నీకూ గ్రహణం పట్టించే శాట్ట కదా..."

"అంతా కర్మ. ఒకర్నని ఏం లాభం"

"అంతేలే. అసలు వ్యవసాయమే జూదం అయితే రొయ్యల సేద్యం మాయా జూదమై కూర్చుంది. నిలువుదోపిడీ ఇచ్చు కోక తప్పదు. ఇదివరకూ ఊళ్ళో భూస్వా ములు, చిన్న రైతులు, కూలీలు ఉండే వారు. రొయ్యలూ తోటలూ వచ్చేక కూలీలు వలసపోయారు. ఇప్పుడేమో చిన్నా చితకా రైతులు చితికిపోయి కొంపా గోడూ అమ్ముకుని పోతున్నారు"

"కాలం మారిపోయిందండి"

"అది మాత్రం నిజం వెంకన్నా. ఇదివ

## కొత్తగాలి...

**కనులను మీటి**
**కలలు**
**మాయమయ్యాయి**
**ఉదయాన్నే**

- ఆత్రం శశికిరణ్,
రాజారాంపల్లి, కరీంనగర్

రకూ కమ్యూనిస్టులు చెప్పేవారు చూడు. లోకంలో ధనిక వర్గం శ్రామికవర్గం అని రెండే రకాలని. ఇప్పుడూ రెండే రకాలు న్నాయి. రుణదాతలూ రుణగ్రహీత లూనూ! మనుషుల్లోనూ అంతే దేశాల్లోనూ అంతే. మన ముఖ్యమంత్రి ప్రపంచ బ్యాంకు నుంచి ఎన్నివేల కోట్లు అప్పు తెస్తున్నాడో లెక్కలేదనుకో. అప్పిచ్చేవాళ్ళు వూరికే ఉండరుకదా. కడకి జనాన్నే ముంచుతారో దేశాన్నే ముంచుతారో చూడాలి. అప్పుల గొడవకేం గాని ఇంతకీ ఏ ఊరెళ్తున్నావు వెంకన్నా..."

"మా జనార్ధనం తెలుసుకదాండి. హైద రాబాదు రమ్మన్నాడు..."

నవ్వేడు పాత కరణం.

"హైదరాబాదు మహా నగరమే కాదు మాయా నగరం కూడా. నీలాటి గంగిగోవు అక్కడ బతకడం కష్టమే!"

శిలా ప్రతిమయ్యాడు వెంకన్న. వెన్నులో వణుకు మొదలయింది.

అతడి నిస్సహాయతకి సానుభూతి కలి గింది. "నువ్వేం దిగులు పడకు వెంకన్నా. కూలిన గోడలు కూలినట్లే వుండిపోవు. మళ్ళీ కొత్త గోడలు లేస్తాయి. బీడు భూమిని సైతం సస్యశ్యామలం చేసే రైతువి. నీ బతుకు పండించుకోలేవేంటి. పుట్టి పెరిగిన ఊరినీ వృత్తినీ వదలాలంటే బాధగా వుంటుంది. కాని కడుపు చేతబట్టు కున్నప్పుడు విరగటం కన్నా వంగటం



మేలు. అవకాశాల్ని వెదుక్కుంటూ వెళ్తే చాలదు. లభించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి. కొత్త అవకాశాన్ని సృష్టించుకోవాలి. అప్పుడిహ నీకు తిరుగు వుండదనుకో"

కరణం మాటలకి భవిష్యత్తు ఎంతో ఆశాజనకంగా కన్పించింది వెంకన్నకి.

★ ★ ★

ఇంటితో సహా స్థిర చరాస్తులన్నీ అమ్మేశాడు వెంకన్న. తనకిప్పుడు తనది అని చెప్పదగ్గ ఆస్తి యాభై ఆరువేల రూపాయలూ ముగ్గురు పిల్లలూనూ!

తనకితానే ఎంతో అల్పుడిగా, దీనుడిగా కన్పించాడు. దుఃఖం కట్టలు తెంచుకుంది.

నిన్న మొన్నటి వరకూ తను రైతు. ఏం చేస్తున్నారని ఎవరైనా అడిగితే 'వ్యవసాయదారులం' అంటూ గొప్పగా చెప్పేవాడు. వ్యవసాయం సరైన తిండీ బట్టా ఇవ్వకపోయినా ఎంతో కొంత గౌరవాన్నీ భరోసానీ ఇచ్చింది. అప్పుల్లో కూరుకుపోతున్నా పంట పండించడంలో ఏదో తృప్తి, ఏదో భద్రత, ఏదో సాధించామన్న ఉత్సాహం ఉండేది.

ఇప్పుడు రెక్కలు తప్ప మరేవీ లేవు.

వాటిల్లో కూడా పటుత్వం తగ్గింది! నెత్తి మీదకి నలభై ఏళ్ళొచ్చాయాయె!

పచ్చడి మెతుకుల్నే అయినా కూర్చుని నిశ్చింతగా తినడానికి ఒక ఇల్లు ఉండేది.



ఇప్పుడదీ లేదు. ఎండా వానల్నుంచి రక్షిం చడానికి తనదంటూ రెండు తాటాకుల గూడు సైతం లేని పక్షి తనిప్పుడు!

నష్టాలని అప్పులబాధని భరించలేక ఆత్మహత్యలు చేసుకున్న రొయ్యలరైతులూ పత్తిరైతులూ గుర్తొచ్చారు.

"ఎందుకంత తొందరపట్టం? " అనుకు న్నాడప్పుడు వాళ్ళ గురించి.

వాళ్ళెంత మధనపడి ఆ దారి తొక్కారో తనకిప్పుడు అవగతమవుతోంది. అప్పుల పాలై వీధినపడటం ఏమిటో తెలిసింది.

పదిమందికి అన్నంపెట్టే బతుకు పరాయి పంచన చేతులు చాచి నిలబ డాల్సిరావడం ఎంత నరకమో తెలు స్తోంది. కూలీగా రైతు మారడంతో ఎంత వేదన, ఎన్ని కన్నీళ్ళు, ఎంత హింస ఉందో స్వానుభవంలో కొస్తోంది!

ఒక్కసారిగా నిర్వీర్యమైపోయినట్టు దిగాలు పడిపోయాడు వెంకన్న.

హైదరాబాదు పచ్చని లోకంలా కన్పి స్తోంది. ఎన్నో ఆశల్ని మూట గట్టుకుని వెళ్తున్నారు.

అక్కడ నిచ్చెన మెట్లే వున్నాయో జారుడు మెట్లే కాచుకున్నాయో మరి!

'గోదావరి ఈత లంక మేతలా అవ్వదు కదా అన్న అనుమానం పీడించడం మాన్లేదు. భవిష్యత్తు బంగారంలా వుంటుందని ఆ మధ్య చెప్పిన చిలక జోస్యం ఒక చెవిలో, పాత కరణం మాటలు రెండో చెవిలో ఉండి ఉండి విన్పి స్తూనే ఉన్నాయి!

రెండ్రోజుల్లో కొచ్చింది ప్రయాణం.

బంధుమిత్రులంతా వచ్చి చూసి వె ళ్లారు. కొందరు ధైర్యం చెప్పేరు. "నదు లన్నీ సముద్రంలో కలవాల్సిందే. అంతా పట్నాల వెంట పరుగెత్తాల్సిందే. పల్లెల్లో బక్కవాళ్ళు బతకలేరు" అన్నారు కొందరు. "అక్కడ బాగుంటే కార్డుముక్కరాయి మేమూ వస్తాం" అన్నారింకొందరు.

"అమ్మవారికి కోడిని కోసి నైవేద్యం పెడ దాంరా అబ్బాయ్" అంది తల్లి.

వెంటనే నల్లకోడిని తెచ్చి బలిచ్చారు.

"చల్లాలమ్మ తల్లి చల్లగా చూస్తాదిరా బిడ్డా" అంది గ్రామదేవతకి భక్తితో చేతులు జోడించి వచ్చి సూరమ్మ.

పందిరి మంచం చెక్క బీరువా వగైరా లన్నీ బంధువుల ఇంట్లో దాచి అతి తక్కువ సామాన్లతో ప్రయాణమయ్యింది వెంకన్న కుటుంబం.

రెండెడ్ల బండి కదిలే సమయానికి బంధుమిత్రులూ వాడ కట్టువాళ్ళూ వచ్చి సజల నేత్రాలతో వీడ్కోలు చెప్పేరు. వాళ్ళందర్నీ చూసేసరికి వెంకన్నకీ కనకా

నికి దుఃఖం వచ్చేసింది. వారికన్నా కూడా సూరమ్మే నిగ్రహంతో వ్యవహరించింది.

పుట్టి పెరిగిన ఇల్లు పరహస్తమయింది.

ఇక అయినవాళ్ళూ ఇన్నేళ్ళూ అండగా నిలిచిన వాళ్ళూ దూరమవుతారు.

చిన్ననాటి నేస్తాలనీ ఇన్నాళ్ళూ అలరించిన ప్రకృతి దృశ్యాలనీ మధుర స్మృతులనీ గుండెల్లోనే పదిలపరచుకుని ఊరుకి వీడ్కోలు చెబుతున్నారు.

పై పంచె నోట్లో కుక్కుకుని వెక్కి వెక్కి ఏడ్చేశాడు వెంకన్న.

"ఛా... ఛా అత్తారింటికెళ్తోన్న ఆడపిల్లలా ఆ ఏడుపేంట్రా. హైదరాబాదు ఏవంతదూరం చెప్పు. రాత్రి బండెక్కితే తెల్లారేప్పటికి ఇక్కడుంటావు. అయినా ఒకరి మొకం ఒకరం చూసుకోని చోటు కెళ్తున్నట్టు ఇదవుతావేంరా. నీ కూతురి పెళ్ళికి మేం రామా అమ్మవారి తీర్థానికి నువ్వు రావా చెప్పు" అంటూ ఊరడించాడు తాత వరసయ్యే పెద్దాయన.

బరువెక్కిన గుండెల్తో కళ్ళు తుడుచుకున్నాడు వెంకన్న.

భారంగా కదిలింది బండి.

పొలిమేరలు దాటుతోంటే ముసలావిడ ఏడ్చేసింది. కనకం కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

బాధగా చూస్తూండిపోయాడు వెంకన్న.

"పుట్టి పెరిగిన ఊరుని మళ్ళీ చూస్తానో లేదో! ఊరందర్నీ కలుస్తానో లేదో!"

కన్నీటి పొరలోంచి ఊరు అలుక్కుపోయి కన్పించింది. తర్వాత పూర్తిగా కన్పించడం మానేసింది!

★ ★ ★

నర్సాపురం రైల్వేస్టేషన్.

ప్లాట్‌ఫాం మీద సామానంతా గుట్టగా పోసి కాపలాగా చుట్టూ కూర్చున్నారు వెంకన్న కుటుంబ సభ్యులు.

గోదావరి నీళ్లు కావాలని ముసలావిడ అడిగింది. రైలుకి టైముండేసరికి గోపి వెళ్లి సీసాతో నీళ్లు తెచ్చాడు.

"తల్లి గోదారి నీళ్లే. దాయి. పండక్కీ పబ్బానికీ ఇన్నినీళ్లు ఇల్లంతా చిలకరిస్తే ఇల్లు సుద్ధి అవుద్ది. ఎప్పుడో కిందటి పుష్కరానికి గోదాట్లో స్నానం చేశాను. మళ్ళీ పుష్కరాలదాకా బతికుంటానో లేదో. ఉన్నా నన్నెవరైనా తీసుకొస్తారో లేదో!" అంది దిగులుగా సూరమ్మ గుప్పెడు నీళ్ళు తలమీద చిలకరించుకుంటూ.

"పుష్కరాలకి రాకుండా ఎలా ఉంటామే అమ్మా. వద్దాంలే" అన్నాడు వెంకన్న.

సికింద్రాబాద్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్ ఫాం మీదకొచ్చి ఆగింది. సామానుని జనరల్ బోగీలోకి చేరవేశారు.

"హైదరాబాద్‌లో ఉద్యోగం వచ్చిందా.. ఏకంగా పెట్టే బేడాతో వెళ్తున్నారు?" ఎదుటి బల్లమీద కూర్చున్న ఆసామి అడిగాడు.

"ఉద్యోగం కోసం ఎల్తున్నాం..."

"అక్కడ ఉద్యోగాలు రోడ్లమీద దొరుకుతున్నాయేంటి" అని నవ్వి, తిరిగి తనే అన్నాడు "ఉద్యోగమో పాడో చూసుకున్నాక ఇవన్నీ తీసుకెళ్ళకపోయావా?"

బుర్రగోక్కున్నాడు వెంకన్న.

"అక్కడ మా మరిది పెద్ద ఆఫీసరు. బోల్డుమంది నౌకర్లు చాకర్లూ ఉంటారు. స్వంతానికి ఇల్లూ, కారూ కూడా ఉన్నాయి" గొప్పగా చెప్పింది కనకం.

"ఏదో ఒక ఆధారం ఉంటే ఫర్లేదు. ఇంతకీ ఊరొదలి ఎందుకెళ్తున్నారు?"

కనకం ముఖం తిప్పేసుకుంది. పెట్టెలోని మరికొందరు ఆసక్తిగా చూశారు.

ఎవరో ఆత్మీయుడు అడిగినట్టుగా అన్పించి తనగోడు వెళ్లబోశాడు వెంకన్న.

"కోట్లు కోట్లు అప్పు తెచ్చి పై ఓవర్లు కడతారు తప్ప నీటి పారుదల ఏర్పాట్లు చెయ్యరు. హైటెక్కులంటూ విదేశీయుల కోసం మారాజుల కోసం బంగారు రోడ్లు వేస్తారు గాని రైతు తన పంటని సరైన ధరకి అమ్ముకునే ఏర్పాట్ల వంక కన్నెత్తి

చూడరు" వ్యాఖ్యానించాడతడు.

"మాకేం చెయ్యక్కర్లేదు బాబయ్యా, నకిలీ ఎరువులూ నాసిరకం విత్తనాలూ కల్తీ పురుగుమందులూ అరికడితేశాన!"

"బాగా చెప్పేవు. మా నాన్న ఏమనే వాడో తెలుసా? ప్రభుత్వ ఉద్యోగం ఉత్తమం, వ్యాపారం మధ్యమం, ప్రైవేటు ఉద్యోగం అథమం. వ్యవసాయం అథమా ధమం అని!"

అంతా సీరియస్‌గా ఉండిపోయేసరికి తిరిగి తనే అన్నాడు-

"ఒక జోక్ చెప్పనా? ప్రభుత్వం విదేశాలనుంచి ఓ కొత్తజాతి పులిని దిగుమతి చేసుకుందిట. మేక, గొర్రె, కుందేలు మాంసాలు వేసినా సరే అది ముట్టలేదట. ఇదేంటబ్బా అని పశువుల డాక్టర్‌కి చూపించార్ట. అతగాడు పరీక్షించి మనిషిని ఆహారంగా వెయ్యమన్నాట్ట. ప్రభుత్వోద్యోగిని బోనులో వెయ్యగా చూసింది గాని ముట్టుకోలేదుట. బుల్లి నాయకుడ్ని వేశార్ట. వాసన కూడా చూడలేదుట. ఒక రైతుని తెచ్చి వేశార్ట. గబుక్కున మీదకురికి తినేసిందట. తర్వాత పరీక్షించి చూడగా అతగాడికి వెన్నెముక లేదని తెలిసిందిట!"

అతడు గట్టిగా నవ్వేడు. కానెవరూ నవ్వలేదు. అందరి గుండెలూ బరువెక్కాయి.



**సి**కింద్రాబాద్ రైల్వేస్టేషన్లో దిగింది వెంకన్న కుటుంబం. జనారణ్యంలోకి వచ్చి పడినట్టుగా బిక్కు బిక్కుమంటూ చూశారు. ఎటుచూసినా జనం. హడావిడి. రణగొణధ్వనులు. ఇంతవరకూ పరిచయం లేని కొత్తలోకం వంక వింతగా చూశారు. ఈ లోకంలో ఇమడగలమా అని సందేహంగా చూశారు.

పిల్లలు మాత్రం రకరకాల వస్త్రధారణతో ఫాషనబుల్‌గా ఉన్న జనాన్ని ఆసక్తిగా చూస్తున్నారు. తామూ కొద్దిరోజుల్లో అలా మారబోతున్నామన్న ఊహతో ఎంతో ఎక్సైటింగ్‌గా ఫీలవుతున్నారు.

ప్లాట్‌ఫాం మీద సామాన్లన్నీ వేయికళ్లతో కాపలాకాస్తోంది సూరమ్మ "ఇదేం వూరురా అబ్బాయ్. ఇంత సేపట్నుంచి ఇక్కడ కూర్చున్నా ఎవరూ మనల్ని పలకరించరేం. మంచి చెడ్డా కనుక్కోరేం."

"పట్నంలో ఇంతే. ఎవరిగోల వారిదే. ఎవరి బతుకు వారిదే" అంది కనకం.

"మరి ఎవరో ఏదో తవ్వి తలకెత్తుతారని వచ్చేం కదా" అంది ముసలావిడ.

జనార్దనం వచ్చాడు. అందరి మొహాలూ ఒక్కసారిగా వెలిగాయి.

దగ్గరకొచ్చి తనని పలకరిస్తాడేమోనని చూసింది సూరమ్మ. అతడు రాకపోయేసరికి మొఖం తిప్పేసుకుంది.

"ఇంటితో సహా అన్నీ అమ్ముకొచ్చాంరా. ఊరితో సంబంధం తెగిపోయిందనుకో. చావైనా బతుకైనా ఇక్కడే" గాద్గదికస్వరంతో అన్నాడు వెంకన్న. రెండు కన్నీటిబొట్లు అతడి కనుకొలకుల్లో మెరిశాయి.

"నాకు అర్జంటు పనుంది. వెళ్లిపోవాలి. మినీ ట్రక్కుని మాట్లాడి ఇతడ్తో పంపిస్తాను. అదెక్కి ఇంటికెళ్లండి. ఇల్లు ఇతడికి తెలుసు. ఆలస్యం చెయ్యకండి సుమా. పదిదాటితే లారీల్ని మెయిన్‌రోడ్ మీంచి వెళ్ళనివ్వరు..."

హడావిడిగా వెళ్లిపోయాడు జనార్దనం. అతడి కూడా వచ్చినతనూ వెళ్ళాడు.

బిక్క మొహాలు పెట్టేరంతా. జనార్దనం కొత్తమనిషిలా కనిపిస్తున్నాడు వారికి!

మరో అరగంటకి మినీ ట్రక్కుతో వచ్చాడతడు. ఆ సరికి సామాన్లన్నీ స్టేషన్ బయటికి చేర్చారంతా.

సామాన్లు ఎక్కించి కూర్చున్నారు.

రోడ్డుకిరుపక్కలా వున్న షాపుల్నీ, అంతస్తుల భవనాలని, వాహనాలని, జనాన్ని ఇంతింత కళ్లతో చూశారు.

ఎక్కడా పూరిళ్ళూ, గుడిసెలూ కనిపించకపోయేసరికి కనకానికెంతో ఆనందం కలిగింది. ఇక్కడ పెంకుటిళ్ళూ గుడిసెలూ లేనే లేవు. అయితే మేవూం ఇలాంటి పెద్ద మేడల్లోనే వుంటామన్నమాట. అనుకోకుండా వుండలేకపోయింది.

లారీ జీడిమెట్ల వైపు పరుగుపెట్టింది.

"దిగండి. ఇదే మీ ఇల్లు" అన్నాడు బాలయ్య.

తాళం తీశాడు. పక్క పోర్షన్లో వాళ్లు బయిటికొచ్చి వారి వంకా సామాన్ల వంకా చిత్రంగా అసక్తిగా చూశారు.

గుమ్మం దగ్గర కొబ్బరికాయ కొట్టించింది ముసలావిడ.

ముందు కనకం తర్వాత మిగతా వాళ్ళూ ఇంట్లోకెళ్లారు.

బుల్లి హాలు, ఒక చిన్నగది, వంట, వసారా, బాత్‌రూం- అంతే.

అలాంటిదే మరో పోర్షన్ దాన్ని ఆనుకుని వుంది. అందులో ఎవరో వున్నారు.

ఒక్కరి మొఖంలోను నెత్తురు చుక్క లేదు.

పల్లెలోని ఇంటి హాలు అంత వుంది మొత్తం ఇల్లంతా. సామాన్లన్నీ పెట్టుకోడానికే సరిపోదు! ఇంకెలా మసుల్తారు? ఇంకెక్కడ పడుకుంటారు?

"ఇల్లు మరీ చిన్నది. మనకి సరిపోదు"

కనకం భావం అర్థమైనట్టుగా అన్నాడు బాలయ్య, "అద్దె ఐదొందలు. కరెంటుకి యాభై"

మరి నోరు తెరవ సాహసించలేదెవరూ.

ఒక్కసారిగా తామూ తమ బతుకులూ కుంచించుకు పోయినట్టు అన్పించింది.

"నల్లా వస్తాంది..."

పక్కవాటా వాళ్ళు తలుపు తట్టి మరీ చెప్పారు.

"కుళాయి వస్తోంది మల్లీ- బిందెలందుకోవే. నీళ్ళు ఎంత సేపొస్తాయో ఏమో!" కనకం హడావుడి పడింది.

తల్లీ కూతుళ్ళు బిందెలు పట్టుకుని వెళ్ళి క్యూలో నిలబడ్డారు. నీళ్ళ చేరవేత అయ్యాక కిరసనాయిలు స్టవ్వు వెలిగించింది కనకం.

మొదట పాలు పొంగించింది. పరమాన్నం వండి దేవుడికి నైవేద్యం పెట్టింది. పిమ్మట అందరికీ వడ్డించింది. తర్వాత ఆవకాయతో అన్నంతిని భోజనం అయిందనిపించారు.

"వనవాసానికి వచ్చినట్టుంది" తనలో తను అనుకున్నట్టుగా అంది సూరమ్మ.

"ఏదో మంచి పని దొరికి నాలుగు రాళ్ళొచ్చి పడితే పెద్ద ఇంట్లోకి మారదాం. అంత వరకూ తప్పదు"

భర్త మాటలకి కోపం వచ్చేసింది కనకానికి. "కూర్చుంటే నించోడానికి లేదు. నించుంటే కూర్చోడానికి లేదు. ఎలా సర్దుకుంటాం?"

"అన్నిటికీ అన్నీ అంటే ఎలాగమ్మా. సరైన ఆదాయం వచ్చేవరకూ ఉన్నదాంతోనే సరిపెట్టుకోవాలి. ప్రతిదానికీ నాన్నని అంటే ఆయన మాత్రం ఏం చేస్తారు" అన్నాడు గోపి పెద్దరికంగా.

కొడుకు ఎంతో ఎత్తుకి ఎదిగిపోయినట్టుగా అన్పించాడు వెంకన్నకి.

"భేషైన మాటన్నావురా గోపీ. పొట్ట చేతబట్టుకుని ఇంతదూరం వచ్చినందుకు మీరంతా ఓ దారిన పడితే చాలురా" అన్నాడు వాత్సల్యంగా.

ముసలావిడ కూడా మురిసిపోయింది, "వీడిదంతా వాళ్ళతాత పోలికే ఆ పేరెట్టుకున్నందుకు ఆయన్లాగే గొప్పోడవు

తాడు. మంచికాలం వస్తాదిరా వెంకన్నా.. ధైర్యంగా ఉండు"

సాయంత్రం వేళ వెంకన్న, గోపి, శీను- కాలనీ అంతా తిరిగి వచ్చారు.

ఒక రకమైన పల్లెటూర్లానే అన్పించింది. పొలాలూ చెట్లూ లేవంతే తేడా. ఇళ్ళు అగ్గి పెట్టెల్లా వున్నాయి. రోడ్లు వున్నాయిలే అన్నట్టు వున్నాయి. అక్కడక్కడా చిన్న చిన్న దుకాణాలున్నాయి. నిత్యావసర వస్తువులు లభిస్తున్నాయి.

ఇంటి నుండి అరకిలోమీటరు దూరంలో సిటీ బస్సుస్టాపు వుంది. అక్కడ్నుంచి సిటీ లోని ముఖ్య ప్రదేశాలకు బస్సులున్నాయి.

గోపి అన్నీ శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. ఏ వ్యాపారమైతే బావుంటుందో అని ఆలోచిస్తూ ఆ దృష్టితో చూస్తున్నాడు.

"మా తమ్ముడు మా తమ్ముడు అని ఊరేగుతారు. అతగాడొస్తే చాలు అగ్గగ్గలాడుతూ అన్నీచేస్తారు. పొద్దున్ననగా వచ్చాం. జనార్ధనం గానీ అతడి భార్యగానీ తొంగి చూశారేమో చూడండి" నిష్ఠూరంగా అంది కనకం.

"వాడో వెధవ. నన్ను చూసి కూడా చూడనట్టూరుకున్నాడు. పెద్దమ్మా నీకు ఒంట్లో ఎలా వుందనడిగితే వాడి నోట్లోని ముత్యాలు రాలిపోతాయా! వాడ్ని తలచుకుంటే చాలు నాకు ఒళ్ళు మండిపోతుంది" అక్కసుగా అంది ముసలావిడ.

"వాడెలాటి వాడైనా వాడు తప్ప తెలుసున్నవాళ్లెవరూ లేరు కదా. అందుకని వాడ్ని నమ్మక తప్పదు. పాల ముంచుతాడో నీట ముంచుతాడో చూద్దాం"

కొడుకు మాటలకి "పాలు తనుంచుకుని నిన్ను నీట్లోనే ముంచుతాడు" అందావిడ.

★ ★ ★

శీనుని తీసుకొని మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న హైస్కూల్‌కి వెళ్ళాడు వెంకన్న.

స్కూలు ఆవరణ శుభ్రంగా ఉంది. చుట్టూ చెట్లు ఒక పద్ధతి ప్రకారం నాటి ఉన్నాయి. మూడంతస్తుల బిల్డింగులో ఉంది స్కూలు. ఆడుకోవడానికి పెద్ద గ్రౌండు వుంది.

యూనిఫాంలో ఉన్న పిల్లల్ని చూసి ముచ్చటపడ్డాడు వెంకన్న.

"దండాలండి. మాది గోదావరి జిల్లా అండి. మా పిల్లగాడ్ని మీ ఇస్కూల్లో చేర్పిద్దామని తీసుకొచ్చానండి"

వెంకన్న మాటల్లో ధ్వనించిన యాసకి చిరునవ్వు నవ్వేడు ప్రిన్సిపాల్.

స్కూలు వాళ్ళిచ్చిన సర్టిఫికెట్లు అందించగా అయిష్టంగానే తిరగేశాడాయన. మెరిట్ స్కాలర్‌షిప్ ఇస్తున్నారని చదివి నవ్వుకున్నారు.

## పరారయిన భూత వైద్యుడు

పంతులుగారు భూత వైద్యులనెందరినో ఒక్క భూతాన్నయినా చూపించమని అడిగే వారు. ఆ మేరకు ఒకడు ఓ రాత్రి ఆయన్ని ఊరి వెలుపలి మర్రిచెట్టు వద్దకు తీసుకెళ్లాడు. అయినా ఆయనలో భయం మచ్చుకైనా కన్పించకపోవడంతో ఎలాగైనా తను బయటపడాలని 'చూపినచో నీవు జడిసికొందువు' అన్నాడు.




'నేను జడుసుకోను' అని ధైర్యముతో నిలబడ్డారు పంతులుగారు.

'నీవు భయపడకపోయిననూ ప్రభుత్వము వారితో నాకు చిక్కు వచ్చును. అందుచేత నేను నీకు భూతాన్ని చూపను' అంటూ అక్కడినుంచి పారిపోయాడా భూతవైద్యుడు.

లెక్కల్లో రెండు సూత్రాలడిగారు. ఠక్ మని చెప్పేడు శీను. సైన్సులో రెండు బిట్లు అడిగారు. చెప్పేడు. ఇంగ్లీషు పాఠం లోంచి పెద్ద ప్రశ్న వేశారు. అదీ చెప్పాడు.

"గుడ్! తెలివైనవాడివేనన్న మాట..." తల పంకించారాయన.

పొంగిపోయారు తండ్రీకొడుకులు.

"డొనేషన్ ఐదు వేలు. ఏడాది ఫీజు రెండున్నరవేలు. నువ్వు కట్టగలవా?"

అయోమయంగా చూశాడు వెంకన్న.

"అదేంటండి. వీడికసలు ఫీజు లేదండి. ఎదురు ఇస్కూలు వాళ్ళే బాగా సదువుతా డని పుస్తకాలకీ ఆటికీ డబ్బిస్తారండి"

"గవర్నమెంటు స్కూల్లో అయితే ఫీజు లుండవు. ఇది ప్రైవేటు స్కూలు. ఫీజులూ స్పెషల్ ఫీజులూ డొనేషన్లూ అన్నీ వుంటాయి. మొత్తం 7500 కట్టగలవా?"

"తొమ్మిదో తరగతికి అంతా? ఆఖరికి పట్నంలో చదువు కొనుక్కోవాలా?"

"నువ్వెక్కడో సత్తెకాలంలో వున్నట్టున్నావు. స్కూళ్లూ, ఆసుపత్రులూ, అన్నీ ప్రైవేటు పరమైపోయాయి. డబ్బుంటేనే చదువు. డబ్బుంటేనే ఆరోగ్యం. డబ్బుంటేనే సుఖం. డబ్బుంటేనే ఆనందం"

నిస్పృహాయంగా చూశాడు వెంకన్న.

"యూనిఫాంకి, బూట్స్‌కి, బుక్సుకి ఇంకో వెయ్యి రూపాయల దాకా అవుతుంది. అందుకు సరిపడా డబ్బుంటే రా"

తలూపి వచ్చేశారు తండ్రీకొడుకులు.

టక్ చేసుకుని స్టైలుగా ఉన్న ఒకతన్ని సమీపించి, "గవర్నమెంటు ఇస్కూలు ఎక్కడుందండి" అనడిగాడు.

"ఇక్కడెక్కడా లేవు. ఉన్నా అనవసరం. ప్రభుత్వ పాఠశాల అని బోర్డు వుంటుంది తప్ప సరైన భవనం ఉండదు. బల్లలు వుండవు. మాస్టార్లు వుండరు. ఒకవేళ వున్నా శ్రద్ధగా పాఠాలు చెప్పేంత ఓపికా తీరికా వారికుండవు"

"గవర్నమెంటు వుండేది హైద్రాబాదు లోనే కదండి. ఆళ్ళు చూడరా?"

నవ్వేడతను.

అదే రోజు మధ్యాహ్నం మళ్ళీ వెళ్ళి శీనుని హైస్కూల్లో చేర్పించాడు వెంకన్న.

★ ★ ★

రెండో రోజూ జనార్ధనం రాలేదు.

గోపీ సలహాతో ఫోన్ చేశాడు వెంకన్న. ఇంటికి రమ్మన్నాడతడు.

"మన ప్రయత్నం మనం చేసుకుంటే మేలు" అన్నాడు సంభాషణంతా విన్న గోపి.

"జనార్ధనాన్ని తక్కువగా అంచనా వెయ్యకు. మనకి ఉజ్జోగాలేయించగలడు"

"నాకు నమ్మకం లేదు"

వారి సంభాషణంతా విన్నాడు షరీఫ్. అతడు వెంకన్న ఇంటికి రెండిళ్లవతల వుంటున్నాడు.

"ఏ ఊర్నించొచ్చారూ"

"శానా దూరమండి.. గోదావరి జిల్లా"

"ఉద్యోగం కోసం వచ్చేరా" వారితోపాటు నడుస్తూ అడిగాడు షరీఫ్.

"అవునండి. నేను సదువుకోలేదు గాని మావాడు బీకామ్ తప్పేడండి. ఇద్దరికీ బతుకు తెరువులు దొరక్కపోతాయా అని ఇక్కడికొచ్చాం"

"మా కంపెనీలో లేబర్ పని చూపించ మంటే చూపిస్తా. బాగానే వుంటది"

"అక్కర్లేదండి. జనార్ధనం అని మా తమ్ముడున్నాడు. పెద్ద ఆఫీసర్లెండి. అసలు వాడి పట్టువల్లే వచ్చేం. కారూ, మేడా అబ్బో శానా ఉన్నాయిలెండి. రేపు ఇంటికి రమ్మన్నాడు. ఏవో ఉజ్జోగాలు చూసే వుంటాడండి"

"మంచిది. నా పేరు షరీఫ్. నీ పేరు"

"వెంకన్న అంటారండి"

"అచ్ఛా భాయ్..." షరీఫ్ మరో పక్కకు వెళ్ళిపోయాడు.

"ఈయనెవరో మంచోళ్ళానే వున్నాడు"

"సాయిబుల్రా"

"అయితే"

"అమ్మో. వాళ్ళతో జాగ్రత్తగా వుండాలి"

"గట్టిగా అనకు గొడవలవుతాయి. ఇప్పుడు ఉన్నవాడూ లేనివాడూ అన్న తేడాలే గాని హిందూ ముస్లిం తేడాల్లేవు"

చిత్రంగా చూసాడు కొడుకు వంక.

బతికి చెడి వచ్చారంటూ ఇరుగుపొరుగు సానుభూతి చూపుతోంటే భరించడం కష్టంగా వుంది వెంకన్నకి.

నిన్నటి దాకా తను రైతు. తిన్నా తినక పోయినా ఒక రకమైన గౌరవం గుర్తింపు పొందుతూ వచ్చాడు.

కళ్ళం దగ్గరి కొచ్చిన ప్రతివారికీ అన్నో ఇన్నో గింజలు పెట్టిన వాడేగాని ఎవర్నీ ఒట్టి చేతుల్తో పంపలేదెన్నడూ.

అలాంటిదివాళ తల్లకిందులయ్యింది. ఓడలు బండ్లయ్యాయి !




**జ**నార్దనం ఇంటికెళ్ళారు.

సోఫాలు బావున్నాయి. టీవీ బావుంది. కిటికీలకి గుమ్మాలకి వున్న కర్టెన్లు బావున్నాయి. ఇల్లు బావుంది. ఇంటి చుట్టూ వున్న గార్డెన్ బావుంది.

"జనార్దనం పని దర్జాగా వుంది" అనుకున్నాడు వెంకన్న.

లోపల్నుంచి వచ్చాడు జనార్దనం.

"హైదరాబాద్ ఎలా వుంది? అంతా సెటిలయ్యారా. వద్దామనున్నాను గాని కుదర్లేదు. ఆఫీసులో పనెక్కువగా వుంటోంది."

## కొత్తగాలి...

**నక్షత్రాలు శ్రోతలుగా**
**నింగిలో నిండు చంద్రుడి**
**సంగీత విభావరి**
**నేలమీదకు జాలువారుతోంది**
**పండు వెన్నెలగా**
**సంగీత ఝరి**

– టి.చంద్రశేఖరరెడ్డి, హైదరాబాద్

"దానికేం లేరా. ఉన్న వూళ్ళో బతకలేక నిన్ను నమ్ముకుని పొట్టచేత పట్టుకొచ్చాం" వెంకన్న గొంతు గాద్గదికమయింది.

"కొత్త పద్ధతులు చేపట్టాలి తప్ప పాత పంథాలో వ్యవసాయం చేస్తే ఇంతే. తాహతు మించి ఖర్చు చెయ్యడం చతికిల బట్టం రైతులకి మామూలైపోయింది!"

"అదేంట్రా అలా అంటావ్. రైతు బతుకు నీకు తెల్వదా" దిగ్భ్రమగా చూస్తూ అన్నాడు.

"తెలుసు గనుకే అంటున్నాను. దానికేం గాని వీడేం చేస్తున్నాడూ..."

"బీకామ్ తప్పాడు. నువ్వే ఏదో ఉద్యోగం చూడాలి"

"బీఏలూ ఎమ్మేలూ చదివిన వాళ్ళే రోడ్లు సర్వే చేస్తున్నారు!"

అతడి ధోరణికి ఖిన్నుడయ్యాడు.

"మాకేమీ చూడలేదా? " సందేహిస్తూనే అడిగాడు వెంకన్న.

"చూస్తున్నాన్లే, నువ్వేమో లేబర్ పని తప్ప మరేదీ చెయ్యలేవు. వీడికేమో ప్యూను ఉద్యోగం లాంటిది తప్ప మరేదీ రాదు. కాస్త మంచి ఉద్యోగమైతే చాలు లంచాలడుగుతున్నారు..."

"తప్పదంటే ఇద్దాం మరి..."

"రేపు ఓ పదివేలు తెచ్చియ్యి. మంచి జాబ్ చూస్తాను..."

"మరి నా సంగతి..."

"నీ గురించే ఇబ్బందయ్యేట్టుంది. పెద్ద వాళ్ళకి చెప్పేప్పుడు పెద్ద పనులైతే తేలిగ్గా చెప్పెయ్యొచ్చు. చిన్న పనుల గురించి చెప్పాలంటే ఇబ్బందిగా వుంటుంది...."

వెంకన్న మొహం పాలిపోయింది.

"మరైతే నన్నేం చెయ్యమంటావు..."

"ఏదోటి చూద్దాంలే. మీరుంటున్నది ఇండస్ట్రియల్ ఏరియా. పరిశ్రమల్లో ఏమైనా పనులున్నాయేమో కనుక్కుంటూ వుండు. ఫలానా దాన్లో ఖాళీ వుందని చెబితే వెంటనే ఫోన్‌చేసి చెబుతాను..."

నీరుకారిపోయాడు వెంకన్న. తాము వస్తున్నట్టు నెలక్రితమే తెలియబర్చాడు గనుక తమకేదో చక్కని ఉద్యోగం చూసి రెడీగా వుంచుతాడని భావించాడు. బతుకు తెరువుకోసం తడుముకోవాల్సిన అవసరమే వుండదనుకున్నాడు.

పల్లెలో ఇంటికీ పాలకీ ఖర్చులేదు గనుక కొంతలో కొంత నయంగా వుండేది. ఇక్కడ ఇంటి అద్దె చెల్లించాలి. పాలుకొనాలి. బియ్యం, కిరాణా సరుకులు కొనాలి. స్కూలుఫీజు, బస్సుచార్జీలు కట్టాలి. నెల నెలా చాలా ఖర్చులున్నాయి!

తల్లిలాంటి పల్లెనొదిలి ప్రియురాలి లాంటి పట్నం వచ్చినందుకు పరిహారంగా బతుకుల్ని బలిపెట్టుకోవాలేమో!

పై పంచెతో కళ్లు తుడుచుకున్నాడు.

"అబ్బే నువ్వేం ఇదవ్వకు అన్నయ్యా. పరిస్థితి ఇదివరకట్లా లేదని చెబుతున్నానంతే. ఇదివరకు బోల్డుమందికి ఉద్యోగాలు వేయించాను తెలుసా? నీకు చదువున్నా, వీడు డిగ్రీ పూర్తిచేసినా ఇబ్బంది లేకపోయేది. రాజాలాంటి ఉద్యోగం వేయించేవాడ్ని. అధైర్య పడక్కర్లేదులే. ఆలస్యమైనా మంచిదే చూస్తాన్లే"

"ఆ పనిచేసి పెట్టి పుణ్యంకట్టుకోరా. లేకపోతే అన్యాయమైపోతాం" కంపిత స్వరంతో అన్నాడు.

"బాబాయి వాటం చూస్తుంటే మనకేమీ సాయం చేసేట్టు లేడు" అన్నాడు గోపి బయటికొచ్చేక.

"పైకి అలా కనిపిస్తాడు గాని తప్పకుండా సాయంచేస్తాడు. ఎందరికో చేసినవాడు రక్తసంబంధీకులకి చెయ్యడూ? !"

"నాకు నమ్మకం లేదు"

తోటకూర కాడల్లా వడలిపోయి వచ్చిన కొడుకునీ మనవడ్నీ చూసి, "అలావున్నారేంరా అబ్బాయ్. వాడు నక్క కబుర్లు చెప్పేడా? " అడిగింది ముసలావిడ.

కూతురందించిన నీళ్లు తాగి చతికిలబడి కూర్చుంటూ "ఏదేదో చెప్పుకొచ్చాడు" అంటూ జరిగిందంతా చెప్పేడు వెంకన్న.

"కాపురం చేసే కళ కాలిగోటి దగ్గరే తెలుస్తుందిరా. నీకు సాయం చేసేవోడయితే వెదుక్కుంటూ నీ గుమ్మంలోకే వొచ్చేవాడు. వాడు జిత్తుల మారోడు. నమ్మొద్దంటే విన్నావు కాదు" ఆవేదన పడింది సూరమ్మ.

కాసేపయ్యాక అన్నాడు వెంకన్న "నిన్న ఆ పైన వుంటున్న సాయిబు పనిప్పిస్తానన్నాడు. వెళ్ళి కలవమంటావా అమ్మా"

"పిలిచి పిల్లనిస్తానంటే వెక్కెక్కి పడ్డడంట వెనకటికెవడో. సాయం చేస్తానన్న వాడ్ని వదిలేసి ఆ నాలిముచ్చు ఇంటి చుట్టూ ఎందుకు తిరుగుతావురా... వెళ్ళెళ్ళు" తొందర పెట్టింది సూరమ్మ.

షరీఫ్ ఇంటికెళ్ళాడు.

"నువ్వా వెంకన్నా, రారా... "

"తమరేదో పనిప్పిస్తానన్నారు గదా.. కనుక్కుందామని వచ్చాను"

"జర చదివినవా"

తల అడ్డంగా వూపాడు.

"లేబరు పని చేస్తానంటే ఫ్యాక్టరీల సూస్త. మా ఆల్విన్ కంపెనీల సరుకులు మోసేటందుకు కూలీలు కావాల. మేస్త్రీతో మాట్లాడి ఏయిస్త. ముందుగాల రోజు కూలీ ఇస్తరు. పర్మనెంటయితే జీతం వస్తుంది. ఈయస్సై వుంటుంది..."

గబుక్కున అతడి చేతులు పట్టేసుకున్నాడు వెంకన్న.

"చచ్చి మీ కడుపున పుడతాను. ఆ పని ప్పించండి..."

"అరె గీ మాత్రానికి అంత ఇదైపోతావేంది భాయ్. మనం మనం భాయ్ భాయ్. ఒకరికొకరం మద్దత్ చేసుకోకుండా ఎట్లుంటాం..."

కళ్ళు తుడుచుకున్నాడు.

"పరేషాన్ కాకు వెంకన్నా. నీ గురించంతా మాకు తెల్సింది. చీకటి తర్వాత వెలుగు తప్పకుండా వస్తుంది. అల్లా నీకు మేలు చేస్తాడు. ఇయాల మేస్త్రీతో మాట్లాడినంక రేపు తీసుకుపోతాలె"

మరోసారి చేతులు జోడించాడు. షరీఫ్ భార్య తెచ్చిచ్చిన టీ తాగుతూ తన బాధలు చెప్పుకుని ఓదార్పు పొందాడు.

షరీఫ్ మాటలు బలాన్నిచ్చాయి వెంకన్నకి. 'ఫరవాలేదు. నాకు సాయం చేసే వాళ్ళున్నారు' అన్న భరోసా కలిగింది. తోటి మనిషి మీద నమ్మకం హెచ్చింది.

★ ★ ★

మల్లికని పక్క పోర్షన్‌లోని వారమ్మాయి ప్రమీల పిలుచుకెళ్ళింది.

"సినిమాకి వస్తావా? ఎంతో బావుంటుంది. అందులో హీరోయిన్ ఎన్ని డ్రెస్సులు మారుస్తుందో లెక్కలేదు. ఒక్కతినే వెళ్తే అమ్మ ఊర్కోదు. ప్లీజ్ రావూ?"

ప్రమీల తల్లి, తండ్రి ఇద్దరూ కూడా చిరుద్యోగులే. వాళ్ళు ఆఫీసుకెళ్ళాక ప్రమీలదే ఇంట్లో రాజ్యం. టీవీ తప్పితే సినిమా తప్ప మరో లోకం లేదామెకి.

మల్లిక మెత్తబడింది. ఆమె పట్టుమని పది సినిమాలు కూడా చూడలేదు.

"అంకుల్ నేను సినిమాకెళ్తున్నాను. మల్లికని తోడుపంపరూ. సినిమా హాలు దగ్గర్లోనే వుంది. తొందరగా వచ్చేస్తాం." అంది ప్రమీల.

భార్యవంక చూసాడు వెంకన్న.

## చతురలో పదో నవల



సింహప్రసాద్

సింహప్రసాద్ పేరుతో రచనలు చేసే నా పూర్తి పేరు చెలంకూరి వరాహ నరసింహ ప్రసాద్. పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం మండలంలోని మల్లవరం స్వగ్రామం. ఇప్పటివరకూ 42 నవలలు, 185 కథలు వివిధ పత్రికల్లో అచ్చయ్యాయి. 19 కథలు, 10 నవలలు బహుమతులు అందుకున్నాయి. ఇటీవల తి.తి.దే. ఆర్థిక సహాయంతో ప్రచురితమైన 'వివాహ వేదం' గ్రంథానికి విమర్శకుల ప్రశంసలు లభించడం నా అదృష్టం.

కథానికా శత జయంతి సంవత్సరంలో ఈనాడు, వేదగిరి కమ్యూనికేషన్స్, కథాకేళి, ఆంధ్రప్రదేశ్, స్వాతి, నవ్య, ఆంధ్రభూమి పత్రికల కథల పోటీల్లో బహుమతులు అందుకోవడం ఓ దివ్యానుభూతి.

'కొత్త చిగురు' చతురలో నా పదో నవల. నన్నెంతో ప్రోత్సహిస్తున్న చతుర సంపాదకులకు కృతజ్ఞతలు

చిరునామా :
సింహప్రసాద్
401, మయూరి ఎస్టేట్స్,
ఎమ్. ఐ. జి-II/650,
కేపీహెచ్‌బీ కాలనీ,
హైదరాబాద్-500072

"ఇంత దాకా బయటికి తొంగి చూళ్ళేదు పిల్ల. కాళ్ళు సాగినట్టూ వుంటుంది ఊరు చూసినట్టూ వుంటుంది మరి..." అంది కనకం సాభిప్రాయంగా చూస్తూ.

"జాగ్రత్తగా వెళ్ళిరా" పది నోటిచ్చాడు.

తూనీగలాగ ఎగిరింది మల్లిక. మొఖం కడుక్కుని ఇంత పౌడర్రాసుకుని రంగు రంగుల పరికిణీ ఓణీ ధరించి వెళ్ళింది.

ప్రమీల ఎవరికోసమో కలయజూస్తోంది. సినిమా మొదలవడంతో కళ్ళని తెరకి అంటించేసింది మల్లిక.

ప్రమీల పక్కకి ఒక యువకుడొచ్చి కూర్చున్న సంగతి ఆమె గమనించనేలేదు.

"ఇప్పుడే వస్తా. సినిమా చూస్తూండు" అని చెప్పి వెళ్ళిపోయింది ప్రమీల.

ఆమె వెనుకే వెళ్ళాడా యువకుడు. అప్పుడు చూసిందతడ్ని మల్లిక.

ఏదో తెలీని భయం వెన్నులో జర జర ప్రాకింది. ఒళ్ళు జలదరించిందొక్కసారి. ఆ వెంటనే సినిమాలో పడిపోయింది.

తెరమీది కథానాయిక అందాలని చూస్తూ ఊహల్లో తేలిపోసాగింది. మధ్య మధ్య ప్రమీల రాలేదని భయపడుతోంది.

ఎట్టకేలకు వచ్చింది ప్రమీల. ఒక్కతే వచ్చింది. ప్రాణం లేచొచ్చింది మల్లికకి.

సినిమా అయ్యాక బయటికెళ్తూ చూసింది నలిగిన ఆమె దుస్తుల్నీ, చెదిరిన బట్టల్నీ. మల్లిక చూపులకి కంగారు పడింది ప్రమీల.

"సినిమా మధ్యలో బయట కెళ్ళేనని ఎవరికీ చెప్పకు. మా అమ్మకు తెలిస్తే ఒళ్ళు చీరేస్తుంది."

"మరెందుకెళ్ళేవు?"

"పల్లెటూరి దానివి. నీకు తెలీదులే"

ముఖం ముడుచుకుంది మల్లిక. అది చూసి, "సరదాకన్నాను. ఏమీ అనుకోకు. ఎవ్వరికీ ఏమీ చెప్పనని ఒట్టెయ్యి" అంది చేయిచాచి.

అనుమానంగా చూస్తూనే ఆమె చేతిలో చెయ్యేసింది మల్లిక.




షరీఫ్‌కి కంపెనీలో మంచి పేరుంది. పని శ్రద్ధగా చేస్తాడు. కార్మికులతో కలుపుగోలుగా వుంటాడు. సలహాలిస్తాడు.

అతడు వెంకన్న గురించి చెప్పడం ఆలస్యం వెంటనే పేకింగ్ సెక్షన్‌లో క్యాజువల్ లేబర్‌గా తీసుకున్నారు.

వెంకన్నకి ఎంతో ఆనందం కలిగింది.

"మొత్తానికేదో ఉపాధి దొరికింది. కాళ్ళు ఆన్చడానికి నేల లభించింది. ప్రస్తుతానికిదే మహద్భాగ్యం" అనుకున్నాడు.

"దేవుడల్లే వచ్చి సాయపడ్డారు. మీ రుణం ఎలా తీర్చుకోను?" అన్నాడు నీళ్ళు నిండిన కళ్ళతో.

"అరె భాయ్ నువ్వు నా భాయ్‌వి. నేను చేసిందేం లేదు. అంతా అల్లా దయ"

"అల్లా నిన్ను చల్లగా చూస్తాడు."

"అల్లా దయకోసమే చూస్తున్నా. ఏక్ బార్ మక్కా వెళ్ళాలి భాయ్. చచ్చిపోయేలోగా ఒక్కసారి వెళ్తేచాలు. ఉస్కేబాద్ ఫికర్ నహీ" అన్నాడు.

అతడి కళ్ళల్లోని మెరుపుల్ని చూసి విస్తుబోకుండా వుండలేకపోయాడు వెంకన్న.

"మక్కా శానా దూరమా? తిరపతి కన్నా దూరమా"

"మనదేశంలో లేదు భాయ్. విమానం ఎక్కివెళ్ళాలి. చాలా డబ్బు కావాలి..."

పరిస్థితి అర్థమైంది. "నువ్వు తప్పకుండా

వెళ్తావు"

ఆ మాటలకి పరమానంద పడిపోయి కౌగిలించుకున్నాడు. మూడుసార్లు తన గుండెల్ని అతడి వక్షానికి హత్తుకున్నాడు.

ఇలా కౌగిలించుకుంటారని వెంకన్నకి తెలీదు. ఎంతో కొత్తగా కొంచెం వింతగా అన్పించింది. అదే సమయంలో అనిర్వచ నీయమైన ఆనందమూ కలిగింది.

ఇద్దరూ కలిసి ఇంటి మొఖం పట్టారు.

"నాకు సర్కారు కంపెనీలో నౌకరీ దొరి కిందమ్మా" ఇంట్లో అడుగు పెడుతూనే తల్లికి చెప్పాడు వెంకన్న.

ఆ మాట విన్న ఇంటిల్లిపాదీ పరమానం దపడిపోయారు. గుండెల మీంచి భార మేదో దిగిపోయినట్లుగా ఎంతో రిలీఫ్‌గా అన్పించిందందరికీ.

"మా నాయనే మా తండ్రే ఎంత చల్లని కబురు చెప్పేవురా. ఒసే కనకం అబ్బాయి నోరు తీపి చేయవే. డబ్బాలోని బెల్లం ముక్క తెచ్చిపెట్టు" అంది సూరమ్మ.

బెల్లం ముక్క ఇస్తూ "జీతం ఏ మాత్రం ఇస్తారు" అడిగింది కనకం.

"ముందు టెంపరివరీగా తీసుకున్నారు. తర్వాత పర్మనెంటు అవుతుంది. అంత దాకా రోజుకి డెబ్బైఐదు రూపాయల చొప్పున ఇస్తారు..."

"మనూళ్ళో కూలి వాళ్ళకిచ్చినట్టా? "

గబుక్కున అనేసింది కనకం. బ్రాన్పడి చూశాడు వెంకన్న.

అవున్నిజమే. ఇది కూలీ పనే. అక్కడ ఎండలో, వానలో, పొలాల్లో పని చేస్తారు. ఇక్కడ పాంటు, చొక్కా తొడుక్కుని ఫ్యాక్ట రీలో పని చేస్తారు. ఇద్దరి శ్రమా ఒక రకమే. కాదంటే అక్కడ వ్యవసాయవు సీజన్‌లోనే పని ఉంటుంది. ఇక్కడ రోజూ పనుంటుంది. అందులో తప్ప ఇంకెందు లోనూ తేడా లేదు.!

అతడి మనస్సు చేదుగా అయింది.

"షరీఫ్ పుణ్యమా అని ఏదో ఒక ఆధారం దొరికింది. ఒకపూట తిండికి

## కొత్తగాలి...

**తలల మెట్లెక్కి**
**దించుతాడు**
**నాయకుడు**
**గగనాన్ని గంగను**

*- ఆచార్య కొలకలూరి ఇనాక్, హైదరాబాద్*

లోటుండదు. తర్వాత మంచి నౌకరీ లభిస్తే అప్పుడు ఇది మానేసి అందులో చేరొచ్చులే. గోపీ ఏడీ? "

"వ్యాపారం గురించి అందర్నీ కలుసు కుని వివరాలు సేకరిస్తున్నాడు."

"నా దగ్గర నలభైవేలు కూడా లేవు. దాంతో ఏ వ్యాపారం చేస్తాడు? డబ్బంతా వ్యాపారంలో పెట్టేస్తే రేపు దేనికైనా అవ సరమైతే ఏం చేస్తాం? పీకలమీదకొస్తే ఎవర్నడుగుతాం? ఈ సిటీలో మనల్ని ఆదుకునేవాళ్ళెవరున్నారు? " అన్నాడు.

అతడి స్వరంలో ధ్వనించిన జీరకి కది లిపోయింది సూరమ్మ.

"అదేంట్రా అబ్బాయ్ అలా నీరుగారిపో తావు. ఇది వూరుగాని వల్లకాడు కాదుగా. మనిషికి మనిషి సాయం అన్నారు..."

షరీఫ్ గుర్తొచ్చాడు వెంకన్నకి.

నిజమే. తనకి షరీఫ్ సాయం. అతడికి ఇంకొకరు. వారికి మరొకరు. ఒకే రకపు స్థితిలోవున్న తామంతా ఒకరికొకరై ఒక్క టిగా నిలవాలి. ఒక్కరిగా నిలబడాలి.

"ఇక నుంచి ఇదే మన ఊరు. వీళ్ళే బంధువులూ మిత్రులూ" అన్నాడెంతో భరోసా ఫీలవుతూ.

ఇంతలో శీను వచ్చాడు.

నీలంరంగు ప్యాంటు ధరించి తెల్లషర్టు టక్ చేశాడు. నలుపు చారలుగల టై, నల్లని బూట్లు ధరించాడు. ఇదివరకున్నా మనిషి సాగాడు. తృప్తిగా ఉన్నాడు. ఉత్సా

హంగా ఉన్నాడు.

దొరబాబులా ఉన్న కొడుకువంక చూసి మురిసిపోయి తల నిమిరాడు. "నా దిష్టే తగిలేట్టుంది అనుకుంటూ ఇస్కూలు ఎలా వుందిరా శీనూ" అన్నాడు వెంకన్న.

"చాలా బావుంది నాన్నా. పాఠాలూ బాగా చెబుతున్నారు. సైన్సు ప్రాక్టికల్స్ కూడా చేసి చూపిస్తున్నారు" మెరుస్తోన్న కళ్ళతో చెప్పేడు వాడు.

★ ★ ★

ఎలాగైనాసరే బిజినెస్ ప్రారంభించాలని పట్టుదలగా వున్నాడు గోపి.

తండ్రిమాట తోసిపుచ్చలేక పదివేలు పట్టుకెళ్ళి జనార్దనానికి ఇచ్చాడు. కాని అతడు తమకేదో ఉద్యోగం వేయిస్తాడన్న ఆశ ఏ కోశానా లేదతడికి.

ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన పథకం కింద బ్యాంకులు లక్షరూపాయల్దాకా అప్పిస్తాయని తెలిసింది. ఎలాంటి స్థిరాస్తి హామీ ఇవ్వక్కర్లేదని విని సంతోషించాడు. ఆ పథకాన్ని ఉపయోగించుకోవాలనుకున్నాడు.

బస్టాపు ప్రాంతం మరింతగా పెరిగే అవకాశం వుంది గనుక ఆ ఏరియా మీద దృష్టి నిలిపాడు. కిరాణా అండ్ జనరల్ స్టోర్స్ అమ్మకానికుందని తెలిసి వెళ్ళాడు.

"డెవలపింగ్ కాలనీ. అమ్మకాలు బాగున్నాయి. ఇంకా వృద్ధి చేసుకోడానికి ఎంతో అవకాశముంది. కుర్రాడివి కష్టపడగలవు" అన్నాడు బలరాముడు.

"యాభైవేలదాకా సరుకుంది. మధ్యవర్తి ద్వారా విలువ కట్టిద్దాం. ఫర్నిచర్ ఇరవైవేలుంటుంది. రావాల్సిన బాకీలు ఇవ్వాల్సిన బాకీలూ నేను చూసుకుంటాను. బిల్డింగ్ ఓనర్‌కి పదివేలు ఎడ్వాన్సు ఇచ్చాను. అదీ ఇవ్వాలి" అతడన్నాడు.

మనసులో లెక్క వేసుకున్నాడు గోపి. మొత్తం ఎనభైవేలలోపే వుంటుంది. కొత్త సరుకు ఇరవైవేల దాకా పెట్టినా లక్షలో అయిపోతుంది.

బ్యాంకు అప్పు లక్షవరకూ ఇస్తారు. ఆ అప్పుతో షాపు కొంటే రెండేళ్ళలో అప్పు సొంతం తీర్చేయగలడు.

ఆ తర్వాత అంచెలంచెలుగా వ్యాపారాన్ని విస్తరిస్తాడు. రెండు చేతులా డబ్బు సంపాదిస్తాడు. స్వంతంగా ఇల్లు, స్కూటరు, ఫోను... అన్ని సుఖాలూ నడిచొస్తాయి. ఆస్తులు కొని కుటుంబానికి తాతలకాలంనాటి వైభవాన్ని తీసుకొస్తాడు!

ఆ ఊహ ఎంతో ప్రేరణ కలిగించింది గోపికి.

"నాన్నతో మాట్లాడి రేపు చెబుతా"

షాపులోని సరుకుని మరోసారి పరిశీలించాడు. సెంటర్నీ సెంటర్లోని ఇతర దుకాణాల్నీ పరీక్షగా చూశాడు.

ఒక పక్కన చాట్‌బండార్ కన్పించింది. సాయంత్రం వేళవడం వల్ల పిల్లలు, పెద్దలూ ఎక్కువ మంది మూగివున్నారు.

దగ్గరకెళ్ళి షాపతన్ని చూసి పలకరింపుగా నవ్వేడు. "ఏం కావాలి, పావుబాజీ, సమోసా చాట్, పానీపూరీ... ? "

"నీతో మాట్లాడాలి. ఏది బావుంటే అదియ్యి"

చిత్రంగా చూసి సమోసా చాట్ తయారు చేసి ప్లేటులో పెట్టి ఇచ్చాడు.

జనం వెళ్ళేక అన్నాడు "బేరాలు బాగానే వున్నాయా? "

"ఆపైన కాలేజి వుంది. కుర్రాళ్ళెక్కువగా వస్తారు. ఈ చుట్టుపక్కల కాలనీలు పెరిగేయి కదా. ఇదీ సెంటరవుతోంది"

"కిరాణాషాపు పెడితే ఎలాగుంటది? "

"ఆ షాపుందికదా ఇంకోటి ఇప్పుడప్పుడే లాభం లేదు. జనాలకి కొత్త కొత్త రకాలు కావాలి. అదిగో ఆ పక్క అరుగు మీద కూర్చుని మా నాయన ఇడ్లీలూ, అట్లూ అమ్మేవోడు. అల్లపచ్చడి భలేగా చేసేవాడు. దానికోసమే వచ్చేవారంటే నమ్ము. ఆ పక్కన హోటల్ వచ్చేక మా నాయన

డానైపోయాడు. నేనిది మొదలెట్టాను. ఇవాళ ఇడ్లీ ఉప్మా ఎవరు తింటారు? అందుకే చాట్ బండార్ పెట్టేను. వ్యాపారం జోరుగా వుంది" అన్నాడు తిరుపతి.

"ఆ షాపు కొందామనుకుంటున్నాను..."

ఎగాదిగా చూసి అన్నాడు. "ఇంకేం చూడక్కర్లేదు. కొత్తరకాలు ఆడోళ్ళవి పెట్టేవంటే బిజినెస్సు మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉంటుంది."

షాపు గురించీ బ్యాంకు ఇచ్చే అప్పు గురించీ అమ్మకాల గురించీ వివరంగా ఇంట్లోవారికి చెప్పాడు గోపి.

"నాఅంత అయ్యావు. నాకన్నా కూడా మంచీచెడూ నీకు బాగా తెలుసు. నేన్నీకేం చెప్పగలన్రా. అన్నీ సంగతులూ లోతుగా ఆలోచించు. బ్యాంకోళ్లని కలుసుకో. ఎలా బావుంటుందంటే అలా చేద్దాం."

తండ్రి అంత తేలిగ్గా ఒప్పేసుకుంటాడని ఊహించని గోపి విస్తుబోయి చూశాడు. ఆ చూపులో ప్రేమవుంది. ప్రశంస వుంది.

"మల్లిక గురించి కూడా ఆలోచించి ఏదైనా చేస్తే బావుణ్ణు" జనాంతికంగా అంది కనకం.

"పెళ్ళి సంగతా? సరీగ్గా నిలబడ్డానికే లేదు. ఇక పెళ్ళి గురించి ఆలోచించే ఓపి కెక్కడుందీ" నిట్టూర్చాడు వెంకన్న.

"ఆ సంగతికాదు టెన్త్ పాసయిందిగా. కాన్వెంట్లో పంతులమ్మ ఉద్యోగాలిస్తారంట. పంపిస్తే బావుంటుందన్నారు అమ్మలక్కలంతా. రేపు పెళ్లైనా వేణ్ణీళ్లకి చన్నీళ్ళలా ఉపయోగపడతాయి."

కూతురి వంక సాలోచనగా చూశాడు వెంకన్న. తలొంచుకుందామె.

ఉద్యోగం చేయాలని చాలా ఉబలాటంగా ఉంది మల్లికకి. నిజానికా ఆలోచన్ని తల్లి మెదడులో నాటింది మల్లికే.

ఉద్యోగం చేస్తే చేతిలో డబ్బుంటుంది. మంచి మంచి చీరలు ధరించి షోగ్గా తిరగొచ్చు. ఎందర్తోనో పరిచయమవ్వొచ్చు.

సినిమాల్లోలా ఏ రాకుమారుడో తనని చూసి వరించవచ్చు. స్వప్నాలని సత్యం చేసుకోనూవచ్చు!

"సవత్తాడిన పిల్లని తెయ్యమంటూ ఉజ్జోగానికి పంపిస్తావుట్రా. హవ్వ!" బుగ్గలు నొక్కుకుంది సూరమ్మ.

"ఇక్కడెవరూ తప్పుగా చూడరు. మన కాలనీలోనే బోల్డుమంది ఉజ్జోగాలు చెయ్యట్లేదూ. పక్కింటావిడా చేస్తోంది. మీదంతా చాదస్తం..." చటుక్కునంది కనకం.

ఆ మాటలకి సర్రున కోపంరాగా కయ్‌మని లేచింది కోడలి మీద ముసలావిడ. "నాకు చాదస్తమంటావుటే నీకు చాదస్తం. మీ నాన్నకి చాదస్తం. మీ తాతకి చాదస్తం. అసలు మీ వంశానికే చాదస్తం. ఎన్నో చూసిందాన్ని ఎందర్నో చూసిందాన్ని నన్ను పట్టుకుని చాదస్తం అంటావా? రేపు కాలుజారి కడుపు తెచ్చుకుంటే ఉరేసుకోవాల్సింది నువ్వా నీ మొగుడూనే పిచ్చిదానా. ఇది మగాళ్ళ లోకం. గడప లోపలుంటేనే ఆడదానికి రక్ష. గడపదాటిన సీతలకోసం రావణాసురులు కాచుక్కూర్చుంటారే ..."

ఊపిరందక ఒగర్చసాగిందావిడ.

"నువ్వు చెప్పినట్టే వింటాంలే, వూరుకో"

★ ★ ★

వరుసగా వారం రోజులపాటు భర్తతో పోరాడి గ్యాస్ స్టవ్ కొనిపించింది కనకం.

అది కొన్నందుకన్నా భర్త తనమాట విన్నందుకెక్కువగా పొంగిపోయిందామె.

చకచకా వంట చేస్తున్నారు తల్లీ కూతుళ్ళిద్దరూ కలిసి.

వెంకన్న ఫ్యాక్టరీకెళతాడు. శీను స్కూలు కెళ్ళిపోతాడు. గోపి బ్యాంకు అప్పుకోసం తిరుగుతున్నాడు.

ముసలావిడ నగరానికి వచ్చినప్పటి నుండి మన్నుతిన్న పాములా మారిపోయింది. ఇదివరకటి ఉత్సాహంలేదు. ఆ కబుర్లూ లేవు. తనలో తను గొణు

# కీర్తన స్వరూపం పాడు చేశాడు?



**మూ**గూరు సుబ్బణ్ణ, ప్రముఖ సంగీత విద్వాంసులు మైసూరు సదాశివరాయల సమకాలీనులు. ఆయన అనేక కచ్చేరీలు చేసి ప్రసిద్ధికెక్కారు. చాలా మందికి శిక్షణనిచ్చారు. స్వరజతులు, వర్ణాలు, కీర్తనలు అనేకం రచించి, సంగీత సరస్వతికి అమూల్యసేవ చేశారు. మాయా మాళవ గౌళ రాగంలో రచించిన 'జననీ', శ్రీరాగంలో రచించిన 'వనజనేత్రి' వర్ణాలు నాటి విద్యార్థుల, విద్వాంసుల వలయాల్లో ఎక్కువగా వాడుకలో ఉండేవి.

సదాశివరాయలు కమలామనోహరి రాగంలో విరచించిన 'నరసింహుడు' అనే కీర్తనను సుబ్బణ్ణ ఒక కచ్చేరిలో పాడారు. ఆ కచ్చేరీకి వెళ్లిన ఒకానొక పెద్దమనిషి సదాశివరాయలవద్దకు వెళ్లి 'కీర్తన స్వరూపాన్నే పాడుచేశాడు సుబ్బణ్ణ. సాహిత్యం హత్యకు గురైంది' అని పితూరి చేశాడు. దాంతో సదాశివరాయలకు చాలా ఖేదం కలిగింది. ఈ సమాచారం ఎట్లో సుబ్బణ్ణ చెవిలో పడింది. ఆనాటినుంచి రెండు నెలల కాలం అజ్ఞాతవాసంలోకి పోయాడు సుబ్బణ్ణ. పగలనక రాత్రనక ఆ ఒక్క కీర్తననే అభ్యాసం చేసి నేర్చుకున్నారు. సదాశివరాయల దగ్గరకు వెళ్లి ఆ కీర్తనను వారి సమక్షంలో పాడేందుకు అనుమతి కోరారు. సుబ్బణ్ణ గానవైఖరిని విని సదాశివరాయలు పరవశులయ్యారు. 'సుబ్బణ్ణా! ఇంతకు పూర్వం నిన్ను నేను ఆక్షేపించడం కద్దు. నా వల్ల అపరాధం జరిగింది. మహావిద్వాంసుడివి నీవు. నా కీర్తనను పాడాలంటే దానికి నీవే సరి' అన్నారాయన. ఆరోజునుంచి సుబ్బణ్ణ ఏ కీర్తన పాడాలన్నా ముందస్తుగా సుప్రసిద్ధ సాహితీవేత్తల వద్దకు వెళ్లి ఆ కీర్తనలోని సాహిత్యానికి భావార్థాన్ని వివరంగా తెలుసుకొనేవారు. అర్థానుసంధానం చేసుకొంటూ పాడుతూండటంతో భావగర్భితమైన వారి గానం అమృతాయమానంగా ఉండేది.



క్కుంటూ భయం భయంగా చూస్తూ ఏదేదో కలవరిస్తూ ఎక్కువగా మంచానికే పరిమితమైపోతోంది.

కనకానికీ మల్లికకీ పగలంతా ఖాళీయే.

నవారు నేయటమో, లేసులల్లటమో చేస్తే పైఖర్చులకి నాలుగు డబ్బులొస్తాయి కదా అని సూరమ్మ గొణుగుతూంటుంది గాని వారి చెవికెక్కడంలేదు.

ఇంట్లో ఒక్కదానికీ తోచక కబుర్లు చెప్పే వాళ్లూ లేక మొదట్లో ఎంతో విసుగ్గా వుండేది కనకానికి. తర్వాత్తర్వాత తనూ టీవీకి అలవాటు పడిపోయింది. ఇంటిపని పూర్తవడం ఆలస్యం ఎదురింటికెళ్లి వారి రంగుల టీవీముందు పాతుకుపోతోంది!

మల్లిక మాత్రం ప్రమీల ఇంట్లోని పోర్టబుల్ టీవీతోనే కాలక్షేపం చేస్తోంది. టీవీతోపాటు ప్రమీల చెప్పే కబుర్లు తీయగా వుంటున్నాయి. సినిమాలకెళ్ళినా షికారుకెళ్లినా ఇద్దరూ కలిసే వెళ్తున్నారు.

టీవీలో సినిమా పాటొస్తోంది. ఆ పాటలోని హీరోయిన్లా ప్రమీల గెంతుతోంది. డాన్సంటూ పిచ్చిగా చిందులేస్తోంది.

ఆమెనే కళ్ళప్పగించి చూస్తోంది మల్లిక.

తనకీ అలా చెయ్యాలనుంది. ఆమెకంటే బాగా చెయ్యగలనని ఆమెకన్నా పదిరెట్లు అందంగా వుంటానని భావిస్తోంది.

"టీవీలో చూసి నేర్చుకున్నాను" అని ఆగి, "సిద్ధూకి ఇవంటే ఇష్టం" అంది రహస్యంగా ప్రమీల.

"సిద్ధు ఎవరు? "

"సిద్ధు సిద్ధార్థరాయ్..." అని గల గలా నవ్వేసి "ఖుషి చూళ్ళేదా? " అందులో పవన్‌కళ్యాణ్ పేరు" అంది.

అయోమయంగా చూసింది మల్లిక.

గర్వంగా నవ్వింది ప్రమీల. "సినిమాల్లోలా నేనూ సిద్ధూ ప్రేమించుకుంటున్నాం. సిద్ధూకి నేనంటే పిచ్చిప్రేమ. బోల్డు బోల్డు కొనిస్తాడు. హోటల్‌కి తీసుకెళ్తాడు. ఇదిగో ఈ బ్రా కూడా సిద్ధూయే కొన్నాడు. ఎవరికీ చెప్పకేం? " అంది పెట్టెలోంచీ బ్రా తీసి చూపిస్తూ.

సిగ్గుపడుతూనే ఆమె చూసింది. వక్షం పెద్దగా కన్పించేట్లు చేసే బ్రా అది.

"మీ పెళ్ళికి మీ అమ్మా నాన్నా ఒప్పుకోకపోతే? "

"వాళ్ళొప్పుకోరు. సినిమాల్లో చూట్టం లేదూ. ప్రేమ సినిమాల్లో తల్లీ తండ్రీ విలన్లు. మేం ఎవర్నీ లెక్కచెయ్యం. ఎక్కడికన్నా పారిపోయి సుఖంగా వుంటాం. నేనూ సిద్ధూ, సిద్ధూ నేను, అంతే"

మల్లికకి మాటలు కరువయ్యాయి. అసూయగా చూసింది!




**వెం**కన్నకి ఫ్యాక్టరీ వాతావరణం ఎంతో బాగా నచ్చింది.

ఊహ తెలిసినప్పట్నుంచీ ఒళ్ళొంచి కష్టించినవాడే కావడంతో బరువుమోత పని బరువుగా లేదు.

ఎండకి ఎండుతూ, వానకి తడుస్తూ, చలికి వణుకుతూ పనిచెయ్యక్కర్లేదు. పెట్టుబడికి వెదుక్కోనక్కర్లేదు. తెగుళ్ళు వస్తాయని భయపడనక్కర్లేదు. ఫలసాయం చేతికందుతుందో లేదోనన్న దిగులులేదు. అప్పు భయం, భారం లేవు.

ఎగుడు దిగుడు లేకుండా సాఫీగా నిశ్చింతగా సాగిపోతోంది కాలం. వారం తిరిగే సరికి కూలీడబ్బు చేతిలో పడుతోంది. అది తక్కువే కావచ్చు. కాని కచ్చితంగా చేతిలో పడుతుందన్న భరోసా వుంది. రేపెలాగ అని ఆందోళనపడాల్సిన అగత్యం లేదు.

భోంచేస్తూ కార్మికులంతా ఒకరి కష్టసుఖాలొకరికి చెప్పుకుంటున్నారు. వాటివల్ల అతడి లోకజ్ఞానం విస్తృతమవుతోంది.

కేజువల్ లేబర్‌గా పనిచేస్తున్న అందర్నీ పర్మనెంటు చెయ్యమని యూనియన్ డిమాండు చేసింది.

పర్మనెంటు అయితే వచ్చే బెనిఫిట్ల గురించి చర్చిస్తూ ఎంతో ఆశగా ఎదురు చూస్తున్నాడు వెంకన్న.

మిగతా వాళ్ళతోబాటు యూనియన్ ప్రతి మీటింగుకీ వెళ్తున్నాడు. నాయకులు చెప్పేవి శ్రద్ధగా వింటున్నాడు.

'యాజమాన్యం', 'యూనియన్', 'సమిష్టి శక్తి', 'పెట్టుబడి', 'శ్రమదోపిడి', 'లాభం' వగైరా పదాలూ వాటి అర్థాలూ, ప్రభావాలూ మెల్లమెల్లగా తెలుసుకుంటున్నాడు.

యూనియన్ నీడలో భవిష్యత్తు ఎంతో ఆశావహంగా కన్పించసాగింది.

డ్యూటీ దిగేక షరీఫ్ వచ్చేదాకా వుండి ఇద్దరూ కలిసి ఇంటికెళ్తున్నారు. దారిలో ఎన్నో సంగతులు వివరిస్తున్నాడు షరీఫ్.

"మన కాలనీ చూసినవు కదా భాయ్. రోడ్లు లేవు, డ్రైనేజీ లేదు. చాలినన్ని నల్లాల్లేవు. ఒక పక్కన ఫ్యాక్టరీల దుర్గంధం. కాలుష్యం, గలీజు, యే సబ్ కోయి నహి దేఖ్తా. రోటి కపడా ఔర్ మకాన్ కన్నా హైటెక్కులు ఎక్కువయ్యాయి. పానీ, బిజిలీలకన్నా రింగురోడ్లు ఘనమయ్యాయి. యా అల్లా! ఏం కాలం వచ్చిపడింది!"

షరీఫ్ మాటలకి తలాడించాడు.

ఇంతలో ఓ మోపెడ్ వారిని దాటి వెళ్ళి రోడ్డు మలుపులో ఆగింది.

దానిమీంచి ప్రమీల దిగుతోంది!

★ ★ ★

ఇంట్లోకొస్తూన్న వెంకన్నని చూసి తన కళ్ళని విశ్వసించలేకపోయాడు జనార్దనం.

ఈ వెంకన్న పల్లెటూరి వెంకన్న అంటే నమ్మశక్యం కానివిధంగా వున్నాడు. ఖద్దరు పంచె, ఖద్దరు బనీను ధరించి, తైలసంస్కారంలేని జుట్టుతో బండగా వుండేవాడు. ఇప్పుడు ప్యాంటూ షర్టూ వేశాడు. మనిషిలోకి నాజూకుతనం వచ్చింది. వయస్సుకు తగినట్టుగా కన్పిస్తున్నాడు.

"గోపికేమైనా ఉద్యోగం చూశావుట్రా"

"రిక్రూట్ మెంట్ మీద బ్యాన్ వుంది. అంచేత ప్రభుత్వశాఖల్లోని ఖాళీల్ని భర్తీచేయడంలేదు. అన్ని ఆఫీసుల్లోనూ కంప్యూటర్లు పెట్టి ఉద్యోగాలని తగ్గించాలని చూస్తున్నారు..."

"ప్యూన్ ఉద్యోగం దొరికినా బావుణ్ను. మా కంపెనీలో లేబర్‌గా తప్ప తీసుకోవట్లేదు. అలాంటి బరువుపనులు వాడు చెయ్యలేడు"

"చాలామందికి చెప్పేస్లే. కాస్త ఓపిక పట్టు. ఎందులోనో ఒకందులో వేయించే పూచీ నాది"

"గోపీ వినటంలేదు. వ్యాపారం చేస్తానంటున్నాడు. మా కాలనీలో కిరాణాషాపు అమ్మకానికొచ్చింది. అది కొంటానంటాడు. మన దగ్గర డబ్బులేదంటే బ్యాంకులో ఇస్తారంటాడు. నీకు తెలిసిన బ్యాంకు వాళ్ళెవరైనా వుంటే కనుక్కుంటావా?"

పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది జనార్ధనానికి.

బ్యాంకు అప్పుకి తనని హామీ వుండమంటాడేమోనని భయమేసింది. అలాటి లంపటాల్లో దిగటం అతడికిష్టం లేదు.

"ఏదో చెబుతూంటారు గాని బ్యాంకులు చిన్న చిన్న వ్యాపారులకి అప్పివ్వరన్నయ్యా. వాళ్ళనీ వీళ్ళనీ నమ్మేకన్నా వడ్డీ వ్యాపారుల్ని ఆశ్రయించడం మంచిది"

తటపటాయిస్తూ అడిగాడు, "నువ్వేమైనా ఓ యాభైవేలు సర్దగలవా. ఊరికే కాదు, వడ్డీ ఇస్తాను..."

"భలేవాడివన్నయ్యా! నా ఆదాయం నా ఖర్చుకే చాలదు. పిల్లల చదువులకి డొనేషన్లూ ఫీజులూ కట్టడానికి నేనే కిందామీద పడుతున్నాను. తల తాకట్టు పెట్టి అయినా సరే అప్పు చేసి మణి పెళ్లి చేసెయ్యమని మీ మరదలు పోరు పెడుతోంది. పెళ్ళంటే మాటలా చెప్పు లక్షల కట్నాలూ వేల లాంఛనాలూనూ!"

ఇంటికెళ్ళేసరికి అతడి కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు గోపి.

"బలరాముడు తొందరపెడుతున్నాడు. ఇంకో బేరం వచ్చిందిట. రేపట్లోగా తేల్చి చెప్పమన్నాడు. ఇది చేజారితే ఇంకోటి ఇప్పట్లో దొరకదు. దొరికినా ఇంత అనుకూలంగా ఉండదు"

గోపి మాటలకి, "కాళ్ళ దగ్గరకొచ్చిన బేరం కాశీకెళ్ళినా దొరకదంటారు మరి" అంది నానమ్మ.

గోపి ఆవిడకీ తల్లికీ ముందే నూరిపోశాడు. ఆ షాపు కొనుగోలు చేస్తే నెలకి అయిదారు వేలు చులాగ్గా సంపాదించొచ్చని వాళ్ళకి లెక్కలేసి మరీ చెప్పేడు!

అప్పుడిహ కాస్త విశాలమైన ఇంట్లోకి, నీళ్ళకి ఇబ్బందిలేని ఇంట్లోకి మారొచ్చన్నాడు. శీను చదువు నిరాటంకంగా సాగిపోతుందన్నాడు. రెండేళ్ళలో మల్లిక పెళ్లి చేసేస్తానని కూడా చెప్పేడు.

## కొత్తగాలి...

**గుడి బయట, లోపల**
**యాచకులే**
**ఒకరు చేతులు చాచి**
**మరొకరు చేతులు జోడించి**

**– వి.లక్ష్మీశారద, రాజమండ్రి**

## కొత్తగాలి...

**గరిష్ఠ చిల్లర ధర**
**బజార్లో అమ్మే**
**అన్ని వస్తువులకూ**
**రైతు పండించే పంటలకు మాత్రం**
**దళారీ పెట్టిందే ధర!**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప*

"బ్యాంకు వాళ్ళేమన్నార్రా? "

"డిస్ట్రిక్ ఇండస్ట్రీస్ సెంటర్ వాళ్ళు ఇంటర్వ్యూ చేసి అప్లికేషను బ్యాంకుకి పంపిస్తారంట. దానికింకో రెండు మూడు నెలలు పండుతుందిట. రెండువేలిస్తే ఇంటర్వ్యూలో సెలక్టు చేయించి, బ్యాంకు అప్పు ఇప్పిస్తానని అందులో పన్జేసే ఒకాయన ప్రామిస్ చేశాడు"

"బలరాముడు అప్పటిదాకా ఆగుతాడా? "

"ఆగేట్టుంటే ఇంత కంగారెందుకూ, రేపట్లోగా ఎలావోలా డబ్బిచ్చెయ్యాల్సిందే"

"ఇల్లూపొలం అమ్మిన బాపతు సొమ్మింకా ముప్ఫైవేలు ఉందిరా..."

"అదేవిటి? అప్పుడే ఇరవై ఆరువేలు ఖర్చైపోయాయా? "

"కూర్చుని తింటే కొండలు సైతం కరిగిపోతాయిరా. జనార్ధనానికి పదివేలిచ్చామా? శీను స్కూలుకీ, ఇంటికీ, పాలకీ బియ్యానికీ, వెచ్చాలకీ, బట్టలకీ... ఒకటేమిటి ప్రతీదానికీ ఆ డబ్బే కదా. నా కొచ్చే కూల్డబ్బులు ఇంటద్దెకీ, ఖర్చుకీ చాలవు. పర్మనెంటు అయితే ఊపిరి పీల్చుకోవచ్చని చూస్తున్నాను. అది అంతకంతకీ వెనక్కిపోతోంది" నిరాశగా అన్నాడు వెంకన్న.

"ఎంతలేదన్నా ఇంకో నలభై వేలు కావాలి" అంది కనకం.

"మనల్ని నమ్మి ఎవడిస్తాడు అంత సొమ్ము? నోరు తెరచి అడిగినా మొండి చెయ్యి చూపాడు జనార్ధనం!"

"అప్పుచేద్దాం" అన్నాడు గోపి.

వెంకన్న గుండె ఝల్లుమందొక్కసారిగా.

"అప్పుల పాలయ్యేకదురా ఉన్నదంతా అర్పించేసి కట్టు బట్టల్తో ఇంతదూరం వచ్చాం. అప్పుడు తాతతండ్రులిచ్చిపోయిన పొలం ఉంది గనుక సరిపోయింది. చావు తప్పి, కన్ను లొట్టపోయి బయటపడ్డాం. ఇప్పుడెలా బయటపడగలంరా!"

"నేను తీరుస్తాను. వ్యాపారం మీదా, నా దక్షత మీదా నాకు నమ్మకం ఉంది" దృఢ స్వరంతో అన్నాడు గోపి.

"సరే ఎక్కడైనా అప్పుదొరుకుద్దేమో వాకబు చేద్దాంలే. ఏమో నీవల్ల కుటుంబం పైకొస్తుందేమో!" మెత్తబడుతూ అన్నాడు.

"మన పక్క పోర్షన్లోని చలపతి గారికి చాలామంది తెలుసట. ఎంతైనా అప్పు ఇప్పించగలరని వాళ్ళావిడ చెప్పింది" కనకం అంది మెల్లగా.

అందరి ముఖాలూ వికసించాయి. తెలీని రిలీఫ్ చోటుచేసుకుంది అందర్లోనూ.

"చలపతిగారూ" అంటూ పిలుస్తూ వెళ్ళాడు వెంకన్న.

అతడ్ని చూసి ప్రమీల ముఖం చాటేసింది.

"రావయ్యా వెంకన్నా. మహానగరం ఎలా ఉంది? మాయా నగరంలా ఉందా? " నవ్వేడు చలపతి.

తనూ శృతి కలిపేడు.

"మీరుజ్జోగాల మీదెళ్ళిపోతారు. మీ అమ్మాయి ఒక్కతీ ఇంట్లో ఉండాల్సొస్తోంది పాపం. పెళ్లి చేసెయ్యకూడదూ? "

"మంచి సంబంధం కోసం చూస్తున్నాం. నీ ఎరికలో ఏమైనా ఉంటే చెప్పు"

తలాడించాడు. గోపీ గురించి చెప్పి "మీకు తెలిసినవారి దగ్గర ఒక నలభై వేలు అప్పుగా ఇప్పిస్తే.. బ్యాంకు అప్పుకోసం ప్రయత్నిస్తున్నాళ్ళే. రాగానే తీర్చేస్తాడు"

గోపీని భార్యాభర్తలిద్దరూ గమనిస్తూనే

ఉన్నారు. కుర్రాడు బుద్ధిమంతుల్లా ఉన్నాడనీ, ప్రమీలకి ఈడూ జోడూ అని కూడా అనుకున్నాడు. అతడు సంపాదనాపరుడయ్యాక సంబంధం విషయం కదపొచ్చని నిరీక్షిస్తున్నారు.

ఇప్పుడీ విషయంలో వారికి సాయపడితే రేపు తమ కార్యం సానుకూలమవుతుందనుకున్నాడు.

"కొత్తవాళ్ళకెవరూ అప్పివ్వరు. అయినా తెలిసిన శేర్ దగ్గర ఇప్పిస్తాన్లే"

ఆటో మీద శేర్ ఇంటికెళ్ళారు.

"శేర్ మంచివాడేకాని నెలనెలా వడ్డీ చెల్లించకపోతే అగ్గిరాముడైపోతాడు. అసలు చెల్లించకపోయినా ఫర్లేదుకాని.. వడ్డీ మాత్రం కచ్చితంగా చెల్లించాలి" దారిలో చెప్పేడు చలపతి.

శేర్ పేరేమిటో ఎవరికీ తెలీదు. అందరికీ అతడు శేర్. బంగారం మీద, వెండిమీద, ఇత్తడి మీద, స్థలాల మీద, ఉజ్జోగాల మీద, వ్యాపారాల మీద అప్పు ఇస్తాడు. మనుషుల మీద మాత్రమివ్వడు. కాని మనుషుల ముక్కుపిండి మరీ వడ్డీ అణాపైసల్తో సహా అప్పు వసూలు చేస్తాడు. దానికి తగిన యంత్రాంగమూ ఉందతడికి.

చలువరాయి పరిచిన శేర్ ఇంట్లోకి అడుగు పెడుతుంటే పులి బోనులో ప్రవేశిస్తున్నట్టుగా అన్పించింది వెంకన్నకి.

శేర్‌ది భారీ శరీరం. తెల్లని పరుపుమీద బస్కీ పెట్టుక్కూర్చున్నాడు.

"చాలా దినాల తర్వాత కన్పించావే" అన్నాడు శేర్ చలపతిని చూస్తూ.

"ఇతను వెంకన్న అని మా పక్క పోర్షన్లో ఉంటున్నాడు. ఇతను వీరబ్బాయి. మా కాలనీ సెంటర్లో కిరాణ స్టోర్సు కొందామని చూస్తున్నారు. ముప్పై వేలుంది. ఇంకో నలభైవేలు కావాలి. మీరెలాగైనా ఇవ్వాలి. వడ్డీ నెల నెలా ఇచ్చేస్తారు..." అన్నాడు చలపతి.

"ఐదు రూపాయల వడ్డీ" అన్నాడు శేర్.

"నాకు బాగా కావాల్సిన వాళ్ళు శేర్. లేకపోతే నేను తీసుకురానే తీసుకురాను. కష్టపడి పనిచేసేవాళ్ళు, మంచివాళ్ళు. నెల నెలా వడ్డీ చెల్లించేస్తారు. వడ్డీ తగ్గించు శేర్. కొత్తషాపు, ఎక్కువగా మిగల్దు" ప్రాధేయపడ్డాడు చలపతి.

"బతికి చెడ్డవాళ్ళం. కనికరించండి" అన్నాడు వెంకన్న.

కాస్సేపు బతిమాలించుకుని నాలుగు రూపాయల వడ్డీకి అంగీకరించాడు.

రాతకోతలూ డబ్బివ్వడమూ పూర్తయ్యాయి.

ప్రోనోటు మీద వెంకన్న, గోపీ ఇద్దరూ సంతకాలు పెట్టేరు. సంతకం పెడుతోంటే వెంకన్న చేయి వణికింది!

ఆ మర్నాడు షరీఫ్, చలపతి మధ్యవర్తులుగా బలరాముడితో బేరం కుదుర్చుకున్నారు.

పురోహితుడి చేత పూజ చేయించి వ్యాపారం ప్రారంభించాడు గోపి.

"చేసే పనిమీద భక్తీ శ్రద్ధా వుంటే తిరుగుండదురా. మా ఆశలన్నీ నీమీదే. నీవల్లే మనిల్లు తేలాటంలోకి రావాలి" అంది సూరమ్మ.

"ఇది ప్రారంభం. ఇక వెనుదిరిగి చూడాల్సిన అవసరం రాదుగాక రాదు" అనుకున్నాడు వెంకన్న సంబరంగా.

★ ★ ★

యూనియన్ ఎన్నో డిమాండుల్ని యజమాన్యానికి సమర్పించింది.

యాజమాన్యం 'కంపెనీ ఆర్థిక పరిస్థితి బావుండకపోవడంతో వారి కోరికల్ని ఆమోదించలేమనీ' పేర్కొంది. కంపెనీ ప్రస్తుత స్థితికి యాజమాన్య పద్ధతులే కారణమనీ సమర్థతని ప్రోత్సహించడం లేదనీ దుబారా దుర్వినియోగం అధికంగా వుందనీ ప్రత్యారోపణ చేసింది యూనియన్.

వాడిగా వేడిగా వాదోపవాదాలూ నిరస

నలూ బెదిరింపులు జరిగాయి. సమ్మె తప్ప దన్న భావం సర్వత్రా వ్యాపించింది. అది గ్రహించి యాజమాన్యం దిగివచ్చింది. కొన్ని డిమాండ్లని ఆమోదించింది. ఆమో దించిన వాటిల్లో క్యాజువల్ వర్కర్లని పర్మ నెంటు కేడర్‌గా తీసుకోవడం ఒకటి.

వెంకన్నా తదితర కార్మికులంతా ఆనం దోత్సాహాలతో చిందులు తొక్కారు.

స్వీట్స్ పాకెట్‌తో ఇంటికెళ్ళాడు వెంకన్న.

"నేనిప్పుడు కార్మికుడ్ని. పర్మనెంటు ఉద్యోగిని. జీతభత్యాలొచ్చే ఉద్యోగిని. లీవు సౌకర్యం ఉంది. మెడికల్ బెనిఫిట్ ఉంది. బోనస్ కూడా ఇస్తారు" అన్నాడు అత్యుత్సాహంగా.

సూరమ్మ, కనకం, గోపి, మల్లిక, శీను- అంతా పొంగిపోయారు.

ఇన్నాళ్ళకి మంచి రోజులు వచ్చినందుకు ఆనందపు తేరుమీద తేలియాడారు. చల పతి, అతడి భార్యా వచ్చి అభినందించారు.

"ఈ భాగ్యమంతా మనూరి చల్లాలమ్మ చల్లగా చూట్టంవల్లే వచ్చిందిరా అబ్బాయ్. వచ్చే ఏడాది తీర్థానికెళ్ళి కోడిని కోసి నైవేద్యం పెడతానని దణ్ణం పెట్టుకో" అంది సూరమ్మ.

"ఇదంతా షిర్డీ సాయినాథుని మహిమ. మీ ఉద్యోగం ఖరారైతే గురువారాలు ఒంటిపూట ఉపవాసముంటానని మొక్కు కున్నాను" బాబా ఫొటోకి దణ్ణం పెడుతూ అంది కనకం.

రెక్కలుంటే వెంటనే ఎగిరి తమ ఊరు వెళ్ళి ఊరంతా టాంటాం వెయ్యాలన్నంత ఉత్సాహంగా ఉందామెకి.

"ఇన్నాళ్ళకి మనకి మంచి రోజులొ చ్చాయి. ఇదంతా పిల్లల అదృష్టం" అన్నాడు వెంకన్న, శీను, మల్లికలను చూస్తూ. ఆ వెంటనే కొడుకుతల నిమురుతూ "ఇక నీకు అడ్డువుండదురా. నువ్వెంతదాకా



చదివితే అందాకా చదివిస్తాను" అన్నాడు.

శీను పొంగిపోయాడు.

"ఇంజనీర్నవుతాను నాన్నా"

"మా నాయనే! మా బాబే!" మెటికలు విరిచి మురిసిపోయింది కనకం.

"నువ్వు తాశీల్దారువైతే చూడాలని బతికున్నా్నా శీనూ. మన వంశంలో సర్కారు కొలువు చేసినోళ్ళు లేర్రా. తాశీల్దారు భోగమే భోగం అనుకో. నువ్వు తాశీల్దారువి అవ్వాల్రా..." శీనుని తన పక్కన కూర్చోబెట్టుకుంటూ అంది ముసలావిడ.

"హుఁ తాశిల్దార్లెప్పుడో పోయారు. ఉన్నవాళ్ళు ఇంజనీర్ల ముందు దిగదుడుపే!" మూతి ముడిచింది కనకం.

"ఓసి పిచ్చిదానా. తాశిల్దార్లూ కలక్టర్లూ ఎక్కడికీ పోరే. భూమి ఉన్నంతకాలం ఉంటారు. భూమి గొడవలున్నంతకాలం మా రాజులాగేనే ఉంటారు. వాళ్ళొస్తావుంటే కరణం, మునసబులే కాదు.. వందె కరాలున్న ఆసామైనా వంగి వంగి దండాలెట్టాల్సిందే. వాళ్ళ మాటకీ, కలం పోటుకీ తిరుగుండదే. సర్కారు ఉన్నదీ తాశిల్దార్ల చేతుల్లో. ఏంటనుకున్నావో"

ఏదో అనబోయి ఆగిపోయింది కనకం.

"చేసిన మేలెప్పుడూ మర్చిపోకూడదురా వెంకన్నా. ఆ సాయిబు చేసిన మేలు చర్మం ఒలిచి చెప్పులు కుట్టిచ్చినా తీరదు. మిఠాయి పట్టుకెళ్ళివ్వరా."

"కొన్నానమ్మా" ఇంకో పాకెట్టు చూపిస్తూ అన్నాడు వెంకన్న.

"మంచి పని చేశావ్రేయ్. ఆ జనార్దనంగాడు కోడిని దాచిపెడితే తెల్లారటం ఆగిపోద్దనుకున్నాడు వెధవ. వాడు గాకపోతే సాయం చెయ్యడానికి బోల్డుమందున్నారు లోకంలో. వెళ్ళరా వెళ్ళి ఆ సాయిబుకి ఇచ్చిరా"

షరీఫ్ నోటికి మిఠాయి అందించాడు.

"ముబారక్ భాయ్" అన్నాడు కౌగలిం



చుకుని.

"ఇదంతా నీ భిక్ష భాయీ సాబ్"

"అంతా అల్లా దయ!"

"ఈసారి నమాజు చేసేప్పుడు నా తరపున అల్లాకి ధన్యవాదాలు చెప్పు షరీఫ్"

"తప్పకుండా భాయ్" అన్నాడు. అంతటితో వూరుకోలేదు. భార్యకి మిత్రుడి గురించి గొప్పగా చెప్పేడు. వారిద్దరి అన్యోన్యతని చూసి మురిసిపోయింది బేగం.



గోపి వ్యాపారం పుంజుకుంటోంది.

ఇదివరక్కన్నా సరుకు పెంచాడు. రకాలు పెంచాడు. కొంచెంగా అరువు కూడా ఇస్తున్నాడు.

ఎక్కువ డిమాండు ఉన్న ప్రతి సరుకునీ అంతో ఇంతో తెచ్చి షాపులో పెడుతున్నాడు. మిల్క్ ఏజెన్సీ తీసుకున్నాడు. రోజూ చీకటితోనే సైకిలు మీద ఇంటింటికీ వెళ్ళి పాలపాకెట్లు వేస్తున్నాడు. యస్టీడీ బూత్ పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు.

క్షణం ఖాళీగా ఉండట్లేదు గోపి. ఎప్పుడూ వ్యాపారపు రంధే. మధ్య మధ్య బ్యాంకు లోను కోసం ఇండస్ట్రీస్ ఆఫీసోద్యోగిని కలుస్తూనే ఉన్నాడు.

గోపి బయటి కెళ్ళినప్పుడు కనకం, మల్లిక షాపులో కూర్చుంటున్నారు. చెల్లికన్నీ నేర్పాడు గోపి.

ఆమె ఒక్కతే వుంటే ప్రమీల వచ్చి కూర్చుంటుంది. ఆమెవస్తే సిద్ధూ అతడి ఫ్రెండ్సూ వస్తారు. ఒకసారి వాళ్ళు గోపీ కళ్ళలో పడ్డారు.

"ఇలాంటి పోకిరీ వాళ్ళకి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. వాళ్ళు చాలా డేంజరస్ మనుషులు, జాగ్రత్త!"

★ ★ ★

రోజులు సాఫీగా సాగిపోతున్నాయి.

వెంకన్న కుటుంబం కడుపునిండా తింటోంది. కంటి నిండా నిద్రపోతోంది.

ఎప్పుడూ ఇలాగే ఉంటే బావుండ్నని మనసారా ఆశిస్తున్నారంతా.

ఏటి నడకా జీవితపు పోకడా ఒక్క తీరుగా సాగవని వారికి తెలీకపోలేదు. అయినా ఆశ!

"ఇల్లు ఇరుగ్గా ఉంటోంది! కొంచెం పెద్ద ఇంట్లోకి మారదాం" అంది కనకం.

"అప్పు తీరేవరకూ అదనపు ఖర్చులేం పెట్టొద్దు. ఇలాగే ఇబ్బంది పడదాం. ముందు అప్పు తీరాలి" అన్నాడు గోపి.

"మా నాయనే, మా తండ్రే, అమృతం లాంటి మాట చెప్పేవురా. మీ తాత కూడా ఇలాగే అనేవాడ్రా. మహానుభావుడు చచ్చి ఏ లోకాన ఉన్నాడో!" అంది ముసలావిడ.

"బ్యాంకు అప్పు సంగతేమైందిరా" వెంకన్న అడిగాడు.

"రోజ్‌గార్ యోజనలో నన్ను సెలక్టు చేశారు. ఇక్కడుంటున్నట్టు ఎమ్మార్వో సర్టిఫికెట్ కూడా ఇచ్చాను. షాపు కాగితాలు చూపించాను. అయినా అదిలేదు, ఇది లేదు, వాళ్ళు లేరు, వీళ్ళులేరు, అప్పుడురా, ఇప్పుడురా అని తిప్పించుకుంటున్నారు లంచాల కోసం!" ఉక్రోషపడ్డాడు గోపి.

"ఓపిక పట్టాలిరా. అవసరం మనది. అవకాశం వాళ్ళది"

"అందుకనే దేశం ఇలాగుంది. లంచ గొండులందర్నీ వరుసగా నిలబెట్టి కాల్చేస్తేనే దేశానికి పీడ విరగడయ్యేది!"

గోపీలో కొత్త వ్యక్తి కన్పిస్తోంటే విస్మయంగా చూశాడు వెంకన్న.

"మీదంతా ఉడుకు రక్తం. అలాగే అన్పిస్తుంది గాని కలుపు మొక్కల్ని ఎన్నిసార్లు ఏరేసినా మళ్ళీ ఈ వ్యవస్థలో పుట్టుకొస్తూనే ఉంటాయిరా. వీళ్ళుపోతే ఇంకొకళ్ళు వస్తారు. నువ్వనవసరంగా ఆవేశపడకొరేయ్. అనుభవం మీద చెబుతున్నాను. పేదవాని కోపం పెదవికి చేటు"

"ఒరే అబ్బాయ్. పిల్ల పెళ్ళి చెయ్యరా. నేనింక అట్టేకాలం బతకన్రా. మీ నాన్న రోజూ కలలోకొస్తున్నారు..." అంది ముసలావిడ.

"అవేం మాటలత్తయ్యా. మీరే మాకు పెద్ద దిక్కు. ముని మనవల్ని ఎత్తుకోరూ? " అంది కనకం.

"నాకూ ఎత్తుకోవాలనే ఉందే కనకం. ఆ భగవంతుడు పడనిచ్చేట్టులేడు. చూస్తున్నావుగా రోజు విడిచి రోజు మంచమెక్కేస్తున్నాను. మాయదారి చలిజ్వరం నన్ను వదల్టమే లేదు"

"డాక్టర్ గారికి చూపిస్తానంటే వినవు" వెంకన్న అందుకున్నాడు.

"డాక్టర్లకి డబ్బు పోయగలం గాని వాళ్ళు ఆయువు పొయ్యగలరేంట్రా. పండిన ఆకు ఇవాళ గాకపోతే రేపు రాలిపోవాల్సిందేరా అబ్బాయ్. మల్లిక నెత్తిమీద నాలుగక్షింతలు వేసేస్తే ఇంక నాకే బెంగా వుండదు. నిశ్చింతగా పోతాను"

తల్లి మాటలకి గుండెల్లో దేవినట్లన్పించింది వెంకన్నకి. ఆమె కోరిక తీర్చగలిగే శక్తి ఉంటే బావుండ్ననుకున్నాడు.

"గోపీకి కూడా పెళ్లి కుదిరితే ఆ డబ్బుతో దీనికి అక్షింతలు వేసెయ్యచ్చు. కుండమార్పిడి సంబంధం దొరికినా మంచిదే" తిరిగి తనే అంది సూరమ్మ.

★ ★ ★

"మనూళ్ళో ముగ్గులేని ఇల్లు ఉండదు. ఇక్కడ టీవీ లేని ఇల్లు లేదు" కంపెనీ నుంచొచ్చిన వెంకన్నకి మంచినీళ్ళ గ్లాసం దిస్తూ అంది కనకం.

"టీవీ కొను నాన్నా. మనకి టీవీ లేదని

## కొత్తగాలి...

కడుపులో
ఎలుకలు
పొయ్యిలో
పిల్లులు
భిన్నత్వంలో ఏకత్వం

— జి.విజయశ్రీ, శ్రీకాకుళం

ప్రమీల కూడా గేలి చేస్తోంది. ఫ్రెండ్స్‌కి చెప్పి నవ్వుతోంది" మల్లిక అంది.

"నవ్వనీవే.. నవ్వినా నాపచేనే పండుతుంది. ఎవరో ఏదో అన్నారనో, అనుకుంటారనో మనం ఇదవ్వకూడదు తల్లీ. చాప ఉన్నంతవరకే కాళ్లు చాపుకోవాలి" అన్నాడు వెంకన్న.

"చేతకాని వాళ్లూ, చేవలేని వాళ్ళూ చెప్పే మాటలవి!" నిరసనగా అంది కనకం.

"కనకం!"

ఎప్పుడూ లేనిది వెంకన్న గద్దించేసరికి తల్లీ కూతుళ్ళు అదిరిపడ్డారు.

నిద్రపోతున్నదల్లా లేచి కూర్చుంది సూరమ్మ.

"సిటీకొస్తే మాత్రం సిటీ పద్ధతులెలా వస్తాయి! మట్టి పిసుక్కునే వాళ్ళకి టీవీ విలువేం తెలుస్తుంది!" చేతులు తిప్పుతూ పెరట్లోకి వెళ్ళిపోయింది కనకం.

మర్నాడు మరో అస్త్రం ప్రయోగించిందామె. "ఒకేసారి డబ్బెట్టి కొనాలంటే కష్టం గాని వాయిదాల పద్ధతిలో కొంటే ఇబ్బందేం ఉంటుంది? రేపు మనబ్బాయికి సంబంధాలొచ్చాయనుకోండి. ఇంట్లో టీవీ అయినా లేకపోతే మన గురించెంతో హీనంగా అనుకోరూ? ఇంట్లో పెళ్లి కెదిగిన పిల్లలున్నప్పుడు ఇంకేమున్నా లేకున్నా ఇల్లు నిండుగా ఉంటే మన పరిస్థితి బావుందనుకుంటారు.."

ఆలోచనలో పడ్డాడు వెంకన్న. భార్య

చెప్పింది నిజమే అన్పించింది.

నాలుగువేల ఖర్చు అని చెప్పి బజారుకి తీసుకెళ్లి పదివేల కలర్ టీవీ కొనిపించింది కనకం!

★ ★ ★

"గోపీకి పెళ్లి చెయ్యమని ముసలావిడ రోజూ పోరుతోంది" చలపతితో చెప్పింద తడి భార్య.

"కట్నం ఏమాత్రం ఆశిస్తున్నారేవిటి"

"నలభైవేల కన్నా ఎక్కువెవరు ఇస్తారు?! రెక్కలే కదా ఆధారం!"

"అంతలో వస్తే ఫర్లేదు మరి. పరదేశి ఫైనాన్స్ కంపెనీలో నెలనెలా మనం దాస్తోన్నది అరవైవేలదాకా అవుతుంది"

"రేపెళ్లి కనుక్కోండి. ఎప్పుడు అవసర మైతే అప్పుడు ఇస్తారో లేదో అడిగి తెలుసుకోండి. దాన్ని బట్టి వీళ్ళతో మాట్లాడి ముహూర్తం పెట్టుకుందాం. ప్రమీల మీద కనకానికీ మక్కువుంది. ఇలాంటి పిల్ల కోడలిగా వస్తే బాగా కలిసిపోతుందని ఓసారి మాటల్లో అంది"

"రేపే ఆ కంపెనీకెళ్లి కనుక్కొస్తాను"

గదిలో తల్లీ తండ్రీ మధ్య జరిగిన సంభాషణంతా ప్రమీల చెవిలో పడింది.

దుఃఖం పొంగి వచ్చింది.

తన మనస్సేమిటో తెలుసుకోలేదు. గోపీ అంటే తనకిష్టమో కాదో అడగలేదు. అంతా వాళ్ళిష్టమైనట్టు తానేదో బొమ్మ అయినట్టు తనకి పెళ్లి చేసేస్తార్ట! హుఁ.. అందుకే ఈ పెద్ద వాళ్లంతా విలన్స్ అని సినిమాల్లో చూపిస్తున్నారు. సిద్ధు అదే యాదగిరితో అన్ని సంగతులూ మాట్లాడి గుళ్ళో పెళ్ళి చేసుకునొచ్చి అమ్మానాన్నలకి షాక్ ఇవ్వాలని గట్టిగా అనుకుంది.

★ ★ ★

సూరమ్మ మంచం పట్టింది.

అసలే అంతంత మాత్రంగా ఉన్న ఆమె ఆరోగ్యం ఒక్కసారిగా దిగజారిపోయింది. ఎక్కువసేపు మగతగా పడుకునే ఉంటోంది. మెలుకువ వస్తే మనవరాలి పెళ్లి అని గొణుగుతోంది. లేదా వ్యవసాయప్పనులు పురమాయిస్తోంది. ఓసారి "నా బూడిదని గోదాల్లోనే కలపరా అబ్బాయ్" అని అరచి మరీ చెప్పింది.

ఎలావోలా కూతురికి పెళ్లిచేస్తే బావుణ్ణని తాపత్రయపడ్డాడు. అందరికీ చెప్పేడు. కానేదీ కలిసిరాలేదు.

"నీ ఆఖరి కోరిక తీర్చలేని అసమర్థుడ్నమ్మా. క్షమించమ్మా" అంటూ తల్లి కాళ్ళ దగ్గర కూర్చుని కుళ్లిపోతున్నాడు. షరీఫ్, చలపతి, ఇతర మిత్రులూ, పరిచయస్తులూ అంతా వచ్చి చూసి వెళ్లారు. వెంకన్నకి ధైర్యం చెప్పేరు. సూరమ్మ కదిలింది. ఆశగా ఆర్తిగా పిలిచాడు.

శరీరంలోని శక్తినంతా కూడదీసుకుంది. ఏదో బలమైన కోరిక ఒత్తిడి చేస్తోంది. అతి కష్టంమీద కళ్ళు తెరిచి సైగ చేసింది.

"ఈ సంచిని చూపిస్తోంది" సంచి తెచ్చిస్తూ అంది మల్లిక.

సంచిలోని సరుకుల్ని బయటికి తీసి ఒక్కొక్కటీ తల్లికి చూపించసాగాడు.

చిన్న బొట్టు పెట్టె, చెక్కబొమ్మ, గంధపు చెక్కముక్క, దూది, దారాలు వగైరాలతో బాటు చిన్న మూట ఉంది. ఆ మూట కంటబడేసరికామె కళ్ళు మెరిశాయి.

"అపూర్వ నిధిలా దాచిందే" అనుకుంటూ విప్పాడు.

మట్టి!

తల్లి కళ్ళల్లోకి చూశాడు.

పరమానందం చిందులేసింది. కన్నీళ్ళు జలజల రాలిపోయాయి.

అవి కన్నీళ్ళు కాదు ఆనందబాష్పాలు, అది మట్టికాదు, పుట్టి పెరిగిన గడ్డ తాలుకు గుప్పెడు ఖండం!

తను ఏ మట్టిలో పుట్టిందో.. ఆ మట్టిలో కలవాలన్న తపనతో.. ఆ మట్టిపై గల మమతానుబంధంతో తన తోబాటు తెచ్చుకుంది సూరమ్మ.

ఆ మట్టిని.. కాదు భూదేవిని చూసేస రికి అతడి కళ్ళల్లోని కన్నీటి కుండలు భళ్ళున బద్దలయ్యాయి.

మట్టిని గాఢంగా ఆఘ్రాణించాడు.

అందులోంచి తనలోకి ప్రాణశక్తి ఏదో వచ్చినట్టుగా అనుభూతి పొందాడు.

తను పుట్టింది.. చిట్టి పొట్టి అడుగులే సింది.. దున్నింది.. బతుకుబాట చేసుకు న్నది ఇదిగో.. ఈ మట్టినే. ఈ మట్టిలోనే తన చెమట ధారలు కలిసింది. ఈ మట్టి లోంచే ధాన్యరాశుల్ని పండించింది.

తను రైతుబిడ్డ. తనమీద కోట్లాదిమంది ఆధారపడ్డారు. అసలీ ప్రపంచానికి అన్నం పెడుతున్నది రైతే.

భావోద్వేగంతో గుండెలు ఎగసెగసి పడుతోంటే చేతిలోని మట్టిని ముద్దు పెట్టు కున్నాడు. పిమ్మట తల్లి ముఖానికి దగ్గరకి తీసుకెళ్ళి చూపించాడు.

కళ్ళతో తృప్తిగా చూసింది. మట్టి వాసన గుండెల్నిండా పీల్చుకుంది.

ఇది చాలు, ఈ జన్మకీ భాగ్యం చాల న్నట్టు కళ్ళు మూసుకుంది.

ఎంత పిలిచినా మరి తెరవలేదు. స్పృహ తప్పింది మళ్ళీ.

"ఊరొదిలి వచ్చినా ఆవిడకింకా ఆ నేలంటే అభిమానం పోలేదు. పిచ్చిది గాక పోతే అక్కడేం ఉందనీ బావుకోడానికీ!" భార్య వ్యాఖ్యానం భరించలేక, "నోర్ముయ్" అంటూ అరిచాడు వెంకన్న.

"ఇప్పుడు నేను కానిమాటేవన్నాననీ! మణులూ మాణిక్యాలూ మూటకట్టి జాగ్ర త్తగా దాచినట్టు ఆ మట్టిని దాచింద న్నాను. అది తప్పా?"

"నీకు అర్థంకాదే. ఆ బాధ, ఆ బంధం నీ కర్థంకావు..." దుఃఖోద్వేగాన్ని దిగమిం గుకోజూస్తూ అన్నాడు.

"అబ్బో!" మూతి, చేతులూ తిప్పుతూ వెళ్ళిపోయిందక్కడ్నుంచి.

మట్టిని తల్లి చీరకొంగున ముడివేసి తల పక్కగా ఉంచాడు.

## భగవద్గీతలు కొత్త భక్ష్యాలేమో!

భోగపరాయణులైన స్వాములను పంతులు గారు ఆటపట్టించేవారు. వారి గురించి ఆయన చెప్పిన ఓ చతురోక్తి-

ఒక స్వాములవారు భిక్షకు వెళ్లారు! ఆయ నగారికి భిక్షపేరుతో పంచభక్ష్య పరమాన్న భుక్తియే ముక్తి వి



చారమన్న సత్యం తెలియని ఓ ఇల్లాలు భిక్షానంత రము వేదాంత పారాయణం చేసు కుంటారేమోనని, 'స్వామీ భగవద్గీ తలు తెత్తునా?' అని అడిగెనట! భక్ష్య భక్షణ చింత తప్ప వేరేమీ లేని ఆయన కాస్సేపాలోచించి అవేవో అపూర్వభక్ష్యాలని భావించి కడుపు నిము రుకొంటూ, 'అమ్మా! కడుపు నిండుగానున్నది. ఇప్పుడు పుచ్చుకోలేను. కొంచెంసేపు ఆగితేస్తే భక్షించెదను' అన్నాడట!

ఆ మట్టినుంచేదో కరెంటులాంటి శక్తి ఆమె శరీరంలోకి ప్రాకిందేమో.. బాధతో కమిలిన ఆమె ముఖం తేటబడింది. ప్రశాంతత లభించినట్టు మారిపోయింది!

అప్పుడే అద్దెకోసం ఓనరు వచ్చాడు.

అదో రకమైన వాసన గుప్పుమని అత డికి తగిలింది. కడుపులో తిప్పింది. పరి స్థితి అర్థమైంది. ఇల్లు ఖాళీచేయమన్నాడు.

"ఇప్పుడో ఇంకాస్సేపట్లోనో ఆవిడ గుటు క్కుమంటుంది. ఇల్లు మైలపడిపోతుంది"

"చదువుకున్నవారు. అవేం మాటలండీ. అంతా చచ్చేవాళ్ళమేకదా.. కాదంటే వెనకా ముందవుతుందంతే"

"మీకలాగే ఉంటుంది. ఆవిడ ఏ దెయ్యమో అయి ఇంటికప్పు పట్టుకుని వేలాడితే మళ్ళీ ఎవరూ అద్దెకి రారు. నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు.. నేనేం

## కొత్తగాలి...

**బ్రతుకు క్షణమైనా**
**ప్రవహిస్తూ**
**గర్వపడే**
**ఇంద్రధనుసు**
**నీటిబుడగ**

**– ఆచార్య కొలకలూరి ఇనాక్, హైదరాబాద్**

వినను. ఇల్లు ఖాళీచేసి తీరాల్సిందే"

వెంకన్న చేతులు పట్టుకున్నాడు.

"పోనీ బయట గూడు వేయిస్తాను. అందులోకి మార్చెయ్" అన్నాడు ఓనరు.

పీక కోసిన కోడిపెట్టలా గిలగిల్లాడాడు వెంకన్న.

గూడు సిద్ధమవుతోంటే వచ్చాడు గోపి. ఆగ్రహంతో రెచ్చిపోయాడు.

"మేం ఊరికే ఉండటంలేదు. అద్దె ఇస్తున్నాం. మా నాన్నమ్మని ప్రాణముండగా బయటపెట్టేది లేదు. ఏం చేసుకుంటావో చేసుకో, ఫో"

"మంచివాళ్ళని అద్దెకిస్తే నామీదే ఒంటికాలి మీద లేస్తారా. ఇదేమైనా బావుందా? " చిందులు తొక్కాడు ఇంటాయన.

ఇద్దర్నీ శాంతపరిచేసరికి వెంకన్నకీ, చలపతికీ తలప్రాణం తోకకొచ్చింది.

వెంకన్నా కనకం చెరోపక్కన పట్టుకుని లేవదీశారామెని.

గుమ్మం దాటిస్తోంటే క్షణకాలం కనులు విప్పి చూసింది. మరుక్షణం కనులు మూతపడ్డాయి.

వెంకన్న గుండెలు ద్రవించాయి. ఆమె చూపులతడ్ని చీల్చి చెండాడాయి!

పల్లెలోని ఇల్లు అమ్ముతున్నప్పుడు ఆమె అన్నమాటలు గొర్తొచ్చాయి.

"బతకడానికి గాకపోయినా చావడానికైనా ఇల్లు కావాలిరా. పరాయి ఇంట్లో ఛస్తానంటే ఎవరూ ఊరుకోరు. కాలికి తాడు కట్టి బయటికీడ్చేస్తారు!"

బయటవేసిన గూడులో తల్లిని పడుకోబెట్టి బావురుమని ఏడ్చేశాడు వెంకన్న.

ఎందరు ఓదార్చినా ఆ దుఃఖపు వెల్లువ ఆగలేదు!

తెల్లగా తెల్లవారింది. సూరమ్మ బతుకూ తెల్లవారిపోయింది. ఆమె ప్రాణాలు పంచభూతాల్లో కలిసిపోయాయి!

జనార్దనానికి ఫోన్‌చేశాడు గోపి. అంతకు మించి సిటీలో బంధువులెవరూ లేరు.

ఆ బంధువూ రాలేదు. కాని మిత్రులే ఆపద్బంధువులై నిలిచారు.

షరీఫ్‌తో సహా తలో చెయ్యా వేశారు. తలో పనీ చేశారు.

వ్యాన్‌లో శవాన్ని ఎలక్ట్రికల్ క్రిమెటోరియమ్‌కి తీసుకెళ్ళారు.

ఎన్నో తరతరాలుగా కొలిచిన భూమాత గుప్పెడు రూపాయలుగా మారిపోయింది! అలాగే ఇవాళ- కని పెంచి పెద్ద చేసిన మాతృమూర్తి పిడికెడు బూడిదైపోయింది!

గుండెలు పగిలేలా వెక్కివెక్కి ఏడ్వసాగాడు వెంకన్న!




శేఠ్ ముందు దోషిలా నిలబడ్డాడు గోపి.

"మిత్తి కట్టలేదేంరా బేవకూఫ్. ఒళ్ళు కొవ్వెక్కిందా? " చింతనిప్పులు కక్కేడు శేఠ్.

"క్షమించు శేఠ్. మా నానమ్మ చచ్చిపోయింది. ఆ ఖర్చుల వల్ల..."

"బహుత్ లోగ్ రోజ్ మర్తే హై! ఎవరో

ఛస్తే నాకేంరా.. నా వడ్డీ నాకు కక్కాల్సిందే. ఎప్పుడు కడతావ్? "

"వారం రోజుల్లో..."

"ఫో, మాట తప్పితే మనిషిని కాను..." ఒళ్ళంతా కొత్త కత్తితో చీరి కారం పూసినట్టుగా వుంది గోపికి!

నానమ్మ దిన ఖర్చులకి చాలానే ఖర్చయింది. చితాభస్మాన్ని గోదావరిలో కలిపి రావడానికి వెంకన్న రాజమండ్రి వెళ్ళివచ్చాడు. అందుకు షాపు ఆదాయాన్ని ఉపయోగించక తప్పలేదు.

ఒక్కనెల వడ్డీ చెల్లించలేదని చెప్పి నిప్పులు తొక్కుతున్నాడు శేఠ్.

అసలా బ్యాంకు వాళ్ళు అప్పిచ్చి వుంటే అసలూ వడ్డీ కూడా వీడి మొఖాన కొట్టేవాడు. ఆఖరికి యాభైవేలు ఇచ్చినా చాలన్నాడు. శేఠ్‌కి వడ్డీకింద కట్టే సొమ్ముని మీకు కడితే అప్పే తీరిపోతుందన్నాడు. తిప్పుకుని తిప్పుకుని మొండిచెయ్యి చూపెట్టేరు వాళ్ళు!

శేఠ్ నిలదీసిన సంగతి తండ్రికి తెలిస్తే భరించలేడని చెప్పకూడదనుకున్నాడు.

★ ★ ★

యాదగిరి కోసం పిచ్చిపట్టిందాన్లా వెదుకుతోంది ప్రమీల.

గతంలో అతడెక్కడెక్కడ కన్పించాడో ఎక్కడెక్కడ కలుసుకున్నారో అన్నిచోట్లా గాలిస్తోంది.

పెళ్లి చేసుకుందామని చెప్పిన మరుక్షణం అతడు కనిపించడం మానేశాడు.

సినిమా హాలు బయట యాదగిరి పూలు కొంటూ కనిపించాడు. ఆమెని చూసి ఖంగుతిన్నాడు.

కొత్తపెళ్లి కొడుకులా వున్న అతడ్ని చూసి ఆమె షాక్ తిన్నది.

"నువ్వు పెళ్లి చేసుకున్నావా? " సూటిగా ప్రశ్నించింది.

"నువ్వూ చేసుకో. నాకేం అభ్యంతరం లేదు" నవ్వేడు.

"మన ప్రేమ, మన బాసలూ అన్నీ ఒట్టివేనా? " కన్నీళ్ళు చిందుతోంటే అడిగింది.

"అవి గట్టివే. ప్రేమప్రేమే, పెళ్లిపెళ్లే. ప్రేమని పెళ్లి విడదీయలేదు. ఎప్పట్లా కలుసుకోవచ్చు హేపీగా వుండొచ్చు"

"నువ్వింత దుర్మార్గుడవనుకోలేదు. నిన్ను చంపేస్తాను" అంటూ అతడి చొక్కా పట్టుకుని గుంజేసింది. ఆడపులిలా రెచ్చిపోయింది.

అతడు తొలుత నిర్ఘాంతపోయాడు. ఆ వెంటనే తేరుకుని బండబూతులు తిడుతూ ఆమె చెయ్యి పట్టుకుని మెలితిప్పాడు.

బాధతో కెవ్వుమని అరిచింది.

అంతా ప్రేక్షకులై పోయారు తప్ప ఎవరూ అడ్డువెళ్ళలేదు.

ఆ దృశ్యం గోపీ కళ్ళల్లో పడింది. ఒక్క ఉదుటున వెళ్ళి యాదగిరిని తన్నాడు. అతడెళ్ళి అల్లంతదూరాన పడ్డాడు.

అతడి నోట్లోంచి రక్తం వచ్చింది. తిడుతూ పారిపోయాడు.

ఆటోని పిలిచి ప్రమీలని ఎక్కమన్నాడు. ఆమె ఎక్కేక తనూ ఎక్కేడు.

"ఇలాటి బద్మాష్‌ల జోలికి పోతే నష్టపోయేది మనమే. జరిగిందంతా మర్చిపో. వాడు మళ్ళీ నీ జోలికి రాడులే. ఏమీ జరగలేదనుకో. మీ వాళ్ళు మంచి సంబంధం చూసి పెళ్లి చేస్తారు. గుట్టు చప్పుడు కాకుండా కాపురం చేసుకో..."

అతడి హితబోధకి కరిగి కన్నీరయింది. కలంతా మంచు స్వప్నంలా కరిగిపోయింది. నీటి బుడగలా పేలిపోయింది.

తన గురించి, తన తిరుగుళ్ళ గురించి నలుగురికీ తెలిస్తే తనకిక పెళ్లికాదు.

తనూ, తన వాళ్ళూ తలెత్తుకోలేరు. ఎవరికీ మొఖం చూపించలేరు!

ఉద్విగ్నయైంది. ఊగిపోయింది.

నవ్వులూ హేళనలూ భరించే కన్నా, ప్రేమ ఓటమిని భరించే కన్నా ప్రాణాలు తీసుకోవడమే మంచిదనుకుంది. అంతకు

మించి పరిష్కార మార్గం లేదనుకుంది.

ఎలుకలని చంపడానికి తెచ్చిన మందు పొట్లం విప్పింది. నీళ్ళలో కలుపుకుని తాగేసింది ప్రమీల!

ప్రేగులు మెలితిరుగుతోంటే బాధ భరించలేక కేకలు పెట్టింది.

అప్పుడే షాపునుంచొచ్చిన మల్లిక ఆ కేకలు విని తల్లిని పిల్చింది. ఇరుగు పొరుగు పోగయ్యారు.

తలుపులు బాదారు. ప్రమీల ఏడుస్తోంది. అరుస్తోంది. కింద పడి దొర్లుతోంది తప్ప తలుపు తీసే స్థితిలో లేదు.

పరిస్థితి విషమిస్తోందని బెంబేలు పడసాగారు. సరిగ్గా అప్పుడు వెంకన్నా, షరీఫ్ కంపెనీ నుంచి వచ్చారు. మరేమీ ఆలోచించకుండా తలుపులు బద్దలుగొట్టారు.

ఆమెని హుటాహుటిన ఆసుపత్రికి తీసుకెళ్ళారు.

ఏం జరిగిందో ప్రమీల ఎందుకు ఆత్మహత్యకి తలపడిందో ఎవరికీ తెలీదు.

కాని రకరకాల ఊహాగానాలు ఊపిరిపోసుకున్నాయి.

ప్రమీల తల్లిదండ్రులొచ్చారు.

సంగతి వింటూనే శోకాలు తీసింది చలపతి భార్య.

చలపతి ఆటోని పిలిచాడు. ఇద్దరూ ఆదరా బాదరా ఆసుపత్రికి పరుగెత్తారు.

ప్రాణగండం నుంచి బయటపడిందని తెలిసి తేలిగ్గా నిట్టూరుస్తూనే ఏడ్చేశారు.

షరీఫ్, వెంకన్నల చేతులు పట్టుకుని బావురుమన్నాడు చలపతి.

"మీరు సమయానికి ఆదుకోకపోతే నా బిడ్డ ఏమయ్యేదో!"

"అరే చోడోయార్. మనం మనం సాయం చేసుకోకపోతే ఇంకెవడు చేస్తాడు భాయ్. అయినా నువ్వు థాంక్స్ చెప్పాలంటే వెంకన్నకి చెప్పు" అన్నాడు షరీఫ్.

ఎందుకన్నట్టు చూశాడు.

"పోలీసులొచ్చారు. కేసు పెడతామని హడావుడి చేసిండ్రు. పెళ్లిగావాల్సిన పిల్ల అని చెప్పి పైసలిచ్చి పంపేసిండు..."

వెంకన్నవైపు తిరిగి చేతులు జోడించాడు చలపతి.

★ ★ ★

తిరుపతి చాట్ బండార్ దగ్గరికెళ్ళాడు గోపి.

ప్రతి సాయంత్రం బిజీగా వుండే తిరుపతి ఈగలు తోలుకుంటూ కూర్చున్నాడు.

"అలా వున్నావేం తిరుపతీ ఏమైందీ?"

తను షాపు పెట్టాక ఇద్దరి మధ్యా పెరిగిన స్నేహం దృష్ట్యా అడిగాడు గోపి.

"నా పని అయిపోయింది" దిగాలుగా అన్నాడు.

"ఇప్పుడేమయిందని? జనం లేరేంటి చెప్మా..." దిక్కులు చూస్తూ అన్నాడు.

"అక్కడున్నారు..."

అతడు చూపిన దిక్కు చూశాడు.

కింగ్స్ బేకరీ!

కొత్తగా కట్టిన బిల్డింగ్‌లో నాల్రోజుల క్రితం ప్రారంభమైంది. ఆకర్షణీయంగా డెకరేట్ చేశారు. బేకరీ ముందు గొడుగుల్లాంటివి పాతి, కుర్చీలు వేశారు. వాటిల్లో కూర్చుని బర్గర్లు, పేస్ట్రీలు, ఐస్‌క్రీములు తింటున్నారు జనం!

"కూర్చోడానికి తినడానికి చక్కని ఏర్పాట్లున్నాయి. నోరూరించే ఎన్నో రకాల ఐటమ్‌లున్నాయి. ఉర్రూతలూగించే పాశ్చాత్య సంగీతపు హోరు వుంది. టమోటా సాస్ చిల్లీసాస్ అందమైన గిన్నెల్లో వేసుకుని నంజుకోవచ్చు. తింటూ కబుర్లు చెప్పుకుంటూ చల్లని కోక్ పెప్సీ తాగొచ్చు..."

అతడి గొంతు జీరబోయింది.

"నిజమే సుమా చిన్న చేపని పెద్దచేప మింగినట్టు అయిపోయింది నీ పని. ఎదురుగా అంత పెద్ద ఎట్రాక్షన్ వుండగా నీ చాట్ బండార్లోని సమోసా చాట్‌కీ పావుబాజీకీ పానీపూరీకీ ఎందరొస్తారు?!"

"నా చాట్ బండారొచ్చేసరికి మా నాన్న

ఇడ్లీ అట్లు ఎగిరిపోయాయి. ఇప్పుడా బేకరీ వచ్చేసరికి నా వ్యాపారానికి కాళ్ళొచ్చే సాయ్!" ఏడుపు స్వరంతో అన్నాడు.

"నిజమే కాని మరీ అంత అధైర్యపడక్క ర్లేదు. ఇదివరకట్లా గాకపోయినా ఎంతో కొంత వ్యాపారం మనకీ మిగుల్తుంది."

"ఖర్చులకే చాలదు రాబడి! ఇంకో కొత్త సెంటర్ చూసుకుని వెళ్ళిపోవాల్సిందే" దిగులుగా అన్నాడు.

మరి మాట్లాడలేకపోయాడు గోపి. 'రేపో ఎల్లుండో తనకి పోటీగా ఏ సూపర్ బజారో వెలిస్తే తన గతేమిటి? ఇప్పుడే అతికష్టం మీద శేర్‌కి వడ్డీ కడుతున్నాడు. ఇంకప్పుడు...!' ఆపైన ఊహించడానికే భయమేసింది!

★ ★ ★

మెరుపు కన్నె రూపం ధరించి ప్రత్యక్ష మైనట్టు అన్పించింది గోపీకి.

షాపులోకొచ్చి నిలబడిన ఆమె మీంచి చూపులు తిప్పుకోలేకపోయాడు.

ఆమె సన్నగా ఉంది. పొడుగ్గా ఉంది. ఎర్రగా ఉంది. అవయవాలన్నీ పొందికగా ఉన్నాయి. ముఖంలో కళ ఉట్టిపడుతోంది. బొట్టులేదు. ముస్లిం అమ్మాయని వెంటనే గ్రహించేశాడు. అయినా ఆమె ఆకర్షణ నుంచి తప్పించుకోడానికి చాలా కష్టప డాల్సి వచ్చింది.

ఆమెలో ఏదో తెలీని అద్భుత అయ స్కాంత శక్తి ఉందనుకున్నాడు.

"మిమ్మల్నే. కూల్ డ్రింక్ ఇస్తారా"

బేగ్ పక్కన పెట్టి స్టూలు మీద కూర్చుంది. డ్రింక్ అందించాడు.

"మిమ్మల్ని కాలనీలో ఎప్పుడూ చూడ లేదు. కాలనీకి కొత్తనుకుంటాను..."

ఆమె మాట్లాడలేదు.

"మీ నవ్వు చాలా బావుంటుంది"

ఆమె కాస్సేపు కూర్చుంటే బావుండ్ననుకున్నాడు. కానీ ఆమె వెళ్ళడానికి లేచింది.

"మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?"

"తెలుసుకోకూడదు"

## కొత్తగాలి...



**మొగుళ్ళు**
**పెళ్లయిన కొత్తలో**
**కొత్త బళ్లలాంటోళ్లు**
**కొన్నాళ్లు పోతే**
**తెగ తాగుతారు!**
**పొగ వదులుతారు!!**

– కె.ఎన్నార్‌నమ్మి, నెగ్గిపూడి, మార్టేరు

గుంభనంగా నవ్వుతూ బేగ్ తీసుకుని హైహీల్స్ చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయింది. మనసు పారేసుకున్నాడు గోపి!

★ ★ ★

చలపతి తన బంధుమిత్రుల ద్వారా వీలైన సంబంధం కోసం గాలించాడు.

ప్రమీల గురించి అందరికీ తెలీక ముందే మూడు ముళ్ళూ వేయించెయ్యాలని అతడి తాపత్రయం. అసలా సంఘటన వల్లే గోపీకి చేసుకోమని అడగటానికి ధైర్యం చాల్లేదు కూడా.

చంద్రరావు సంబంధం వచ్చింది. ఇరువైపుల వారికీ నచ్చింది.

"ఫైనాన్స్ కంపెనీకెళ్ళి డబ్బు తెచ్చెయ్యండి" చలపతి భార్య అంది ముహూర్తాలు పెట్టుకోగానే.

"తెచ్చుకోవచ్చులేవే. అంత డబ్బు తెచ్చి ఇంట్లో పెట్టుకోవడం ఎందుకూ.. అసలే రోజులు బాగాలేవు. పెళ్లి రేపనగా తెచ్చి ఇచ్చేద్దాం"

"అప్పటికప్పుడు ఇస్తారో లేదో"

"లక్షలూ కోట్లూ టర్నోవర్ ఉంది, మొన్న డబ్బు కట్టినప్పుడు అడిగాను. ఎప్పుడంటే అప్పుడు అంతవరకూ వచ్చే వడ్డీ లెక్కట్టి ఇచ్చేస్తామన్నారు"

"రూపాయి రూపాయి కూడబెట్టి దాచాం. పెళ్లి ఘడియ ఇప్పటికొచ్చింది. ఆశించినట్టే ఆ సొమ్ము పిల్ల పెళ్లికి ఉప

## కొత్తగాలి...



**మనం మనం**
**గమనం మరచాం**
**విద్వేషంతో విధ్వంసం రచించి**
**పురోగమిస్తున్నాం**

– బొబ్బా సత్యనారాయణ, నిజామాబాద్

యోగిస్తోంది" సంబరపడిందామె.

శుభలేఖలు అచ్చేయించి బంధుమిత్రు లందరికీ పంచి వచ్చాడు. పీ.ఎఫ్. లోన్ తీసుకుని పెళ్లిబట్టలు కొన్నాడు.

"పరదేశివాళ్లు వెంటనే డబ్బివ్వట్లేదుట. మా కొలిగ్ చెప్పేడు. నాలుగురోజుల్లో పెళ్ళి ఉంది. వాళ్ళివ్వకపోతే..." కన్నీళ్ళు కనబడకుండా ముఖం తిప్పేసుకున్నాడు.

అతడి పక్కనే చతికిలబడిందామె.

"అన్యాయంగా ఆర్జించిన సొమ్ము కాదు. కష్టపడి పైసా పైసా కూడ బెట్టిన సొమ్ము. దాన్నెవరూ కాజెయ్యలేరు"

"ఛా.. ఛా.. కాజేస్తారని కాదే... టైము కివ్వకపోతే పెళ్లి ఎలాగని. ఇస్తానన్న కట్నం ముందే ఇవ్వాలి. ఇవ్వకపోతే పీటల మీది పెళ్లి ఆగిపోతుంది. ఇప్పటికే నలుగురి నోళ్ళలో నలిగి ఉన్నాం. ఇహ ఇది కూడా తోడైతే దానికింక పెళ్ళేకాదు. మనం తలెత్తుకోలేం" కన్నీళ్ళు అతడి చెంపల మీంచి జారిపోయాయి.

"మీరెప్పుడూ ఇంతే. గోరంతని కొండంత చేసుకుని బెంబేలు పడతారు. మన సొమ్ముకేం కాదు. పెళ్లి ఆగదుగాని మీరు ధైర్యంగా ఉండండి. రేపు పదింటికే మనిద్దరం వెళ్ళి మనకి రావాల్సిందంతా తెచ్చేసుకుందాం. ఆలస్యం అవ్వద్దంటే కడుపో కాలో పట్టుకుందాం. ఎంతటి కసా యివాడైనా పిల్ల పెళ్లంటే ఇచ్చి తీరతాడు"

"ఇచ్చేస్తే చాలు భగవంతుడ్ని కూడా ఇంకేం కోరను"

"ఇవ్వక ఎక్కడికి పోతారు? పెద్ద బిల్డింగులో పెద్ద పెద్ద బోర్డులు పెట్టి వ్యాపారం చేస్తున్నారు. ఎన్నో ఊళ్లల్లో ఎన్నో వేల లక్షల మంది దగ్గర్నుంచి లక్షలూ కోట్లూ తీసుకుంటున్నారు. ఇంత వడ్డీ ఇస్తాం, అంత వడ్డీ ఇస్తామని పేపర్లో పబ్లిగ్గా ప్రకటనలిస్తున్నారు. అలాటి వాళ్ళెలా మోసం చెయ్యగలరు.. మీ పిచ్చిగానీ! చెయ్యాలని చూస్తే ప్రభుత్వం మాత్రం వూరుకుంటుందేవిటి.. వారి ఆస్తుల్ని స్వాధీనం చేసుకుని వాళ్ళను జైల్లో పెట్టదూ? !"

ఆ రాత్రి ఇద్దరూ సరిగ్గా నిద్రపోలేకపోయారు. భయాల పాముల బుసబుసలు రాత్రంతా విన్పిస్తూనే ఉన్నాయి!

తొమ్మిదింటికే చలపతి దంపతులు పరదేశి ఫైనాన్స్ కంపెనీకెళ్ళి కూర్చున్నారు. అప్పటికే అరడజను మంది వచ్చి ఉన్నారు. వాళ్ళూ ఆందోళనగానే ఉన్నారు.

ఆఫీసు తలుపులు తెరవలేదు. నిరీక్షిస్తూండిపోయారు. అంతకంతకీ జనం పెరగసాగారు. ఆందోళన పెరగసాగింది.

"మోసం చేసి పారిపోయాడు! మనల్నందర్నీ నిలువునా ముంచేశాడు!"

ఎవరో అరిచారు.

కోపాలు! ఉద్రేకాలు! ఏడ్పులు! పెడబొబ్బలు! ఆవేశాలు...!

అద్దాలు పగలగొట్టారు. టేబుళ్ళూ బీరువాలూ కంప్యూటర్లూ ఎత్తుకుపోయారు కొందరు.

పోలీసులు రంగప్రవేశం చేశారు.

పరదేశి కంపెనీ అధిపతి జనానికి అధిక వడ్డీ ఆశజూపి కోట్లాది రూపాయలు వసూలుచేసి సింగపూర్ పారిపోయాడన్న నిజం మెల్లగా బయటపడింది.

కెవ్వుమని కింద పడిపోయాడు చలపతి! లబోదిబో మందతడి భార్య!

మర్నాడు ఎంతకీ చలపతి ఇంటి తలుపు తెరుచుకోకపోయేసరికి అనుమాన మొచ్చి పిలిచారు వెంకన్నా తదితరులు.

జవాబు లేదు.

తలుపులు విరగ్గొట్టి చూశారు.

చలపతి అతడి భార్యా కూతురూ శవాలై పడి ఉన్నారు!




**గో**పీ భయాలు నిజమై కూర్చున్నాయి.

అతడి షాపుకి కొద్దిదూరంలో సూపర్ బజార్ ప్రారంభించబడింది.

అది కూడా చెయిన్ సూపర్‌బజార్. నగరంలో ముప్పైదాకా బ్రాంచులున్నాయి.

కస్టమర్లని ఆకర్షించడానికి లాటరీ స్కీమ్ పెట్టారు. క్రెడిట్ కార్డులు యాక్సెప్ట్ చేస్తున్నారు. జనం వేలం వెర్రిగా ఎగబడుతున్నారు. బేకరీ పోటీ తట్టుకోలేక చాట్‌బండార్‌ని మరోచోటకి తరలించుకెళ్ళిపోయిన తిరుపతి కళ్ళ ముందు కదిలాడు. మెల్లగా తన పరిస్థితీ అలా దిగజారిపోతుందేమోనన్న భయం గోపిని కుదిపేసింది.

ఇప్పటికే తప్పనిసరై రెగ్యులర్ కస్టమర్లకి అరువు ఇస్తున్నాడు. జీతాలు రాగానే డెబ్భైశాతం వరకూ వసూలవుతోంది. ఇప్పుడు వాళ్ళంతా సూపర్‌బజార్‌కి అలవాటుపడితే అరువు సొమ్ము వసూలు చేసుకోవడం కష్టమవుతుంది.

అది జరిగితే రొటేషన్ దెబ్బతింటుంది. శేర్‌కి వడ్డీ చెల్లించలేడు. అసలు ఎప్పటికీ చెల్లువెయ్యలేడు. శేర్ ఆగ్రహిస్తే...!

ఒళ్ళు గగుర్పొడిచింది. ఊబిలో కూరుకుపోతున్నట్టు, ఊపిరాడని గదికి బందీగా వెళ్తున్నట్టు ఫీలయ్యాడు.

తలపట్టుకుని కూర్చున్నాడు.

"ఎనీ ప్రాబ్లం? "

ఎదురుగా మెరుపు తీగ.

"మీరా! రండి... ఏం కావాలి..." ఆమె కంటబడేసరికి ముఖంలోని విషాద మేఘాలన్నీ చెదిరి ప్రసన్నంగా మారిపోయాడు.

"ఏదైనా సమస్యా? "

"అంతకంటే ఎక్కువే" అంటూ జరిగిందంతా వివరించి తన భయాల్ని వెళ్ళగ్రక్కాడు. తిరుపతి చాట్‌బండార్ని ముంచిన బేకరీ గురించీ ఆవేదనగా చెప్పేడు.

"నాలుగైదేళ్ళలో ఆ సూపర్‌బజారు ఈ బేకరీ కూడా మూతపడతాయి."

"ఏమిటి మీరంటున్నది? " హాస్యమాడుతోందేమో అనుకోడానికాస్కారం కన్పించక ఆశ్చర్యంగా అడిగాడు.

"రేపటి నిజం అది!"

"ఇంత పెద్ద షాపులు..."

"మాయాబజార్ సినిమాలో కృష్ణుడంటాడు గుర్తుందా? చిన మాయను పెద మాయ, పెదమాయను పెనుమాయ అంతా స్వాహా అని. అది అక్షర సత్యం కాబోతోంది"

"మీ మాటలు చిత్రంగా ఉన్నాయి."

"నమ్మబుద్ధికావు కూడానూ. అది కూడా మాయలోని భాగమే. గ్లోబలైజేషన్, గ్లోబలే విలేజ్ అన్నమాటలు విన్నారా? పోనీ ప్రపంచీకరణ? "

తల అడ్డంగా ఊపాడు.

"అందుకే అంత నిశ్చింతగా ఉన్నారు. గుండుసూది నుంచి ఎలక్ట్రానిక్ వస్తువుల వరకూ కూల్డ్రింకుల నుంచి చికెన్ జాయింట్ల వరకూ సమస్తమూ విదేశాల నుంచి దిగుమతై దేశీయ పరిశ్రమల్ని చావు దెబ్బ తీస్తున్నాయి. మల్టీనేషనల్ కంపెనీలతో పోటీ పడలేక చిన్నా చితకా కంపెనీలు మూతబడుతున్నాయి. నీకు బాగా అర్థం కావాలంటే నువ్వమ్మే కూల్డ్రిం

కులే తీసుకో. కోకోకోలా, పెప్సీ రెండు కూడా విదేశీ సంస్థలు ఉత్పత్తి చేస్తున్నవే. వాటి ముందు నిలబడగల దేశీయ పానీయం ఉందా చెప్పు? ఒక్క మనదేశం లోనే కాదు.. అన్ని దేశాలకీ విస్తరిస్తూ ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థని అతలాకు తలం చేస్తున్నాయి. తీయని రంగు నీళ్ళమ్మే కంపెనీలు కోట్లు కుమ్మరించి క్రికెట్ పోటీలు నిర్వహిస్తున్నాయంటే వాటి శక్తేమిటో అర్థం కావట్లేదూ?"

కొంచెం అర్థమయ్యింది. చాలా అర్థం కాలేదు. కానామె చెబుతోంది గనుక నిజమే అయ్యుంటుందనుకుంటూ తలూ పేడు గోపి.

సాల్ట్ బిస్కెట్లు తీసుకెళ్ళిపోయిందామె. వెళ్ళిపోయాక బాధపడ్డాడు ఆమె పేరైనా అడగలేదే అని!

★ ★ ★

"అనుకోకుండా మణి పెళ్లి కుదిరింది. వచ్చే ఆదివారమే పెళ్లి. మీ అందర్నీ పిలు ద్దామని వచ్చాను" అంటూ శుభలేఖ అందించాడు జనార్దనం.

చాలా ఖరీదైన కార్డు. లోపలి అక్షరాలు బంగారు వర్ణంతో మెరిసిపోతున్నాయి.

"పెట్టి పుట్టారు..." అనుకుంది కనకం మనసులో.

"అమెరికా సంబంధం చేస్తున్నావా? అమ్మాయి ఒప్పుకుందా?" ఆశ్చర్యబో యాడు వెంకన్న.

"మా కన్నా దాని పట్టే ఎక్కువ. అలా అడిగావేంటన్నయ్యా?"

"ఇదివరకు నర్సాపురం సంబంధం వద్దందిగా. హైదరాబాదులోనే వుండే సంబంధం కావాలందన్నావుగా"

నవ్వేశాడు జనార్దనం. "అప్పుడలా అంది గాని ఇప్పుడంతా మారిపోయింది. మణే కాదులే కుర్రకారు అందరి చూపులూ అమె రికా వంకే ఉన్నాయి. అమెరికా అంటే భూతల స్వర్గంకదా. అయినా అంతా విమాన ప్రయాణాలు కదా. ముప్పైగం టల్లో వెళ్ళొచ్చు, వచ్చేయ్యొచ్చు"

"ఇంత దగ్గర్లో ముహూర్తం పెట్టుకు న్నారేం? పెళ్లంటే మాటలా ఎన్ని పనులూ ఎంత అద్దేసా!"

"అవన్నీ ఇదివరకటి ముచ్చట్లు. ఇప్పుడు అన్నిటికీ కాంట్రాక్టులూ కేటరింగులూ వున్నాయిలే. అసలు అమెరికా సంబంధా లన్నీ ఇలా హడావిడిగానే జరుగుతుం టాయి అన్నయ్యా. చిన్నప్పుడు చదివేం చూడు. ఆదివారంనాడు అరటి మొల చింది, సోమవారంనాడు సుడివేసి పెరి గింది అని.. అలా వుంటుంది వ్యవ హారం. అబ్బాయి ఆదివారం వచ్చాడు. సోమవారం మనమ్మాయినీ, ఆ సాయంత్రం ఇంకొకర్ని, మర్నాడింకొకర్నీ చూశాడు. మంగళవారం సాయంత్రం మన సంబంధం ఓకే చేశారు. బుధవారం ముహూర్తం పెట్టేశాం. ఆదివారం పెళ్ళి. వచ్చే బుధవారం వీసా కోసం ఇంటర్వ్యూ. మళ్లీ శనివారం వీడ్కోలు..."

"పెళ్లి యాంత్రికమై పోయిందన్నమాట"

"అయిదు రోజుల పెళ్లనేది అయిదు రోజుల్లో పెళ్లి అయిపోయింది. ఏం చేస్తాం.. కాలంతోబాటే మనమూనూ. ఇక పోతే అన్నయ్యా నువ్వే పెద్దదిక్కు. నువ్వు తప్ప నాకిక్కడింకెవరున్నారు చెప్పు. అంచేత మీరంతా రేపే వచ్చేయాలి. పెళ్లి పెద్దలా నిలబడి మాట దక్కించాలి"

ఆ మాటలకి పొంగిపోయాడు వెంకన్న.

తల్లి తండ్రి రెండ్రోజులు ముందే పెళ్ళి కెళ్ళారు. గోపి, మల్లిక, శీను పెళ్ళి టైముకి వెళ్ళారు.

మల్లిక పట్టు లంగా, ఓణీ ధరించింది. చేతులకి గాజులు వేసుకుని మెడలో పూస లమాల ధరించింది. ఎంతో సాదాసీదాగా ఉన్నా వయస్సు మిస మిసల వల్ల చూడ గానే కళ్ళు తిప్పుకోలేనట్టుగా ఉంది.

పెళ్ళి రంగరంగ వైభోగంగా జరిగింది.

అంతా అక్షింతలు వేసి వధూవరుల్ని ఆశీర్వదించారు. ఫొటోలు దిగారు. వీడియో తీశారు.

"అమ్మానాన్న ఎక్కడున్నారో? వాళ్ళకి కన్పించి వెళ్ళిపోదాం" అన్నాడు గోపి.

వంటల దగ్గర పొగల మధ్య చెమట్లు కక్కుతూ అన్నీ అందిస్తూ వంటలక్కలా కన్పించింది కనకం.

"నీకే పెత్తనం అప్పగించారన్నమాట" వ్యంగ్యంగా అన్నాడు గోపి.

"దగ్గరుండి చూడమన్నార్రా. మన వాళ్ళకి మనం సాయపడకపోతే ఎలా చెప్పు. మీ నాన్న కన్పించారా? సరుకుల దగ్గరుండాలి. ముహూర్తం వేళయిన ట్టుంది త్వరగా తెమల్చుకొస్తానుండు"

"పెళ్ళై పదినిమిషాలయ్యింది."

బుగ్గలు నొక్కుకుందామె. "అక్షింతలు వెయ్యడానికి మమ్మల్ని పిలవలేదేంరా"

"నీ ముద్దుల మరిది నడుగు"

ఇంతలో ఏదో అందిమ్మని ఎవరో కేకేశారు.

"మీ నాన్నని కలిసెళ్ళండి, భోంచేశారా?" అంది హడావిడిగా.

"మేం చేశాం. నువ్వు?" మల్లిక మాటలకి, "తర్వాత చేస్తాన్లే" అంటూ వెళ్ళిపోయింది కనకం.

తండ్రి ఇంటి దగ్గర కాపలా వున్నాడని తెలిసి వెళ్ళారు.

"హమ్మయ్య వచ్చారు కదా. మీరొచ్చారో లేదోనని ఇదవుతున్నాను. పెళ్లి ఎలా జరిగిందిరా?" అడిగాడు వెంకన్న.

"బ్రహ్మాండం! నీకు వాచ్‌మెన్ డ్యూటీ వేశారన్నమాట".

"అదేం మాటరా అబ్బాయ్. ఇంటినిండా విలువైన సామాన్లున్నాయి. మన వాడంటూ ఉండకపోతే రెక్కలు రావూ!"

"అయితే కాపలా కాయి, మేం వెళ్తాం"

★ ★ ★

బక్రీద్ పండుగని పురస్కరించుకుని వెంకన్న కుటుంబాన్ని 'దావత్'కి ఆహ్వానించాడు షరీఫ్.

కాదన్లేకపోయాడు వెంకన్న.

సంగతి ఇంట్లో చెప్పగానే, "సాయిబుల ఇంట్లో భోంచేస్తామా?" అంది కనకం బుగ్గలు నొక్కుకుని.

"తప్పేవిటే. షరీఫ్ సాయపడకపోతే మనమిలా ఉందుమా అసలు?"

"అది నిజమేనండీ. సాయిబులింట్లో చెయ్యి కడుక్కుంటే వర్ణసంకర మవ్వదూ? అత్తయ్య ఉంటే ఒప్పుకునేవారా?"

మాట్లాడలేకపోయాడు. అతడికీ మనస్సులో పీకుతూనే ఉంది.

అతడి పల్లెలోనూ నాలుగైదు దూదేకుల సాయిబుల కుటుంబాలున్నాయి. దూది నేయడం, డప్పులు వాయించడం చేసేవారు. వాళ్ళని తక్కువ వాళ్ళుగా భావించి వాళ్ళిళ్ళలో పచ్చి మంచినీళ్లు కూడా తాగేవారు కాదెవరూ.

కానిక్కడ ఈ మహానగరంలో ఎందరో ముసల్మానులున్నారు. అయినా అంతా అన్నదమ్ముల్లా కలిసుండటం హైదరాబాద్ సంస్కృతి. ప్రతీచోట, ప్రతీ ఆఫీసులో అన్యోన్యంగా ఉంటారు. ఒకరి మతాన్ని ఒకరు గౌరవిస్తూ ఒకరి పండుగకి ఒకరు శుభాకాంక్షలు తెలుపుకుంటారు.

మధ్య మధ్య స్వార్థపరులు మతవిద్వేషం రెచ్చగొట్టి మారణహోమం సాగించినా సామాన్య మధ్య తరగతి కుటుంబాలన్నీ స్నేహ సౌభ్రాతృత్వాల్ని పంచుకుంటూనే ఉన్నాయి.

అయినప్పటికీ వాళ్ళింటికెళ్ళి భోంచెయ్యాలంటే ఎంచేతో సంకోచంగా ఉంది. భార్య మాటలకది మరింత పెరిగింది.

అదే సమయంలో షరీఫ్‌ని నొప్పించడమూ ఇష్టం లేదు. ఎటూ తేల్చుకోలేక గింజుకుంటోంటే గోపీ వచ్చాడు.

సంగతి విని నవ్వేశాడు.

"మతం అనేది ఒక నమ్మకం. ఎవరి

నమ్మకం వారిది. ఎవరి పద్ధతి వారిది. అది మనుషుల్ని మరింత దగ్గర చెయ్యాలి గానీ మనిషికీ మనిషికీమధ్య అడ్డుగోడలు నిర్మించకూడదు. సర్వేజనో సుఖినోభ వంతు అన్నదే అన్ని మతాల సారం. అటువంటప్పుడు మతాల పేరిట గిరి గీసు కోవడం మా మతం గొప్పదంటే మాది గొప్పదని అహంకరించడం అవివేకం. అవ కాశవాదం. కరడు గట్టిన స్వార్థం!"

కొడుకు మాటలకి ఆశ్చర్య పడలేదు కనకం. అతడిలో, అతడి ఆలోచనల్లో, దృక్పథంలో చాలా మార్పు కన్పిస్తోందీ మధ్య. ఒకనాటి గోపీకీ ఈనాటి గోపీకీ పొంతనే లేదు!

"కాలంతోబాటే మనమూ నడవాలి. రైతుబిడ్డలం ఇవాళ ఫ్యాక్టరీల్లో పనిచేసే కార్మికులవ్వలేదూ? పల్లెల్లో పుట్టి పెరిగిన వాళ్ళం. ఇవాళ పట్నం వాసం చేయ ట్లేదా? ఇదీ అలాగే అనుకో. అంతా విందుకెళదాం"

"మంచితనానికి మతం అడ్డా అనేవారు అత్తయ్య. జనార్దనం చేస్తానని కూడా చేయలేదు. ఆ సాయిబులాయన తనంత టన తనొచ్చి మరీ సాయం చేశాడు. వాళ్ళ రుణం తీర్చలేనిది. వాళ్ళింట అన్నం తింటే ఏంకాదు. ఆకలికీ అన్నానికి కులమేమిటి, మతమేమిటి!" అంది కనకం.

"అమ్మో అమ్మో మా అమ్మ ఉపన్యాసా లిస్తోంది. ఈసారి ఎన్నికల్లో టిక్కెట్‌కి ట్రై చేద్దాం" అన్నాడు నవ్వుతూ గోపి.

అయిదుగురూ స్వీట్స్ పాకెట్ తీసుకుని షరీఫ్ ఇంటికెళ్ళారు. వాళ్ళు సాదరంగా ఆహ్వానించారు.

చల్లని మంచినీళ్ళు గ్లాసులందిచ్చిందో అమ్మాయి.

గోపీ కళ్ళు విప్పారాయి.

ఆమె ఒకనాడు తన షాపు ముందు మెరిసిన మెరుపు కన్య!

అల్లరిగా నవ్విందామె.

"మీరు... మీరు... మా షరీఫ్ అంకుల్

## కొత్తగాలి...

**జీవితపుటెడారిలో**
**ఎంత పరుగెత్తినా**
**అంతుచిక్కని ఎండమావులే**
**సుఖశాంతులు**

– సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ

గారమ్మాయా? "

"కాదు బేటా. మా తమ్ముడి కూతురు. రజియా" షరీఫ్ చెప్పేడు.

"స్వచ్ఛమైన తెలుగు మాట్లాడుతోంది!"

"గుంటూర్లో పుట్టి పెరిగిందిలే. జాబ్ కోసం వచ్చింది"

మహదానంద పడిపోయాడు గోపి. విందుకి రానట్టయితే చాలా మిస్సయ్యేవా డ్ననుకున్నాడు.

అంతా కబుర్లలో పడ్డారు. గోపి మాత్రం రజియా వంక దొంగచూపులు చూడసా గాడు. ఒక్కోసారి ఆమె చూపులకి దొరికేసి కంగారు పడసాగాడు కూడా.

బక్రీద్ గురించి వివరిస్తూ "ఎవరి శక్తి కొద్దీ వారే మేకల్ని బలిస్తారు. దాన్ని ఖుర్బానీ అంటాం. దాన్ని మూడు సమాన భాగాలు చేస్తాం. ఒకటి స్వంతానికి ఉంచు కుంటాం. ఒక భాగం మిత్రులకి బంధువు లకి ఇస్తాం. మూడో భాగం పేదసాదలకి పంచి పెడ్తాం. ఈ రోజున ఎవరూ ఆక లితో మాడకూడదని మా అభిప్రాయం" అన్నాడు షరీఫ్.

"చాలా గొప్ప సంప్రదాయం. అంతా పండుగ చేసుకోవాలి. అంతా ఆనందంగా ఉండాలి- అన్నది చాలా మంచి పద్ధతి. ఇదివరకు మేం కూడా పేదసాదలకి అన్న దానం చేసేవాళ్ళం. ఇప్పట్లో దేవీ నవరా త్రులకే పరిమితమై పోయిందనుకోండి"

"భాయీసాబ్ లేవండి. ఖానా

తయ్యార్..." షరీఫ్ భార్య పిలిచింది.

మధ్యలో తెల్లని దుప్పటి పరిచారు. దానిమీద రకరకాల పదార్థాల డిషెష్, తళ తళ మెరుస్తోన్న గాజు గ్లాసులూ ప్లేట్లూ స్పూన్లూనూ.

ఆడా మగా అంతా కలిసి చుట్టూరా చతికిలబడి కూర్చున్నారు.

ఒక్కో ప్లేటులో బిర్యాని వడ్డించి అందిచ్చింది రజియా.

నోట్లో వేసుకుంటే చాలు కరిగిపోతున్నట్టుగా ఉంది. ఎంతో రుచిగా ఉంది. కొసరి కొసరి వడ్డించారు.

అనంతరం స్వీట్ హల్వా తిని లేచారు.

సోంబిలో పంచదార గుళికలు కలిపి అందిచ్చారు. కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారంతా.

కనకం పల్లెలో తమది పెద్ద వంశమనీ గొప్పగా బతికిన కుటుంబమనీ కోతలు కోసింది.

మల్లిక రజియా ఎర్రని రంగు వంకా పెదాల రంగు వంకా అబ్బురంగా చూస్తూ అందాల చిట్కాలను ఆరా తీయసాగింది.

ఫ్యాక్టరీ కబుర్లు ముచ్చటించుకున్నాక అన్నాడు షరీఫ్, "చార్మినార్ నిర్మాణం పూర్తికాగానే మహమ్మద్ కులీకుతుబ్‌షా ఆ మహా నిర్మాణం నడుమ నిల్చొని ఏమని ప్రార్థించాడో తెలుసా వెంకన్నా? అల్లా ఈ నగరానికి శాంతి సౌభాగ్యాలు ప్రసాదించు. అన్ని కులాల మతాలకు చెందిన ప్రజలంతా మహా సముద్రంలో చేపల్లా నిండిపోవుగాక" అని.

"మనమంతా ఎప్పటికీ అలా ఉందాం. కలిసి ఉంటేనే నిలిచి ఉంటాం. చీలిపోతే కూలిపోతాం" అన్నాడు వెంకన్న.

సెలవు తీసుకుని ఇంటిముఖం పట్టింది వెంకన్న కుటుంబం.

"సాయిబులు సాయిబులు అనుకుంటాం గాని వీళ్ళ ఆప్యాయతలు చూస్తోంటే మతిపోతోంది. తోడబుట్టిన వాళ్ళకన్నా ఆదరంగా చూశారు చూడండి. నిన్నగాక మొన్న జనార్ధనం ఇంట్లో పెళ్లికెళ్లాం. ఊరంతా విందారగించిపోయారు గాని మనకి మాత్రం మిగులూ తగులూ పడేశారు!" అంది కనకం.

అవునంటూ తలాడించాడు వెంకన్న.

గోపి ఆలోచనలు మాత్రం రజియా చుట్టూనే తిరగసాగాయి!




ఎస్సెస్సీ రిజల్ట్సు వచ్చాయి.

శీను ప్రథమ శ్రేణిలో పాసవ్వడమే కాదు రాష్ట్రం మొత్తం మీద పన్నెండో ర్యాంకు వచ్చింది.

అతడి ఫొటో ప్రచురించాయి పత్రికలు.

శీను నిండుకుండలా ఉండిపోయాడు. కష్టానికి తగ్గ ఫలితం లభించిందన్న తృప్తి కళ్ళల్లో ఉట్టిపడుతోంది. తన కృషి మీద నమ్మకం రెట్టింపు కాగా అచంచల విశ్వాసంతో విజయహాసం చేస్తూండిపోయాడు.

తండ్రి వాడ్ని అక్కున చేర్చుకుని ఆనంద బాష్పాలు రాల్చాడు.

గోపి ఏకంగా అతడ్నెత్తేసి గిరగిరా తిప్పాడు. నా తమ్ముడికి ర్యాంక్ వచ్చిందంటూ కాలనీ అంతా అరచి చెప్పేడు. మిఠాయి పంచాడు.

కాలనీ వాసులంతా అభినందించారు.

నీ తల్లిదండ్రులకే కాదు కాలనీకీ కీర్తి తెచ్చి పెట్టేవన్నారు. మరిన్ని విజయాలు సాధించాలనీ ఆకాశమే హద్దుగా ఎదగా

# పుష్కరిణి తీరాన సాధన




తమిళనాడులోని ప్రఖ్యాత సంగీత విద్వాంసులు రామనాడ్ శ్రీనివాస అయ్యంగార్ రామనాడులోనే సంగీత గురుకులం నడిపేవారు. తమ శిష్యులను సొంత పిల్లల్లా చూసుకొనేవారు. రాత్రి భోజనమయ్యాక శిష్యుల గదులవైపు గస్తీ తిరిగి వచ్చేవారు. ఒకరోజు ఓ విచిత్రం జరిగింది. శిష్యుల గదులలో ఒకదానికి బయట తాళం వేసి ఉంది గాని, లోపల మాత్రం ఒకవైపు దీపం, మరోవైపు మంచం మీద ఎవరో ముసుగుతన్ని పడుకున్నట్లు కనిపించింది. అంతలోనే వెనుక సందులో ఎవరో పోతున్నట్టు గమనించి అతడిని వెంబడించారు. ఆ వ్యక్తి కొద్ది దూరంలోని పుష్కరిణి చేరుకొన్నాడు. మెట్లన్నీ దిగి నీటికి పైమెట్టు మీద కూర్చొని ముఖం పైకెత్తి నిర్మలాకాశాన్ని చూస్తూ పాట పాడనారంభించాడు. అతని కంఠం వినబడగానే ఆ ఉదయం జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. శిష్యుడైన దొరస్వామి అయ్యంగార్ బాగా పాడనందున అతడిని తానే చిన్నబుచ్చారు. అతనిప్పుడు అదే కీర్తనను ప్రశాంతమైన రాత్రివేళలో సాధన చేస్తుంటే అవాక్కయ్యారు. భుజంపై ప్రేమగా చేయివేసి 'ఏమిటిది, దొరె' అని కదిలించారు. ఒళ్లు మరచిన దొరస్వామి అయ్యంగారు పూర్వి కల్యాణి రాగంలో కీర్తనను అపూర్వంగా పాడారు. రామనాడ్ శ్రీనివాస అయ్యంగార్‌కు ఆ శిష్యుడిని చూసి చాలా సంతోషమైంది. కొలనులోని చల్లటి నీటిని దోసిలితో శిష్యుడి ముఖం మీద చిలకరించారు. ఎదుట నిలబడివున్న గురువు శ్రీనివాస అయ్యంగార్‌ను చూసి విభ్రమ చెందాడు. ఇద్దరూ కాస్సేపు ఏమీ మాట్లాడలేకపోయారు. శిష్యుడి భుజంపై చేయి వేసుకుని ఇంటికి పిలుచుకు వెళ్లారు. అప్పటి నుంచి దొరస్వామి అయ్యంగార్‌ను తన గదిలోనే పడుకోవాల్సిందిగా ఆయన కట్టడి చేశారు.



లనీ చుక్కల్ని చూడాలనీ ఆశీర్వదించారు.

హైస్కూలు ప్రిన్సిపాల్ వచ్చి పూల గుచ్ఛం అందించి అభినందించారు. తనతో స్కూలుకి తీసుకెళ్ళారు.

ఒకప్పుడెంతో చులకనగా మాట్లాడిన ఆయన స్వయంగా వచ్చి అభినందించే సరికి సంబరపడ్డాడు వెంకన్న.

కొడుక్కి ఇచ్చే గౌరవ పురస్కారాల్ని స్వయంగా చూడాలని బయల్దేరాడు.

స్కూలు కమిటీ సభ్యులూ టీచర్లూ పిల్లలూ అంతా శీనుని అభినందనల్తో ముంచెత్తారు.

స్కూలు బిల్డింగు ముందు శీనుని నిలబెట్టి పూలదండలేస్తూ షీల్డు బహుకరిస్తూ ఫొటోలు తీశారు.

అతడి పైచదువు నిమిత్తం స్కూలు తరపున పదివేల రూపాయల చెక్కు ఇచ్చారు.

వెంకన్న కంటినుంచి ఆనందబాష్పాలు ధారలుగా కారసాగాయి.

వాళ్ళందరికీ కృతజ్ఞతలు తెలియజేశాడు. తననెవరూ పట్టించుకోకపోయినా తను శీను తండ్రినని గర్వంగా చెప్పుకున్నాడు.

స్కూలు కారులో ఇంటికి తిరిగొచ్చారు.

వారొచ్చేసరికి వారికోసం ఓ కాలేజీ వాళ్ళు మరో కార్లో వచ్చి నిరీక్షిస్తున్నారు.

పెద్ద పూల గుచ్ఛం ఇచ్చి అభినందనలు తెలిపారు.

వాళ్ళెవరో ఏమిటో అర్థంగాక అయోమయంగా చూశాడు వెంకన్న.

"మహాన్ కాలేజీల గురించి తెలుసు కదా. అవన్నీ మావే. సిటీలోనే గాక విజయవాడ, గుంటూరు, తిరుపతి, విశాఖపట్నాలలో మొత్తం వంద కాలేజీలున్నాయి. ఇంటర్లో ఎంసెట్ స్టేట్ ర్యాంకులన్నీ మావే. మా కాలేజీని కొట్టగల కాలేజీ స్టేట్‌లోనే లేదు. మీ అబ్బాయి వజ్రమే

కాని సానబట్టని వజ్రం. ఆ పని మేం చేస్తాం. మా కాలేజీలో చేర్చండి. సానబట్టి కోహినూర్ వజ్రంలాగా తయారుచేస్తాం. మా లెక్చరర్లు దేశంలోనే ఖ్యాతిగాంచిన వాళ్ళు తెలుసా! నెలకి యాభైవేల నుంచి లక్షదాకా జీతం ఇస్తున్నాం..."

బుర్రగోక్కున్నాడు వెంకన్న. తండ్రి ఏమంటాడోనని ఆదుర్దాగా చూశాడు శీను. కనకానికి అంతా అయోమయంగా ఉంది. కాలేజీలో చేర్చడానికి తాము కాలేజీకెళ్లాలి గాని వాళ్లే వచ్చి తమ కాలేజీలో చేర్చమని కోరడం ఏమిటో అర్థంగాకుండా ఉంది.

"నా సంగతి మీకు తెలీదు. బతికిచెడ్డ వాణ్ణి. ఫ్యాక్టరీలో చిన్నపని చేస్తున్నాను"

"ఓస్ అదా సందేహం" నవ్వేశాడతను.

"మీరొక్క పైసా ఫీజు కట్టక్కర్లేదు. హాస్టల్ ఖర్చూ పుస్తకాల ఖర్చూ అన్నీ మేమే భరించి ఊరికే చదివిస్తాం. ఎంసెట్‌లో చక్కని ర్యాంక్ తెప్పించి మీకప్పజెబుతాం. మా కాలేజీలో చేరితే చాలు మీ అబ్బాయిజాతకం మారిపోయినట్టే లెక్క".

వెంకన్న, కనకాల మొఖాలు వెలిగిపోయాయి. పరమానంద పడిపోయారు.

"వీళ్ళ కాలేజికి మంచి పేరుంది నాన్నా. వీళ్ళ కాలేజీలో చేరతాను."

వెంటనే వారి జూనియర్ కాలేజీలో చేరుతున్నట్టు అడ్మిషన్ ఫారాల మీద సంతకాలు తీసుకున్నారు. మరోసారి అభినందించి వెళ్ళిపోయారు.

"వాళ్ల వ్యాపారానికిది పెట్టుబడి"

గోపి మాటలర్థంగాక నుదురు ముడివేసి చూశాడు వెంకన్న.

"ఇంటర్లోనూ ఎంసెట్‌లోనూ శీనుకి ర్యాంకులొచ్చి తీరతాయి. అది అడ్డుపెట్టుకుని ప్రచారం చేసుకుంటారు. ఎందర్నో ఆకర్షిస్తారు. వేలకి వేలు ఫీజు గుంజుతారు. ఇంజనీరింగు మెడికల్ చదువుల మీద క్రేజ్ పెరిగేక విద్య ఫక్తు వ్యాపారమైపోయింది. మన రాష్ట్రంలో మరీనూ. దేశంలో ఎక్కడా ఇలా లేదంట. లక్షలకి లక్షలు ఫీజులూ, డొనేషన్లూ కట్టి మరీ చదివిస్తున్నారు. తమ పిల్లలు ఇంజినీర్లో డాక్టర్లో అవ్వాలని ఆరాటపడుతున్నారంతా. అవితప్ప ఇంకే చదువులూ లేనట్టు చిన్నప్పట్నుంచే నూరిపోస్తున్నారు. వారి ఆశల్నీ కలల్నీ క్యాష్ చేసుకుంటూ కోట్లు సంపాదిస్తున్నారంటే నమ్ము."

"బాగనే ఉందైతే..." ఆ సంగతులన్నీ అబ్బురపరుస్తోంటే అన్నాడు.

వెంకన్న కుటుంబం విజయానందాన్ని పూర్తిగా అనుభవిస్తూండగా ఒక ముసలావిడ "మా వెంకన్న ఎక్కడ? మా వెంకన్న ఏడి? " అంటూ వెదుక్కుంటూ వచ్చింది.

"అలా చూస్తావేంట్రా. మీ మేనమావా మా నాన్నా అన్నదమ్ముల బిడ్డల్రా. ఇప్పుడైనా గుర్తొచ్చానా? "

అతడికేమీ గుర్తురాలేదు. అయితేనేం అమ్మ పుట్టింటి తాలూకు అంటూ ఆవిడ వచ్చేసరికి మహదానందపడిపోయాడు వెంకన్న. తల్లి బతికుండి ఉంటే ఎంతో సంబరం పడేది అనుకున్నాడు.

"పాత బంధుత్వాన్ని తిరగదోడుతూ వచ్చేవు. చాలా సంతోషంగా ఉంది. భోజనాల టైముకి వచ్చావు. భోజనంతో మళ్ళీ బంధుత్వాన్ని కలుపుకుందాం. కనకం భోజనం వడ్డించు. మల్లికా కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళియ్యి" హడావిడి చేశాడు.

"నీదంతా మీ అమ్మ పోలికేరా. పుట్టింటి నుంచి కాకి వచ్చినా హడావిడి చేసేసేది. పుట్టిల్లంటే ఎంత అభిమానమనీ, అవునూ, మీ అమ్మ ఎప్పుడు కాలంచేసిందిరా"

ఆవిడ భోంచేస్తోంటే కొంచెం ఎడంగా కూర్చుని తన కబుర్లు చెప్పుకొచ్చాడు వెంకన్న. ఆవిడ మరింత ఆసక్తి ప్రదర్శిస్తూ అతడి వివరాలన్నీ కూపీ లాగింది.

మహంకాళి రూపం, పద్ధతీ కనకానికి బొత్తిగా నచ్చలేదు. సన్నగా పొడుగ్గా ఉంది. తెల్లచీర, నెరసినజుట్టు, గద్దకళ్ళు,

రామాయణంలోని మందర గుర్తొచ్చింది.

భోజనానికొచ్చాడు గోపి. ఈ కొత్త చుట్టం ఎవరా అన్నట్టు చూశాడు.

"నీ కొడుక్కాదూ.. మీ అమ్మ నోట్లోంచి ఊడిపడ్డట్టున్నాడు. ఏం చేస్తున్నావురా? "

"వ్యాపారం చేస్తున్నాడు..." వెంకన్న అన్నాడు.

"ఈ రోజుల్లో అదే నయంరా. ఉద్యోగాలంటూ ఎగబడతారు గాని అవి వట్టి గొర్రె తోకలనుకో. మా అబ్బాయి అంతే. కాంట్రాక్టులు చేస్తున్నాడు. రెండు చేతుల్తో సంపాదిస్తున్నాడు.

"పెళ్ళయిందా? " వెంకన్నే అడిగాడు.

"ఇంకా లేదు. ఈ ఏడాది చేసేయ్యాలనుకుంటున్నాను. ఉన్నమాట చెబుతున్నాను. పిల్లనిస్తామనీ పెద్ద కట్నాలిస్తామనీ చాలా మంది వస్తున్నార్రా. నాకీ సంకర మనుషులూ ఇష్టంలేదు. మన పక్క సంబంధం చేసుకుందామనుకుంటున్నాను. నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు. మన ప్రాంతపు అభిమానాలూ ఆప్యాయతలూ వేరు. అక్కడి సంబంధం చేస్తే ఇంటికి దీపమౌతుంది. పిల్ల శాశ్వతం గాని డబ్బు శాశ్వతంకాదు కదా. ఏమంటావ్? "

"బాగా చెప్పేవు. పిల్ల బాగుంటే సంతానమూ బాగుంటుంది. పిల్ల గుణవంతురాలైతే సంసారమూ భాగ్యవంతమవుతుంది"

నా మనసులోని మాట చూసినట్టు చెప్పేవురా. నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళు బతకరా!" అంది.

మల్లికని పిలిచి పక్కన కూర్చోబెట్టుకుంది మహంకాళి.

"పిల్ల కుందనపు బొమ్మలా ఉంది. మొన్న జనార్దనం కూతురి పెళ్ళికొచ్చినపుడు చూశాను..."

"నీ ఎరికలో మంచి సంబంధం ఉంటే చూడు. పెద్దగా ఇచ్చుకోలేను..." వెంకన్న చెప్పేడు.

"ఉయ్యాల్లో బిడ్డని పెట్టుకుని ఊరంతా వెదికినట్టు ఇంకా ఎక్కడో వెదకడం ఎందుకురా. నువ్వు వూ అంటే చాలు నా కోడలిగా చేసుకుంటాను. ముందే చెప్పేనుగా నాకు కట్నపాశ లేదు".

పెళ్ళి వూసొచ్చేసరికి సిగ్గొ పడి గదిలో కెళ్ళిపోయింది మల్లిక.

"మీ గురించి నేనేం కూపీ తీయక్కర్లేదు. మీ వంశం ఎలాటిదో నాకు తెలుసు. నిప్పులాంటి మనుషులు కనుకే సంబంధం కలుపుకోవాలనొచ్చాను. నా గురించి నీకంతా తెలిసిందే. నా కొడుకు గురించి ఆరా తీసుకో. ఎవర్ని కదిపినా అరగంటసేపు చెబుతారు. సంబంధాలు రాక రాలేదు. మనవాళ్లన్న అభిమానంతో వచ్చేను..." నిష్ఠూరంగా అంది.

వెంకన్న మెత్తబడ్డాడు. తల్లి తరపు బంధువుల్తో సంబంధం పునరుద్ధరించుకోవాలనెంతో ఆశగా ఉంది.

"మంచిరోజు చూసి అబ్బాయిని తీసుకొస్తే అబ్బాయీ అమ్మాయీ ఒకర్నొకరు చూసుకుంటారు"

"బంగారంలాంటి మాట చెప్పేవురా. ఎప్పుడో ఎందుకు ఆదివారం వస్తాం"

ఆమె వెళ్ళేక, "ఇదేం చోద్యమండీ. మీ అమ్మాయిని మా అబ్బాయికి చెయ్యండి అని ఇంటికొచ్చి మరీ అడిగేవాళ్ళని ఎక్కడా చూళ్ళేదు" అంది కనకం.

"పాతకాలపు వాళ్ళకి బంధుత్వాలంటే మక్కువ ఎక్కువే పిచ్చిదానా. అపార్థం చేసుకుంటే ఎలా? ' సమర్థించాడు.

## కొత్తగాలి...

**మనిషి పుట్టుక**
**ఓ అదృష్టం**
**మనుగడే**
**అతికష్టం**

– కూర్మాన వెంకటసుబ్బారావు,
విశాఖపట్నం

మహంకాళి కొడుకు స్టైలుగా హీరోలా 'కంప్లీట్ మేన్'లా ఉంటే బావుండ్నని ఆశించడమే కాదు, అప్పుడే ఊహల్లో తేలి పోసాగింది మల్లిక.

★ ★ ★

మహానగరం శరవేగంతో అభివృద్ధి చెందుతోంది.

వెంకన్నవాళ్లు ఉంటున్న కాలనీ కూడా బాగా డెవలప్ అయ్యింది. రోడ్లూ, పార్కూ వచ్చాయి. గోపీ దుకాణం ఉన్న సెంటర్ ఊహించనంత మారిపోయింది.

రోడ్డు పక్కనున్న ఇళ్లని ఒక్కొక్కటిగా పడగొడ్తూ అంతస్తుల భవనాలు కడుతున్నారు. షాపింగ్ కాంప్లెక్సులుగా, కంప్యూటర్ కేంద్రాలుగా, కార్పొరేట్ కాలేజీలు, స్కూళ్ళు, భవనాలుగా మారిపోతున్నాయి.

దానా దీనా సెంటర్ బిజీగా మారిపోయింది గానీ గోపి బిజినెస్ డల్ అయిపోయింది. సూపర్‌బజార్ ఒక్క కుదుపు కుదిపితే ఫ్యాన్సీ షాపులూ బుక్‌స్టాల్సూ ఐస్‌క్రీం పార్లర్లూ పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లూ ఎత్తి కుదేశాయని చెప్పాలి.

అమ్మకాలు తగ్గిపోయేసరికి సరుకు తగ్గించేశాడు. వెరైటీ తగ్గేసరికి అమ్మకాలు మరింత తగ్గిపోయాయి. కేవలం పాల అమ్మకం బాగుండటమే కాదు చాలా పెరిగింది. టెలిఫోన్ రాబడి ఫరవాలేదు. కేవలం ఆ రెండే అతడ్ని ఆమాత్రమైనా నిలబెట్టాయి.

అద్దె, కరెంటు బిల్లులు పోను పెద్దగా మిగల్టంలేదు. శేర్‌కి వడ్డీ చెల్లించడానికి నానా తంటాలూ పడాల్సొస్తుంది. ఇక అప్పు ఎప్పటికీ తీర్చలేనేమోన్న భయం పట్టుకుంది. దాంతో ఇతర ఆదాయ మార్గాలకోసం అన్వేషణలో పడ్డాడు.

"గోపీ బాబూ!" వచ్చాడు మల్లయ్య.

"బర్బాత్ అయిపోయాను బాబూ. నువ్వే నన్ను రక్షించాలి!" చేతులు జోడించి ఏడ్చేశాడు.

ధైర్యం చెప్పేక జరిగిందంతా చెప్పేడు.

మల్లయ్య కోదండరెడ్డి ఇంట్లో సగం వాటా కొన్నాడు. కాని మొత్తం ఇల్లు శేర్‌కి తాకట్టు పెట్టి అప్పు తీసుకున్నాడు కోదండరెడ్డి. అప్పు తీర్చలేదని వేలం నోటీసిచ్చాడు శేర్. తీర్చగల శక్తి కోదండరెడ్డికి లేదు. అతడి భార్య కేన్సర్ పేషెంటు. అతడికి ఈ ఇల్లూ, ఇంకో ఇంటిస్థలం తప్ప ఏమీ లేవు. అతడి సంపాదన భార్య ట్రీట్‌మెంట్‌కే చాలదు.

రెడ్డినీ మల్లయ్యనీ తీసుకుని శేర్ ఇంటి కెళ్ళాడు గోపి.

గోపీ కాలనీ లీడర్‌గా ఎదుగుతున్న సంగతి అతడికి తెలుసు. అతడ్తో గొడవ పడడం వ్యాపారానికి నష్టమని తెలుసు.

సంగతంతా విని "మొదట తనఖా నాకు పెట్టేడు. ఇల్లు సేల్ చేస్తా. పైసలు మిగిల్తే ఇచ్చేస్తా. అతడ్నీ అతడ్నీ చూసుకోమను"

"మీరు చెప్పింది నిజమే. కాని మీకు తనఖా పెట్టిన సంగతి తెలీక సగం ఇల్లు కొనుక్కున్నాడు మల్లయ్య. అతడి పరిస్థితి కూడా ఆలోచించాలి కదా"

"మోసం చేసిన పుండాకోర్ వీడు. వీడి మీద క్రిమినల్ కేసు బనాయిస్తే సరి"

"రెడ్డి నెత్తిమీద జుట్టు వుంటే అలా చెయ్యొచ్చు! అతడి పరిస్థితి- పిట్టని కొట్టా పొయ్యిలో పెట్టా అనేలా ఉంది. నేనో మార్గం ఆలోచించాను..."

గోపి మాటలకి ఏవిటన్నట్లు చూశాడు శేర్. ఆసరికే అతడి ముఖం ఎర్రగా కంది పోయింది. పిల్లకాకి దగ్గర పాఠాలు నేర్చుకోవడమా అన్న భావన ఉందందులో.

"రెడ్డికి రెండొందల గజాల స్థలం ఉంది. లక్షా ముప్ఫై నలభై వేలు ఖరీదు చేస్తుంది"

"ఇంకేం, అది సేల్‌చేసి ఇతడికిమ్మను"

"అలా చెయ్యొచ్చుకానీ రేట్లు పెరిగినందున మల్లయ్య మళ్ళీ ఆ మాత్రపు ఇల్లు

కొనుక్కోలేదు. రెడ్డికి కూడా ఇల్లుండదు. అతడి భార్య రోగిష్టిది. వాళ్ళిద్దరికీ ఇల్లు లేకుండా చేసేకన్నా మీరే ఆ సైట్ తీసుకోవడం సబబుగా ఉంటుంది"

"నాకొద్దు. నాకు ఇల్లే కావాలి. దానికే రేటొస్తుంది"

"మీ ఇష్టం" అని లేచాడు గోపి. వెళ్ళబోతూ ఆగి అన్నాడు. "ఒక్క సంగతి. రెడ్డి కట్టిన ఇంటిస్థలం అతడిది కాదు. గవర్నమెంటుది. సంగతి ప్రభుత్వానికి చెప్పి ఒత్తిడి తెచ్చేమంటే మీకు ఇల్లూ దక్కదు, స్థలమూ దక్కదు"

శేర్ స్థాణువయ్యాడు. కలవరపడ్డాడు. ఆపైన ఒప్పేసుకున్నాడు.

మల్లయ్య, రెడ్డీ "మా ఇంటిని నిలబెట్టిన దేవుడివి" అని పొగిడేశారు గోపిని.




"మీరు తెలివైన వారు. బ్రహ్మాండమైన ఉద్యోగం సంపాదించేస్తారు" రజియాతో అన్నాడు గోపి.

"పరిస్థితి అనుకూలంగా లేదు. అంతకంతకూ టైట్ అవుతోంది. నిరుద్యోగుల సంఖ్య రెండు మూడు రెట్లు పెరిగింది. ఇక మాలాటివారి పని నిండుసున్నాయే!"

"ఏం? ఎంచేత? " ఆసక్తి ప్రదర్శించాడు.

"వీఆర్ఎస్! ప్రైవెటైజేషన్! కంప్యూటరైజేషన్! గ్లోబలైజేషన్!"

"ఇదివరకోసారేదో చెప్పేరు గానీ ఏమీ అర్థం కాలేదు. వివరించకూడదూ? "

"అయితే ఏం? లోకజ్ఞానం బాగా ఉంది. సరే, ఎక్స్‌ప్లెయిన్ చేస్తాను గానీ గురువు గారికేం దక్షిణ ఇస్తావు? " షాపులోకొచ్చి కూర్చుంటూ అంది రజియా.

బిస్కెట్ ప్యాకెట్ విప్పి పేపర్ ప్లేటులో పెట్టిచ్చాడు.

"థ్యాంక్స్. ప్రపంచ బ్యాంకూ ఇంటర్నేషనల్ మానిటరీ ఫండూ మన దేశానికి ముఖ్యంగా మన రాష్ట్రానికి అత్యధికంగా అప్పులిస్తోంది. అందుకని వాళ్ళు చాలా షరతులు విధిస్తున్నారు. అందులో ముఖ్యమైంది ప్రైవేటైజేషన్. అంటే ప్రభుత్వరంగ సంస్థల్ని పెట్టుబడిదారుల కప్పగించడం, వాటికి అత్యధిక లాభం వచ్చేందుకు గాను అన్ని సంస్థల్లోనూ అధికంగా ఉద్యోగులున్నారని చెప్పి ఉద్వాసన చెప్పమంటున్నారు. తక్కువ మందితో కంప్యూటర్ల సాయంతో ఎక్కువ పని చేయించుకోవాలని వారి ఆదేశం. అంచేత ప్రభుత్వరంగ సంస్థల్లోని చాలామంది ఉద్యోగుల్ని అతి త్వరలోనే ఇంటికి పంపేస్తారన్నమాట!"

కస్టమర్లు రావడంతో వారి సంభాషణ ఆగిపోయింది. షాపులో కూర్చున్న రజియా వంక అదోలా చూసి కావల్సినవి కొనుక్కుని వెళ్ళారు.

"మీ గురించి తెలుసుకోవాలనుంది చెప్పకూడదూ? అభ్యంతరం లేకపోతేనే" సంకోచిస్తూనే అన్నాడు.

"మా డాడీ గుంటూరు మున్సిపల్ ఆఫీసులో సూపర్‌వైజర్. సగం జీతం ఆయన పాన్‌కే ఖర్చవుతుంది. ఆయనకిద్దరు భార్యలు. ఎనిమిది మంది సంతానం. తీరని కోర్కెలు, చాలీచాలని దుస్తులు, ఆకలి చూపులు, విసుగుళ్ళు, కోపాలు... ఓహ్! అది నరకం!"

"మా నరకం కూడా నీకు తెలుసే"

"నరకం మీ స్వంతం కాదులే. మాకూ స్వర్గం నరకం అనే నమ్మకాలున్నాయి. నిజం చెప్పాలంటే బహుభార్యత్వం ఎక్క

## కొత్తగాలి...

**అధికారికి**
**జేబులు పట్టని జీతం**
**అన్నదాతకు**
**కడుపు నిండా కష్టం**

– జి.నరసింహమూర్తి,
హైదరాబాద్

డుంటే అదే నరకం. ఐ హేటిట్. నాకు మీ ఏకపత్నీవ్రతం నచ్చుతుంది"

అతడి కళ్ళు మెరిశాయి. అవకాశాన్ని వదలదలచలేదు. "అయితే హిందువుల బ్బాయిని పెళ్ళి చేసుకో" అన్నాడు

"చేసుకుంటాను. కాని నా గురించి మా మతం తీసుకుంటానంటేనే కష్టం"

"ఏం? "

"సవతిని నెత్తిమీదకి తేవచ్చుగా!" గట్టిగా నవ్వేసింది.

"నీ మాటల్ని మీ వాళ్ళు హర్షిస్తారా? "

"ఛాందసవాదులూ అభ్యుదయ వాదులూ అన్ని మతాల్లోనూ ఉన్నారు. యువతరం ఆలోచనల్లో, దృక్పథంలో చాలా మార్పు వచ్చిందిలే"

"నలభైమంది యువకుల్నిస్తే ఈ దేశపు రూపురేఖల్ని మార్చేస్తానన్నాడు వివేకానందుడు. యువశక్తి అంత గొప్పది!"

★ ★ ★

మహంకాళీ ఆమె కొడుకు సోంబాబూ టాక్సీలో వచ్చారు.

సోంబాబు రివటలా ఉన్నాడు. ఎడతెరిపి లేకుండా మాట్లాడుతున్నాడు. తనకి తెలీని సంగతులు ఈ భూ ప్రపంచంలో ఎక్కడా లేనట్టుగా కబుర్లు గుప్పిస్తున్నాడు.

ఏం పని చేస్తావన్న ప్రశ్నకి మాత్రం సూటిగా సమాధానం ఇవ్వలేదు.

అతడి మాటల్ని బట్టి సిటీలో అతడు చెయ్యని పనిలేదు. రాని విద్య లేదు. అతడికి తెలీనివాళ్ళు అసలే లేరు.

ఎలాటి రాచకార్యాన్నైనా ఇట్టే చక్కబెట్టగలననీ ఏ పనైనా సరే బై హాత్ కా ఖేల్ అని చెప్పేడు.

కావలిస్తే గోపీకి రైల్వేలో ఉద్యోగం వేయిస్తానని కూడా అన్నాడు.

"హమ్మో ఇతగాడికెన్ని విద్యలు వచ్చో ఎంత పలుకుబడి ఉందో!" అనుకుంది కనకం. జనార్ధనంలా మేడ కడతాడనీ మల్లికని రాణిని చేస్తాడనీ విశ్వసించింది.

మల్లికకి హీరోలానే కనిపించాడతను.

"ఆలోచించుకుని కబురంపుతాం" సాగనంపుతూ అన్నాడు వెంకన్న.

"అతడ్ని చూస్తే ప్రయోజకుడిలా అన్పించట్లేదు నాన్నా" గోపి అన్నాడు.

"అసలలాటి వాళ్లదే లోకంరా. వాళ్ళే బోల్డు సంపాదించి మేడలూ మిద్దెలూ కడతారు. నీతి ధర్మం అంటూ కబుర్లు చెప్పే వాళ్లు హరిశ్చంద్రుడిలా అష్టకష్టాలు పడాల్సిందే. మీ నాన్న నీతికి కట్టుబడి అప్పు తీర్చినందుకు అయిన కాడికి వేసుకుని అంతా మింగేశాడు సుందరమూర్తి. అప్పు తీర్చడం నా వల్ల కాదు. ఏం చేసుకుంటావో చేసుకో- అని ఉంటే కోర్టుల చుట్టూ తిరగలేక కాళ్ళబేరానికొచ్చేవాడు. కనీసం నాన్నమ్మ పొలమైనా మిగిలేది!" కడుపులోని అక్కసు వెళ్లగ్రక్కింది కనకం.

"చాల్లే చెప్పొచ్చావ్. బాకీ ఎగ్గొట్టేస్తానంటే సరిపోతుందేవిటి? సుందరమూర్తి ఎంతకైనా తెగిస్తాడు. ఆయనేం గాజులు తొడుక్కుని వడ్డీ వ్యాపారం చేయట్లేదు. ఏవిటనుకున్నావో!" కోప్పడ్డాడు వెంకన్న.

"ఆస్తిపోయింది కదా ఇప్పుడు అన్నిటికీ తడుముకుంటూ బతకాల్సి వచ్చింది కదాని అమ్మ బాధ. అంతేగాని అమ్మకి సుందరమూర్తి గురించీ తెలుసు, శేట్ గురించీ తెలుసు. వాళ్ళని కాదంటే మనల్ని మనంగా బతకనివ్వరు "

గోపి మాటలకి ఆందోళన పడ్డాడు

వెంకన్న. "శేర్ ఏమైనా బెదిరించాడా"

"ఎలావోలా వడ్డీ ఇస్తున్నాగా ఊరుకుంటున్నాడు. కానీ వడ్డీ కట్టడం రోజురోజుకీ కష్టమవుతోంది. బిజినెస్సు బాగా దెబ్బ తింది. ఏం చెయ్యాలో పాలుపోవట్లేదు"

"ఏ ఉద్యోగమో చూసుకున్నా సరిపోయేది. అవాళ ఏవిటో వ్యాపారమంటూ పట్టు పట్టేవు. ఇంటా వంటా లేని వ్యాపారం!" ఆవేదనగా అన్నాడు తండ్రి.

"ఉద్యోగం చెయ్యటం మన ఇంటా వంటా ఉందేవిటి? నువ్వు చెయ్యట్లేదూ. ఏదైనా ఎప్పుడో అప్పుడు ఎవరో ఒకళ్ళు మొదలెట్టాల్సిందే. మొదట్లో లాభాలు రాలేదూ. పోటీ ఎక్కువయ్యేసరికి తట్టుకోలేకుండా ఉన్నాంగాని బిజినెస్‌లేక కాదు".

"నువ్వన్నదీ పాయింటే గాని చేతిలో డబ్బుంటే చెయ్యాలిగాని అప్పుచేసి చెయ్యకూడదురా. పాల పాకెట్ ఇవ్వడానికి అయిదింటికే లేచి కాలనీ అంతా తిరుగుతున్నావు. రాత్రి తొమ్మిదింటిదాకా షాపులోనే కూర్చుంటున్నావు. ఇంత కష్టపడి సంపాదించిన నాలుగు డబ్బులూ వడ్డీ పేరుతో శేర్ ముకాన కొడుతున్నావు. ఆయన బాగుకోసం వ్యాపారం చేస్తున్నట్టుందిగాని నీ కోసం చేస్తున్నట్టు లేదు!"

"ఏం చేస్తాం మరి బ్యాంకోళ్లని నమ్మి మోసపోయాం. వాళ్ళే గనుక తక్కువ వడ్డీకి అప్పిచ్చి ఉంటే ఈ పాటికి సగం అప్పు చులాగ్గా తీరిపోయేది!"

"ఎన్నునుకుంటే ఏం లాభం లేరా. అంతా ప్రారబ్ధం. అనుభవించక తప్పదు".

"ఎందుకు తప్పదు? లంచాలు మరిగిన ఇండస్ట్రీస్ డిపార్ట్‌మెంటు వాళ్లనీ అలసత్వంతో జనాన్ని పట్టించుకోని బ్యాంకువాళ్ళనీ నడిరోడ్డుమీద నిలబెట్టి నిలదీస్తే చచ్చినట్టు నాకు లోను ఇచ్చేవారు. నాలాటి ఎందరికో బంగారు భవిష్యత్తు వచ్చేది. అలా చేయకపోబట్టే, అవినీతిపరుల్ని అందలమెక్కించి హారతులిస్తున్నందునే తామేదో గొప్పవాళ్ళమైనట్టు, ఆకాశంమీంచి

## కొత్తగాలి...

**చినుకు**
**నవ్వితేనే**
**చిగురు**
**తొడిగేది**

– మోపూరు పెంచల నరసింహం, నెల్లూరు

స్పెషల్‌గా ఊడిపడినట్టు ప్రవర్తిస్తున్నారు. నాకే గనుక ఒక్కరోజు పాటు అధికారం ఇస్తేనా అన్నిరంగాల్లోనూ పాతుకుపోయిన అవినీతిపరుల్నందర్నీ వరుసగా నిలబెట్టి ఉరితీసేవాడ్ని!"

ఉద్రేకంతో ఊగిపోతున్న కొడుకుని చూసి దిమ్మెరపోయారు వెంకన్నా, కనకం. గుండెల్లో ఒక్కసారిగా వందల మృదంగాలు వాయించినట్లుగా మోగుతుంటే, "ఒరే ఒరే. ఆ మాటలేంట్రా. అంత ఆవేశం పనికిరాదొరేయ్. నెమ్మది మీద పనులు చక్కబెట్టుకోవాలి గాని ఇలా అయితే ఎలారా?" అన్నాడు వెంకన్న.

గోపి మాట్లాడలేదు. రగుల్తోన్న అగ్నిపర్వతంలా ఉండిపోయాడు.

"శుభమా అంటూ పెళ్ళి గురించి మాట్లాడుకొంటుంటే అప్పులూ అవినీతీ అంటూ ఆవేశపడతారేంటి ఖర్మా!"

"మళ్ళీ అప్పు చెయ్యందే పెళ్ళవుద్దంటి?" సూటిగా ప్రశ్నించాడు గోపి.

అవాక్కయింది కనకం. ఆ వెంటనే సర్దుకుంటూ "కట్నం వద్దంటున్నారుగా... పెళ్ళి ఖర్చుకి సర్దుకుంటే సరిపోతుంది. ఆడపిల్ల ఎప్పటికైనా ఆడపిల్లేగాని ఈడపిల్ల కాదు. ఇవాళ గాకపోయినా రేపైనా పెళ్ళి చేసి అత్తారింటికి పంపాల్సిందేనాయె. అదేదో ఇప్పుడు చేసేస్తే వేడిలో వేడి అప్పులో అప్పు!"

"ఆ సంబంధం చెయ్యాలనే నిశ్చయించు



కున్నావన్నమాట".

"అలాఅని కాదుగాని తెలిసిన సంబంధం. కట్నం ఎంతిచ్చినా సరే అంటున్నారు. ఇంతకంటే అనుకూలమైన సంబంధం ఎక్కడ తేగలం చెప్పు? నెల నెలా కడుతున్న చీటీ పాడేసి ఇరవైవేలు కట్నంగా ఇచ్చి అయిదారువేలతో తూతూమంత్రంగా పెళ్ళి జరిపించేద్దాం"

"శేర్ బాకీ తీర్చాలని కదా ఆ చీటీ కడు తోంది? "

"అవుననుకో కాని దానికన్నా ఇది ముఖ్యం కదా. ఈ బాధ్యత తీరిపోతే తర్వాత అప్పు తీర్చొచ్చు".

తీరని ఆశాభంగానికి లోనయ్యాడు గోపి. ఎలాగైనా సరే శేర్ అప్పు తీర్చెయ్యా లని లాభాన్ని వడ్డీ రూపేణ దోచిపెట్టకూ డదనీ అనుకున్నాడు. అలాటిదిప్పుడు...! అతడికి తెలీకుండానే కళ్ళు చెమ్మగిల్లాయి.

"చెల్లిని కనుక్కో, తనక్కూడా ఇష్టమైతే అలాగే కానియ్యి" అంటూ బయటికెళ్ళిపో యాడు గోపి.

★ ★ ★



శీను చదువుతున్న రెసిడెన్షియల్ కాలేజీ నగరానికో పక్కన ఉంది.

అయితేనేం కాలేజీ హాస్టలూ కలిసి విశాల ప్రాంగణంలో ఏర్పాటు చేశారు. చుట్టూ కాంపౌండ్ వాల్. లోపల చిన్న గార్డెన్. నాలుగంతస్తుల భవనాలు.

గేటు దగ్గర పావుగంట నిలబెట్టి ప్రశ్నించిగాని లోపలికి వెళ్ళనివ్వలేదు వెంకన్నని.

బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా ఒకరకమైన జైల్లో ఉంచినట్లుగా ఉన్నారు విద్యార్థులంతా.

ఆటలూ పాటలూ లేవు. ఎవరి ముఖాల్లోనూ ఆనందం, సరదా, సంబరాల్లాంటివి మచ్చుకి కూడా లేవు. వరండాలో, క్లాసు రూమ్‌లో, గార్డెన్లో, ఎక్కడ ఖాళీ ఉంటే అక్కడ కూర్చుని చదువుకుంటున్నారంతా. చేతిలో బెత్తాలతో కొందరు 'కాపలా' కాస్తూ మధ్య మధ్య హూంకరిస్తున్నారు.

జీవిత ఖైదీల్లా శిలువ మోస్తున్న బాల ఏసుల్లా అన్పించారు.

గుండెలు ద్రవించాయి.

రెండు మూడు వారాలకొక్కసారి ఆది

# దండోపాయమే మార్గం

పరాన్నజీవుల్లా బతికే స్వాములను పంతులుగారు తీవ్రంగా ఎగతాళి చేశారు. స్వాములకు సమర్పించాల్సిన చందా గురించి కామావధానులు, రామశాస్త్రులు పాత్రలచే ఇలా సంభాషింపజేశారు.




కామా: నీవు ఇంటిరూపాయ ఇచ్చినావు కావని ఈ మధ్య స్వాములవారు నిన్ను వెలివేస్తారని చెప్పుకొంటున్నారు. అది ఏ మైందిః

**రామ:** వెలీ లేదు గిలీ లేదు. డబ్బు గట్టిగా అడిగితే నేను ఏ సందులోనో పెట్టి చావగొడతానని తెలిసి స్వాములవారు డబ్బు అడగడం మానేశారు. అంతేకాకుండా నన్ను పిలిచి మంచిమాటలు చెప్పి భిక్షలయినప్పుడల్లా పిండి వంటలతో తమ పంక్తినే నాకు కూడా భోజనం పెట్టించినారు.

వారం నాడు శీనూయే ఇంటికొచ్చి ఒక్కపూట ఉండి వెళ్తున్నాడు. అంచేత కొడుకుని చూట్టానికి హాస్టల్‌కి రావాల్సిన అవసరం ఇంతదాకా రాలేదు వెంకన్నకి.

శీను అనగానే వార్డెన్ గుర్తించేశాడు.

"శ్రీనివాస్ మీ అబ్బాయా? వెరీగుడ్. వెరీ ఇంటెలిజెంట్. కామ్ గోయింగ్. తన పనేంటో తనేంటో అన్నట్టు ఉంటాడు. చదువు తప్ప ఇంకేమీ పట్టించుకోడు. అతడ్తో మాకెలాంటి ఇబ్బందీ లేదు. వెరీ గుడ్ బాయ్..."

"ఎలా చదువుతున్నాడండీ..."

"వెరీ ఫైన్. ర్యాంక్ ఖాయం. ఈ క్యాంపస్‌లో ఇరవైమందిదాకా ర్యాంకింగ్ స్టూడెంట్లున్నారు. వెరీ ఎకస్ట్రార్డినరీ. ఈసారి మా కాలేజీకి ర్యాంకుల పంట పండి తీరుతుంది. మా ఛైర్మన్ వెరీమచ్ కాన్ఫిడెంటుగా ఉన్నారు. మాకు స్పెషల్ బోనస్ ఖాయం" ఆనందపడ్తూ చెప్పేడు.

"ర్యాంకుల పంటేంటండి.... వ్యవసాయం చేస్తారా? "

పిచ్చోడ్ని చూసినట్టు చూశాడు వార్డెన్.

"ర్యాంకులంటే తెలీదూ? రాష్ట్రం మొత్తం మీద అన్ని కాలేజీల కన్నా మా కాలేజీ వాళ్ళు వెరీ వెరీ ఫస్టు రావడమన్నమాట. అవి ఎన్ని ఎక్కువొస్తే మా కాలేజీకంత పేరొస్తుంది. వేలాదిమంది ప్రతి ఏటా కొత్తగా చేరుతున్నందునే కదా, ఇయర్‌కి పది పదిహేను బ్రాంచీల చొప్పున కొత్తవి పెట్టేస్తోంది మా మేనేజ్‌మెంట్."

"ఒకవేళ రాకపోతేనండి..."

"రాకపోతే వచ్చినవాళ్ళని కొనేస్తాం. తిమ్మిని బమ్మిని చేసైనా సరే న్యూస్ పేపర్లో ర్యాంకర్ల ఫొటోలు వెయ్యాల్సిందే. టీవీలో పదే పదే చూపించాల్సిందే. ప్రచారం గొప్పగా లేకపోతే కొత్తవాళ్లని ఎట్రాక్ట్ చెయ్యడం వెరీ వెరీ డిఫికల్ట్"

అటూ ఇటూ చూసి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్నాక అన్నాడు వార్డెన్. "ట్రేడ్ సీక్రెట్లు చెప్పకూడదు గానీ క్రితంసారి ఫస్టుర్యాంకు నెల్లూరు కుర్రాడికొచ్చింది. అతడేదో వెరీ స్మాల్ కాలేజీలో చదివేడు. ఆ సంగతి తెలీగానే స్వయంగా మా ఛైర్మన్ వెళ్ళి అయిదు లక్షలకి అతడ్ని కొనేశాడు. మా దగ్గరే ఎంసెట్ కోచింగ్ తీసుకున్నాడని చెప్పించారు. అతడి ఫొటో పెద్దది ముద్రించారు. ఆ దెబ్బకి పదివేల మంది చేరిపోయారనుకో..."

అస్తమానూ చదువే అయితే బుర్రపాడవ్వుద్దేమో... ఆటా పాటా వుంటే..."

వింతజీవిని చూసినట్టు చూశాడు వార్డెన్.

"పిచ్చోడా! ఇవాళ్టి తారకమంత్రం ఏంటో తెలుసా? ఎంసెట్ బ్రహ్మః ఎంసెట్ విష్ణుః ఎంసెట్ దేవో మహేశ్వరః అర్థమ

య్యిందా? ఎంసెట్టే దేవుడన్నమాట. స్టూడెంట్లు ఎంసెట్ గురించే ఆలోచించాలి. ఎంసెట్ గాలే పీల్చాలి. ఎంసెట్ పుడ్డే తినాలి. నిద్రలో కూడా ఎంసెట్ కలలే కనాలి. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఆహార నిద్రాదులన్నీ వదిలేసి పూర్వం ఋషీశ్వరులు చేసినట్టు తపస్సు చేయాలి. ఎంసెట్టే వారి ఊపిరవ్వాలి. అప్పుడే ర్యాంకులొస్తాయి. స్టేట్ ర్యాంకులంటే మజాకా కాదు..."

"అవి రాకపోతే ఇంజనీర్లవ్వరాండీ"

"అవ్వొచ్చు. వాళ్ళంతా చెత్తకిందే లెక్క, ర్యాంకర్లు వజ్రాలైతే మిగతావాళ్ళు గాజు ముక్కలు. మాకు కొన్ని వజ్రాలు దొరికితే సవాలక్ష గాజుముక్కలు డబ్బు సంచుల్తో వస్తాయి. నీకిదంతా అర్థంకాదులే. నీకు తెలీదు గనుక చెబుతున్నాను. మీ శ్రీనివాస్‌కి ఊరికే తిండి పెడ్తూ ఊరికే చదువు చెబుతున్నాం. ఎందుకూ? ర్యాంకొస్తుందని, ర్యాంకు రాలేదనుకో వేస్ట్. అంతా వేస్ట్, మా డబ్బు వేస్ట్ వాడి శ్రమ వేస్ట్, వాడి లైఫూ వేస్టే!"

వెంకన్న గుండెలు కీచుగా అరిచాయి.

"అక్క పెళ్ళి కుదిరిందిరా, వచ్చేవారమే పెళ్ళి, నిన్ను తీసుకెళ్దామనొచ్చాను" శ్రీనుతో అన్నాడు.

వినకూడనిదేదో విన్నట్టు ఉలిక్కిపడ్డాడు వార్డెన్.

"వారం రోజులా? నోనో కుదర్దు, మా ఛైర్మన్ వెరీ స్ట్రిక్టు. తెలిసిందంటే నా ఉద్యోగం ఊడబీకేస్తారు. పెళ్ళిరోజునా స్త్రాళ్ళే. మహా అయితే ఇంకో రోజు ఉంచుకోండి. అంతే అంతకుమించి అడగొద్దు. అడిగినా పంపను. చెప్పేనుగా. ఎంసెట్ అంటే తపస్సు. గంట కూడా వేస్టు చెయ్యకూడదు. కాన్సంట్రేషన్ దెబ్బతింటే ర్యాంకులకి దెబ్బొస్తుంది..."

మరి మాట్లాడలేకపోయాడు వెంకన్న. "పెళ్ళి టైంకి వద్దువు గాన్లేరా" అని శీనుకి చెప్పి వచ్చేశాడు.




కాలనీలోని కొత్త గుడిలో మల్లిక సోంబాబుల వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది.

అవి లేవు, ఇవి బాగాలేవు, మర్యాదలు జరగలేదంటూ ప్రతిదానికీ సాగదీసింది మహంకాళి.

"వెంకన్నకి గుండెల మీంచి కుంపటి దిగిపోయినట్టుగా వుంది. తల్లిని తలచుకొని కళ్ళు తుడుచుకున్నాడు.

పట్నంవాడు అల్లుడుగా లభించాడని మురిసిపోయింది కనకం.

రజియా పెళ్లి కూతురు పక్కనే కూర్చుని పెళ్లి తంతు యావత్తూ పరిశీలనగా చూసింది.

శోభనపురాత్రి సోంబాబు మల్లికతో అన్నాడు. "నాది యమలక్కీ జాతకం. అందుకే సినిమా స్టార్లాంటి నువ్వు నా పెళ్లానివయ్యావు. నిన్ను శ్రీదేవి అమ్మ బాబుని చేస్తాను చూడు!"

మరుసటి నెలలోనే కాపురానికి తీసుకెళ్ళిపోయాడు.

★ ★ ★

ఫ్యాక్టరీలోని అందరి ముఖాల్లో ఆందోళన కొట్టొచ్చినట్టు కనబడటం చూసి విస్తుబోయాడు, ఏం జరిగిందో అర్థంకాలేదు.

ఒకరు కాదు ఇద్దరు కాదు మొత్తం ఫ్యాక్టరీ కార్మికులంతా అలాగే ఉన్నారు.

ఉపద్రవమేదో రాబోతోందనిపించి భయ

పడ్డాడు.

"అంతా అదోలా ఉన్నారేం? " అదు ర్తోన్న గుండెల్తో అడిగాడు వెంకన్న.

"చాలా ఘోరం జరగబోతోంది. వరల్డ్ బ్యాంక్ మన సంస్థలాంటి ప్రభుత్వరంగ సంస్థలన్నిట్నీ ప్రైవేటుపరం చెయ్యాలని కంకణం కట్టుకుంది"

"ఎందుకని? "

"మల్టీనేషనల్ కంపెనీలకీ బడా వ్యాపారులకీ లాభాలొచ్చిపడ్తాయని. మన సంస్థలాంటివి నష్టాల్లో నడవడానికి కారణం మన అలసత్వం, మన పురాతన పద్ధతులు, మనకి నైపుణ్యం లేకపోవడమూ నట. మేనేజ్‌మెంటు బాధ్యత తక్కువట. వాళ్ళంతా పవిత్రులేనట. తప్పంతా కార్మికులదేనంటా. అందుకని నష్టాల్లో నడుస్తోన్న సంస్థల మీద తీవ్రమైన చర్య తీసుకుంటుందిట ప్రభుత్వం!"

"అంటే ఏం చేస్తుంది? "

"మన సంస్థని మొత్తంగా గాని, కొన్ని డివిజన్లుగా గాని విడదీసి ప్రైవేటు సంస్థలకి అమ్మేస్తారట. కొన్ని యూనిట్లని మూసేస్తారట. చాలామంది ఉద్యోగుల్ని తొలగిస్తారట"

"నిజవా! మనమేమైపోవాలి? !" గుండెల్లోంచి రైళ్ళు దూసుకుపోతోంటే కీచు గొంతుతో అడిగాడు.

"రోడ్డున పడటమే!"

కూలబడిపోయాడు వెంకన్న.

ఒకవేళ అతడు చెప్పినట్టే జరిగితే?

ఇల్లూ వాకిలీ పొలమూ పుట్రా అమ్ముకుని పల్లె వదిలిన నాటి స్థితి గుర్తొచ్చింది.

పల్లెలో బతకలేక గంపెడాశతో పట్నం వచ్చాడు. పట్నమూ దగా చేస్తే?

ఇంకెక్కడికి పోగలడు? సంసారాన్నెలా పోషించగలడు?

అప్పుడంటే బరువు మోసే పనైనా దొరికింది.

ఇప్పుడు- వయసు మళ్ళేక ఏం పని దొరుకుతుంది?

దుఃఖం పొంగి వచ్చింది.

శేఠ్ అప్పు తీర్చాలి. గోపి పెళ్లి చేయాలి. శీనుని చదివించాలి.

మల్లికకి పెళ్లంటూ చేశాడు గాని పండుగలూ పబ్బాలూ తద్దెలూ వాయినాలూ పురుళ్ళూ పుణ్యాలూ ఉండనే ఉన్నాయి.

ఇక తమ సంగతి సరేసరి. ఎప్పుడే రోగం కాటేస్తుందో ఎవరికీ తెలీదు!

"అరె భాయ్ క్యాహువా. అలా దిగాలు పడ్డావేం వెంకన్నా. లే హుషారు తెచ్చుకో" అన్నాడు షరీఫ్.

"కడుపుమీద కొడతారని భయం..."

"భయంతో చతికిలబడితే ఎలా చెప్పు. ప్రభుత్వ చర్యని నిరసించాలి. నిర్ణయం మార్చుకోమని నినదించాలి. ప్రభుత్వం దిగి వచ్చేలా ఉద్యమించాలి. పద..."

"ఎక్కడికి? !"

"నిరసన ప్రదర్శనకి. యూనియన్ పిలుపిచ్చింది. అన్ని యూనిట్ల వాళ్ళూ వస్తున్నారు. మెయిన్ ఆఫీసు ముందు నినాదాలివ్వడం ద్వారా మన నిరసన తెలియజేయబోతున్నాం"

తను ఒక్కడు కాదు. ఎందరో ఎందరెందరో ఉన్నారు. అందరి ఆకలీ ఒకటే. అందరి కోసం ఐక్యమై పోరాడాలి!

రణోత్సాహంతో కదిలాడు వెంకన్న.

★ ★ ★

వినాయకచవితి సందర్భంగా బస్తీలో భారీ వినాయక మూర్తిని నెలకొల్పాడు స్థానిక దాదా.

గణపతి నవరాత్రుల్ని ఆడంబరంగా జరపడానికి అన్ని ఏర్పాట్లూ చేశాడు.

దీన్ని ఒకరకమైన బలప్రదర్శనగా ఉపయోగించుకోవాలని అతడి ఎత్తుగడ. ఆ రకంగా ఆ ప్రాంతం మీద తన పట్టు పెంచుకోవాలని అతడి యోచన. ఉత్సవాలకిగాను దాదా అనుచరులు బలవంతంగా చందాలు వసూలు చెయ్యసాగారు.

గోపిని ఐదు వేలిమ్మన్నారు.

ఇవ్వలేనన్నాడు. భగవంతుడి కార్యంలో బలవంతం ఉండకూడదనీ ఎంతిస్తే అంత తీసుకోవాలనీ హితవు చెప్పేడు.

హేళన చేశారు. కోప్పడ్డారు. బెదిరించారు. అతడు లీడర్ కావాలనుకుంటున్నాడనీ అందుకే తమ మాట త్రోసి రాజంటున్నాడనీ దూషించారు. దాదాకి ఎదురు తిరిగితే పుట్టగతులుండవని హెచ్చరించారు. బచ్చావి బచ్చాగా ఉండకపోతే బలైపోతావన్నారు.

అయినా గోపీ లొంగకపోయేసరికి, "సమయం రాకపోదు. నీ అంతు చూడక పోము" అంటూ వెళ్ళిపోయారు.

చిన్న అవకాశం లభిస్తే చాలు జూలు విదిలించి పంజా విసుర్తారని అతడికి తెలుసు. అందుకే జాగ్రతగా ఉన్నాడు.

వినాయక దర్శనానికి జనం తండోపతండాలుగా వచ్చారు. ఆ ప్రాంతం చిన్న సైజు తీర్థం అయిపోయింది. రోజూ పూజలు జోరుగా సాగిపోతున్నాయి.

నిమజ్జనం అట్టహాసంగా చెయ్యడానికి భారీఏర్పాట్లు చేశారు దాదా అనుచరులు.

రకరకాల వేషాలు, భాజాలు, మందు గుండు సామాగ్రి.

ఊరేగింపు యావత్తూ దాదా ఊరేగింపులానే జరిగింది.

విగ్రహం ముందు చేతులు జోడించి నిలబడ్డాడు దాదా. పెద్ద బొట్టు పెట్టుకుని భక్తాగ్రేసరుడిలా కన్పిస్తున్నాడు. వినాయకుడి మీదే కాదు అతడి మీద కూడా పూల వర్షం కురిపిస్తున్నారు అనుచరులు.

జంట నగరాల్లోని వివిధ ప్రదేశాల నుంచి వేలాది వినాయక విగ్రహాలను తెచ్చి హుస్సేన్‌సాగర్లో నిమజ్జనం చేస్తున్నారు. రోడ్లన్నీ జనమయం అయ్యాయి. నగరమంతా పండుగ వాతావరణం, ఉత్సాహం నెలకొని ఉంది.

ఎలాంటి అవాంఛనీయ ఘటనలూ లేకుండా అంతా సవ్యంగా జరుగుతోందనీ పోలీసు అధికారులు ఊపిరి పీల్చుకోబోయారు. ఇంతలో ఒక్కసారిగా వైర్లెస్ మెస్సేజ్‌లొచ్చిపడ్డాయి.

ఓల్డ్ సిటీలోంచి వస్తోన్న గణపతి ఊరేగింపు మీద ఒక మసీదులోంచి కొందరు దుండగులు రాళ్ళ వర్షం కురిపించారుట. జనం ఎదురుదాడి చేశారట.

ఇరువర్గాల మధ్య సంకుల సమరం మొదలైందిట.

పుకార్ల గాలి వీత్తారు. సుడిగాలి మొలిచింది. నగరాన్ని విద్వేషపు ఝుంఝామారుతం చుట్టేసింది.

కత్తిపోట్లు! కాల్పులు! దోపిడీలు! దౌర్జన్యాలు! అల్లర్లు! హాహాకారాలు!

ఒక్కసారిగా మతోన్మాదం పడగ విప్పింది. దావానలంలా నగరాన్ని చుట్టేసింది. ప్రతీచోటా అరాచక శక్తులు విజృంభించాయి. గృహ దహనాలకీ దోపిడీలకీ పరమతస్తులపై దాడులకీ పాల్పడ్డారు.

కర్ఫ్యూ విధించారు. కన్పిస్తే కాల్చివేత ఉత్తర్వులిచ్చారు.

అయినా ఏదోచోట ఏదో ఘోరం జరుగుతూనే ఉంది.

ఇదే అదనుగా దాదా అనుచరులు జూలు విదిల్చారు. ముస్లిం కుటుంబాలపై తమ జులుం ప్రదర్శించసాగారు.

కాలనీలోని మహమ్మదీయ మతస్తులందరికీ రక్షణ కల్పించడానికి గోపి తదితర యువకులు సిద్ధపడ్డారు. వారికి హిందూ కుటుంబాల్లో ఆశ్రయమిచ్చారు.

షరీఫ్ కుటుంబం వెంకన్న ఇంట్లో తల దాచుకుంది.

"వందల ఏళ్ళనుంచి భాయీ భాయీ లెక్కన కలిసుంటున్నాం. అయినా అప్పుడప్పుడూ విద్వేషం రగుల్తూనే వుంది. విధ్వంసం జరుగుతూనే వుంది!" వాపోయాడు షరీఫ్.

ఇదే అదనుగా దాదా అనుచరులు గోపీ

షాపుని ధ్వంసం చేశారు. సరుకుల్నీ దోచుకుపోయారు!

వార్త తెలిసి వెంకన్న దంపతులు గుండెలు బాదుకుంటూ వెళ్ళారు.

సగం కాలిన శవంలా ఉన్న షాపుని చూసి లబో దిబో మన్నారు.

లోలోపల రగుల్తోన్న అగ్నిపర్వతంలా వున్నాడు గోపి.

★ ★ ★

పక్కింటి ఛాయాదేవి వెంట శకునానికి వెళ్ళింది కనకం.

వాళ్ళెళ్ళేసరికి ఆ ఇంట్లో పదిమంది వరకూ ఆడవాళ్ళు వచ్చివున్నారు. ఒక్కొక్కరిగా రాజేశ్వరిదేవి ఎదుటికెళ్ళి దణ్ణం పెడుతున్నారు. తమ భవిష్యత్తు గురించి ప్రశ్నించి జవాబులు తెలుసుకుంటున్నారు.

రాజేశ్వరీదేవికి నలభైఅయిదేళ్ళుంటాయి. పట్టుచీర కట్టుకుని రూపాయిబిళ్ళంత బొట్టు పెట్టుకుని జుట్టు విరబోసుకుని అమ్మవార్లా వుంది. పద్మాసనం వేసుక్కూర్చుంది. ఆమె పక్కనే పూజా మందిరం. మందిరంలో షిర్డిసాయి విగ్రహం.

ఆవిడ సాయి భక్తురాలు. ప్రతి గురువారం సాయంత్రంవేళ సాయి ఆమెకి కన్పిస్తారని, భవిష్యత్తు చెబుతారని నమ్మకం.

ఆ పనిమీదే వచ్చింది కనకం.

ఒకపక్క భర్త ఫ్యాక్టరీలో గొడవలు.

మరోప్రక్క చతికిలబడ్డ కొడుకు వ్యాపారం.

భవిష్యత్తు అగమ్యగోచరంగా వుండి భయం గొల్పుతోంటే భవిష్యత్తులో దాగున్న ఆశావహ స్థితిని తెలుసుకుని వూరట పొందాలనొచ్చింది.

కనకం వంతొచ్చింది.

ఏంచేయాలో ముందే వివరించి చెప్పింది ఛాయాదేవి.

కొనుక్కొచ్చిన రెండు యాపిల్సూ యాభై రూపాయల నోటూ రాజేశ్వరీదేవి ముందుంచి సాష్టాంగ నమస్కారం చేసింది. పిమ్మట చేతులు జోడించి భక్తితో కూర్చుంది కనకం.

ఆవిడ ఈమె నుదుటి రాతని చదువుతున్నట్టుగా తీక్షణంగా చూసి అంది "నువ్వు చాలా కష్టాల్లో వున్నావు..."

"అవును తల్లీ. ఇంటాయన నౌకరీ ఉంటుందో వూడుద్దో అని బెంగగా ఉంది. పెద్దకొడుకు దుకాణాన్ని మాయదారోళ్ళు తగలెట్టేశారు..." పమిటకొంగుతో ముక్కు తుడుచుకుంది.

"నా కంతా స్పష్టంగా కన్పిస్తోంది. జరగబోయేది కళ్ళకి కట్టినట్టు కన్పిస్తోంది..."

"నా సంసారం ఒడ్డున పడుతుందా తల్లీ? ఎంతో ఆశతో పట్నం వచ్చాం. మా బతుకులు బాగుపడతాయా? మా కలలు నెరవేరతాయా? "

కళ్ళు మూసుకుని తెరిచిందామె.

"ఇంకో ఆర్నెల్ల వరకూ నీ కష్టాలు తప్పవు. ఆ తర్వాత అంతా శుభమే జరుగుతుంది. మీ ఆయన్ని జాగ్రత్తగా వుండమను. ఉద్యోగం ఎక్కడికీ పోదు. నీ కొడుకుని సాయినాథుని పేరుమీద వ్యాపారం ప్రారంభించమను. ఈసారి పట్టిందల్లా బంగారమవుతుంది..."

"నా చెవుల్లో అమృతం పోశావు తల్లీ" ఆనందపడిపోయింది కనకం.

"తొందరపడకే పిచ్చిదానా... నీ కష్టాలక్కారణం మీ ఇంట్లో తిరుగుతోన్న గాలి రూపం. ఎప్పట్నుంచో ఆకలితో వుంది. మీరు దొరికారు. మీ మీద పడింది..."

"దెయ్యమంటావా తల్లీ? ఆ మధ్య పక్క పోర్షన్లో ముగ్గురు పురుగుల మందు తాగి చచ్చిపోయారు..."

"వారిలో ఒకరు దెయ్యమయ్యారు. మీరు సుఖంగా వుండటం సహించలేకుండా వుంది..."

"మరేది దారి తల్లీ? "

"వచ్చే గురువారం మళ్ళీరా. సాయినాథుని విగ్రహం పంచామృతాలతో శుద్ధిచేసి

## ఫిబ్రవరి -2010
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. ఎస్.ఎ.కరీం - తెనాలి, గుంటూరు జిల్లా
2. పి.వి.ఎస్. మణి - మంగళూరు, కర్ణాటక
3. డి.క్రాంతి - నూజివీడు, కృష్ణా జిల్లా
4. ఎం.సునీత - మలక్‌పేట, హైదరాబాద్
5. జంపని లక్ష్మీ గిరిజ - శివాజీపాలెం, విశాఖపట్నం



### సరైన జవాబులు

1. మ్యూజికల్ షాపు 2. హైదరాబాద్ 3. ఆత్మకథ 4. చిత్తిరపావై 5. జార్జి గిస్సింగ్ 6. కేథరిన్ 7. కృష్ణమూర్తి 8. బెజవాడ 9. రెని బ్రాబజాన్ రేమాండ్ 10. చిత్తరంజన్ దాస్

ఇస్తాను. ఇంట్లో వుంచుకో. గాలీ ధూళీ ఏదీ మీ జోలికి రాదు. నువ్వు కూడా అయిదు వారాలపాటు ప్రతి గురువారం ఉపవాసముండి సాయినాథుని పూజించు. కష్టాలు తీరి శుభాలు మొదలవుతాయి..."

"అలాగే తల్లీ నువ్వు చెప్పినట్టే చేస్తాను..." సాష్టాంగ నమస్కారం చేసింది కనకం.

"నువ్వన్నది నిజమే. ఆవిడకి భూత భవిష్యత్ వర్తమానాలన్నీ తెలుసు. నువ్వు తీసుకొచ్చినందున గాని లేకపోతే ఆ దెయ్యం మమ్మల్నే గతికి తీసుకెళ్ళేదో!" తిరిగి వెళ్తూ అంది కనకం.

"వచ్చేవారం సాయివిగ్రహం ఇస్తామన్నారు.. డబ్బివ్వాలా? "

"ఎవరి శక్తికొలదీ వాళ్ళిస్తారు. వెయ్యి నూటపదహార్లిస్తే కటాక్షించమని బాబాకి చెబుతుంది" తలాడించింది కనకం.

సరిగ్గా అదే సమయానికి శేర్ ముందు చేతులు కట్టుకుని నిలబడి వున్నారు వెంకన్నా గోపీ.

"ప్చ్ శానా బద్నామ్ అయ్యావే. ఇన్సూరెన్స్ కూడా చెయ్యలేదా. నువ్వెక్కడి అమాయకుడివిరా..." అన్నాడు శేర్.

పైకి సానుభూతి ఒలకబోస్తున్నా లోలోపల చాలా సంతోషంగా వుందతనికి. గోపి ఇప్పట్లో కోలుకోలేడు. తన అప్పు తీర్చలేడు. తన గుప్పిట్లోంచి తప్పించుకోలేడు. ఇక తనకంట్లో నలుసుగా, కాలిలో ముల్లులా మారలేడు. సరికదా తను ఆడించినట్లల్లా ఆడి తీరతాడు!

"మీరు పెద్ద మనస్సు చేసుకుని మళ్ళీ అప్పిస్తే వ్యాపారం ప్రారంభిస్తాడు..." అర్థింపుగా అన్నాడు వెంకన్న.

"నహీ నహీ. అట్లా కుదర్దు. బాకీ పూరాగా తీర్చందే మళ్ళీ అప్పు ఇవ్వం"

"పిల్లపెళ్లి వచ్చిపడిందిగాని లేకపోతే చీటీ సొమ్ముతో సగంఅప్పు తీర్చేసుందుం"

"మై క్యాకరూం భాయ్. పెళ్లి వస్తాది. చావు వస్తాది. బిడ్డ వస్తాది. చదువు వస్తాది. రోగం వస్తాది. నేనేం చెయ్యలేను. నా అప్పు ఎట్లా తీరుస్తారు? మిత్తి ఎట్లా కడతారు మొదట అది చెప్పు"

"తల తాకట్టుపెట్టి అయినా వడ్డీ

చెల్లిస్తాం శేర్"

ఎంత బతిమాలినా శేర్ లొంగడని గ్రహించాడు గోపి. వెళ్దామన్నట్టు చూశాడు తండ్రి వంక.

"పట్టి చేతుల్తో పంపేస్తారా? " దీనంగా అన్నాడు వెంకన్న.

"మేరా హాత్ మే కుచ్‌బీ నహీ. బాకీ తీర్చెయ్. మళ్ళీ పట్టుకుపో. బాత్ ఖతం"

విసురుగా వెనుదిరిగాడు గోపి.

నిట్టూర్చి వెంకన్న కూడా మడం తిప్పాడో లేదో వెనుక నుంచి శేర్ అరిచాడు "నెల నెలా వడ్డీ చెల్లు వేయాలి. లేకపోతే ఇజ్జత్ దక్కదు!"



16

ఎప్పుడూ బట్ట నలక్కుండా నవ్వు చెదరకుండా పూలరంగడిలా వుంటాడు సోంబాబు. ఏవేళ చూసినా అతడి జేబులో డబ్బుంటుంది. ఏమడిగినా సరే వెంటనే కొనేస్తాడు. సినిమాలకీ షికార్లకీ తీసుకెళ్తాడు. హోటళ్ళలో కొత్త రుచులూ చూపిస్తాడు. ఫ్యాషన్ దుస్తుల్నీ అందాన్ని పెంచే క్రీముల్నీ అడక్కుండానే తెచ్చేస్తాడు.

ఇదంతా చూసి మల్లిక మురిసిపోని రోజులేదు.

పిల్ల జమీందారిణిలా ఫీలవుతూ "రెండు చేతుల్తో సంపాదిస్తున్నారు. మీరేం చేస్తూంటారండీ" అడిగిందో రోజున.

"పిచ్చిదానా. ఎలా వచ్చినా ఎక్కడ్నుంచొచ్చినా డబ్బు డబ్బే. రూపాయల నోట్లన్నిటి మీదా రిజర్వుబ్యాంకు వారి ముద్ర వుంటుంది. మరంచేత ఇది పాపపు డబ్బు, ఇది పుణ్యపు డబ్బు అంటూ తేడాలేవీ వుండవు. డబ్బంతా ఒక్కటే. డబ్బే దేవుడు. పైసామే పరమాత్మాహై" అని నవ్వేశాడు.

అంతే తప్ప తన గురించి పిసరంత కూడా చెప్పలేదు.

సోంబాబు పేకాడతాడు. ఒక్కోసారి రేసులకెళ్తాడు. బ్రోకర్ పనీ చేస్తాడు. డాఫర్ పనీ చేస్తాడు. స్మగ్లింగూ చేస్తాడు. అదీ ఇదీ అని లేదు. డబ్బొచ్చేది ఏదైనా సరే చేస్తాడు. తప్పా ఒప్పా, మంచా చెడా అనెప్పుడూ తర్కించుకోడు.

"పని చెయ్యి పైసా జేబులో వెయ్యి" ఇదీ అతడి జీవన సూత్రం.

"నా జాజిమల్లీ రెడీయా" అడిగాడు సోంబాబు.

"రెడీయేనండీ" చీర సరిచేసుకుంటూ వచ్చింది మల్లిక.

"ఫ్యామిలీ టైపులా వున్నావు. మెడలో తాళిబొట్టెందుకు. దాన్ని తీసేయ్"

"మంగళసూత్రమండీ....." చెంపలేసుకుంటూ అంది.

"ఏ సూత్రమైనా సరే మనకడ్డొచ్చే ప్రమాదమున్నప్పుడు తీసి పక్కన పెట్టేయాలన్నదే ముఖ్యమైన సూత్రం"

"అది కాదండీ....."

"ష్.... ఇంకేం చెప్పొద్దు. తాళి కట్టింది నేనే కదా. నేనే తీసి జాగ్రత్త చేస్తాను. మళ్ళీ నేనే నీ మెడలో వేస్తాను, ఓకే? "

ఆమె మెడలోంచి తాళిని తీసి జేబులో వేసుకున్నాడు.

"ఈ క్షణం నుండి నువ్వు ఒకటో రకం కన్నెపిల్లలా వుండాలి. నువ్వేం భయపడకు. షో నేను మేనేజ్ చేస్తానుగా"

"నాకేవిటో భయంగా వుందండీ. అత్తయ్య ఏమంటారో"

"పైకి రావాల్సినవారు వాళ్ళేమంటారో

వీళ్ళేమంటారో అనెప్పుడూ ఆలోచించకూడదు. సిగ్గు, భయం, పిరికితనం అన్నీ మూటగట్టి చెత్త కుండీలో పారేసి ముందుకు దూసుకుపోవాలి. అప్పుడే టాప్‌కెళ్ళిపోగలం"

"అదికాదండీ...."

"ష్. చెప్పింది చెప్పినట్టు చెయ్యి. రాత్రికి రాత్రి గొప్పవాళ్లమైపోవాలి. కారు ఇల్లూ కొనుక్కోవాలి. ఓకేనా? "

తలాడించింది.

"అందుకు ఏకైకమార్గం అడ్డదార్లు. సో-అవే మన రాజమార్గాలు" నవ్వేడు.

సంకోచిస్తూనే అనుసరించింది.

ఆటో మీద ఓ సినిమా కంపెనీకి తీసు కెళ్ళాడు.

ఆమెని సిటవుట్‌లో కూర్చోబెట్టి ప్రొడ్యూసర్ రూంలోకి చొరబడ్డాడు.

ఆఫీసులో ఉన్న ముగ్గురూ అతడి వంక వింతగా చూశారు.

"నమస్కారం సార్. మన సినిమా ఎప్పుడు మొదలు పెడుతున్నారు సార్? " కుర్చీలో కూర్చుంటూ అన్నాడు సోంబాబు.

నువ్వెవరివన్నట్టు చూశాడతడు.

"నేనెవరూ, నా మొఖం ఎలా వుందీ ముఖ్యం కాదు సార్. సినిమా స్టార్ ఎలా వుందన్నది పాయింటు. ఫ్రెష్ స్టార్ సార్... ఒకసారి చూడండి. ఆ తర్వాత మీరే పిలిచి మరీ మాట్లాడతారు...."

మల్లికను పిలిచాడు. తడబడ్తూ చిరుచెమటలు కక్కుతూ లోపలికొచ్చి నమస్కరించింది మల్లిక.

ఆమెని ఎగాదిగా చూశాడు. టీనేజ్ వయస్సు యౌవనపు సొగసుల గుబాళింపూ అమాయకపు చూపులూ అతడ్ని ఆకట్టుకున్నాయి.

"ఏదో వేషం చూస్తాన్లే....."

"మీ నెక్ట్స్ పిక్చర్లో హీరోయిన్ సార్. వీరలెవెల్లో రెచ్చిపోతుంది. జనం గుమ్మెగుడి కట్టేయడం ఖాయం."

అతిగా వాగుతున్నట్టు చూశాడతడు. ఆ

**కొత్తగాలి...**

**చావంటే**
**భయం లేదు**
**పెరిగిన ధరలు చూచి**
**బతకాలంటేనే...**

**- అద్దేపల్లి భరత్‌కుమార్,**
చిలకలూరి పేట

చూపుల సారాంశం గ్రహించాడు సోంబాబు.

"ఫ్రె...ష్... కావాలంటే చెప్పండి. బయ్యర్లతో ప్రాబ్లం రానివ్వను. మనకి చాలా కనెక్షన్లున్నాయిలెండి....."

"హీరోయిన్ మోడర్న్‌గా వుండాలోయ్. సతీసావిత్రి టైపు అయితే కుర్రాళ్ళని ఎట్రాక్ట్ చెయ్యదు."

"మీ కుర్రటేస్టు తెల్సింది సార్. రేపు మోడర్న్‌గర్ల్‌ను తీసుకొస్తాన్సార్. గుర్తుంచుకోండి సార్. నా పేరు సోంబాబు..."

బయటికొచ్చేక అతడి చేతిని గట్టిగా పట్టుకుంది మల్లిక.

"నువ్వేం దిగులు పడకు. నిన్ను పెద్ద హీరోయిన్ని చేసి తీర్తాను. కార్లూ బంగళాలూ నౌకర్లూ ఆస్తులూ సుఖాలూ కావాలంటే డబ్బు కావాలి. ఆ డబ్బు సినీపరిశ్రమలో కట్టలకొద్దీ దొరుకుతుంది. డబ్బుకి డబ్బు, గ్లామర్‌కి గ్లామర్. అందుకే మన లక్ష్యం ఏనుగు కుంభస్థలం!"

"అతడి మాటలామెకి పూర్తిగా అర్థం కాలేదు. కాని సినిమా తారని చెయ్యాలనుకుంటున్నాడని మాత్రం అర్థమైంది. చెప్పలేనంత ఆనందం కలిగిందొక్కసారిగా.

కలలకి రెక్కలొచ్చాయి. ఊహలకి రంగులొచ్చాయి.

మల్లికను తీసుకుని ఫొటో స్టూడియో కెళ్లాడు.

దారిలో చిన్న ఉపవ్యాసం ఇచ్చాడు.

"బెజవాడ పిల్ల రంభ ఆలిండియా స్టార్ అయ్యింది. గుడివాడ అమ్మాయి రవళి ఒక ఊపు ఊపింది. జనాన్ని ఉర్రూతలూ గించిన సిల్కుస్మితది మన ఏలూరే తెలుసా? రాజమండ్రి అమ్మాయి జయ ప్రద ఎంపీ కూడా అయ్యింది. వాళ్ళని మించిపోవాలి నువ్వు. ఫొటోగ్రాఫర్ ఎలా ఫోజులిమ్మంటే అలా ఇవ్వు. వాళ్ళేమను కుంటారు. వీళ్ళే మనుకుంటారని ఆలోచిం చొద్దు. ఎలా ఉంటే జనం మెచ్చుకుంటారో అలా ఉండు. నగ్నమా అర్ధనగ్నమా అన్నది పాయింటు కాదు. చూడగానే లొట్ట లేసేలా ఉందా లేదా అన్నది ముఖ్యం. నీ బంగారు జీవితం. ఈ ఫొటో సెషన్స్ మీద ఆధారపడి ఉంది. జాగ్రత్త"

ఫొటో స్టూడియోలోకెళ్ళి "మేం రెడీ గురూ. నువ్వు సెట్ చేసుకో" అన్నాడు సోంబాబు.

మల్లికని ఎగాదిగా చూశాడు. హీరోయిన్ లక్షణాలు పుష్కలంగా కన్పిం చాయి. పైగా లేతపిల్ల.. కొత్త పరువాలు.

"సినిమా తార కావాలంటే దుస్తుల్తో బాటు అన్నీ వదిలేసెయ్యాలి" అదోలా నవ్వేడతడు.

ఆమె బెరుకుపోయేదాకా ఉత్తుత్తి ఫొటోలు తీశాడు. ఆమెను పట్టుకున్నాడు. తిప్పాడు. బొమ్మలా ఆడించాడు. ఆ తర్వాత రకరకాల డ్రెస్సులేసి రకరకాల యాంగిల్స్‌లో రకరకాల ఎక్స్‌ప్రెషన్స్‌తో ఫొటోలు తీశాడు.

మొదట్లో కంగారుపడ్డా తర్వాత సర్దుకు పోయింది. టీవీ యాడ్స్‌లోని మోడల్స్‌ని గుర్తు తెచ్చుకుంది. వాళ్ళని మించిపోవాలి చేతికందిన బంగారు అవకాశం చేజార్చుకో కూడదనుకుంది.

"నీ లుక్స్ బాగున్నాయి. ఫస్ట్ ఇంప్రె షన్ బాగుంది. ఇక లక్కూ బాగుండి తీరు తుంది. త్రిజాకీయమదర్శనమైనట్టే" పొంగి పోతూ అన్నాడు సోంబాబు.

"అంటే ఏవిటండీ"

"అండీగిండీ వదిలేసెయ్. కాన్వెంట్ ఇంగ్లీషు దంచి పారెయ్యాలి. ఏమీ తెలీక పోయినా అంతా తెలిసినట్టు ఒక్క ముక్కా అర్ధంగాకపోయినా యమగా అర్ధమైనట్టు ప్రవర్తించాలి. నువ్వేం కంగారుపడకు. ఇంగ్లీషు స్పీకింగులో కోచింగ్ ఇప్పిస్తాను. మోడల్స్‌కి ఇచ్చే ట్రైనింగూ ఇప్పిస్తాను..."

"మీరు చాలా గొప్పవారు. నా కోసం ఎన్ని ప్లాన్లేస్తున్నారూ" అభిమానంగా చూస్తూ అంది.

"నీ కోసం కాదు మన కోసం. ఇంకో సంగతి. పొరబాటున కూడా నీకు పెళ్లై నట్టు మూడో కంటి వాడిక్కూడా తెలీకూ డదు. నువ్విప్పుడు పెళ్లికాని కన్నెపిల్లవి"

ఆశ్చర్యబోవటం ఆమె వంతయ్యింది!

"నేన్చెప్పేది సీరియస్‌గా విను. రాత్రికి మొన్న కలిసిన ప్రొడ్యూసర్ గెస్ట్‌హౌస్ కెళుతున్నాం"

కలవరపడింది.

"రాత్రెందుకూ ఇప్పుడే వెళ్దాం"

"దొంగ పనులు రాత్రుళ్ళే చెయ్యాలి. అతడు చాలా పెద్ద ప్రొడ్యూసర్లే. స్వంత డబ్బుతో సినిమా తీసే రకం. ప్రొడక్షన్ కంపెనీ కోసమే గాక తనకోసం కూడా ఆ గెస్ట్ హౌస్ అద్దెకు తీసుకున్నాడు. రాత్రికి అతడెలా బిహేవ్ చేసినా అడ్డు చెప్పొద్దు..."

"భయంగా ఉందండీ..."

"ఇలా చెయ్యి అని నేను చెబుతున్న ప్పుడు భయమెందుకే పిచ్చిదానా. బతక నేర్చదలిచిన వాళ్ళు మొట్టమొదటిగా వదిలే యాల్సింది సిగ్గు. అయితే ఆ వెంటనే వదిలి పెట్టాల్సింది భయాన్ని!"

బేలగా చూసింది. ఆమె చేయినొక్కి ధైర్యం ఇచ్చేడు.

"ఇందులో తప్పు, పాపం ఏమీ లేవు మల్లికా. మన దగ్గర ఉన్నది అమ్ముకుంటు న్నామంతే. అమ్మకం తప్పుకాదు. వ్యాపార

సూత్రం. నాలుగు నిమిషాలు కళ్ళు మూసుకుంటే లక్షలొచ్చిపడతాయి. కన్ను మూసి కన్ను తెరిచేలోగా కళ్లుతిరిగేంత సంపదకి అధిపతులైపోతాం. పిచ్చి సెంటిమెంట్లు పెట్టుకోవడం అనవసరం. అన్నింటికీ నేనున్నా. చెప్పినట్టు చెయ్యి చాలు" అంటూ ఆమె బ్రెయిన్ వాష్ చేశాడు.

మెల్ల మెల్లగా ఆమె ఆలోచనా ధోరణి మారింది. అతడి దారి కొచ్చేసింది.

ఆ సాయంత్రం ప్రొడ్యూసర్ గెస్ట్‌హౌస్ కెళ్ళారిద్దరూ. కావాలనే ఆలస్యంగా వెళ్ళారు. బాయ్ తప్ప ఎవ్వర్లేరు.

"నమస్కారం సార్? మోడర్న్ సరుకు తెచ్చాను..." అన్నాడు ప్రొడ్యూసర్తో.

"ఇప్పుడా? పూజలో కూర్చునే వేళయ్యింది మరి" ఇబ్బందిగా చూశాడతను.

"ఏ పూజ చేసినా మీ ఇష్టం"

"ఆ... ఆహా... తీసుకురా చూద్దాం. ఫీల్డ్‌లోకి నిన్నగాక మొన్న వచ్చిన గుంటలు కూడా రేటు పెంచేశారు. కాల్షీట్లిమ్మంటే నీల్గుతున్నారు. కొత్తమ్మాయిని పరిచయం చేస్తే బెటరనుకుంటున్నాను.."

"స్టార్ మేకర్ మీరు తలచుకుంటే ఒక్క పిక్చర్తో టాప్ హీరోయిన్ని చెయ్యగలరు"

మల్లికని బ్యూటీపార్లర్లో మేకప్ చేయించి మరీ తీసుకొచ్చాడు.

ఆమె కట్టూ బొట్టూ చూపూ నడకా వయ్యారం అన్నీ మారాయి. క్రితం రోజున చూసిన అమ్మాయే ఈ అమ్మాయంటే నమ్మలేనట్టుగా ఉంది.

మినీ స్కర్ట్ ధరించి ఎత్తుల్నీ పల్లాల్నీ ప్రస్ఫుటంగా ప్రదర్శిస్తూ మగతనాన్ని ఛాలెంజ్ చేస్తోంటే ప్రొడ్యూసర్ ఫ్లాట్ అయిపోయాడు.

"కమాన్ కమాన్. ఒక పెగ్ వేసుకుందాం రా..." ఆమె చెయ్యి పట్టుకుని లాగి పక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"ఆయన చెప్పినట్టు విను. ఓ గంటలో వస్తాను" అంటూ వెళ్లాడు సోంబాబు.

తాగుతూ ఆమె అందాన్ని పొగుడ్తూ

> **కొత్తగాలి...**
>
> **దూడకు**
> **గరిక చన్ను**
> **నోటికిచ్చి**
> **తరించే తల్లి**
> **ధరణి**
>
> **– ఆచార్య కొలకలూరి ఇనాక్, హైదరాబాద్**

ఆమెని గొప్ప తారని చేస్తానని శపథాలు చేస్తూ ఆమెని కౌగిట్లోకి తీసుకున్నాడు ప్రొడ్యూసర్. మొదట ఏదో తెలీని సంశయంతో ముడుచుకుపోయినా తర్వాత అతడి కోర్కెకి ఆజ్యం పోసింది మల్లిక!

★ ★ ★

"నేను మళ్ళీ వ్యాపారం చెయ్యదలచుకోలేదు" ఒక నిశ్చయానికొచ్చినట్టుగా చెప్పేడు గోపి.

"అంటే ఏవన్నమాట? బాబా వాక్కు వృథా అవుద్దంటావా? "

"నీదంతా పిచ్చి నమ్మకం అమ్మా. ఆవిడకి బాబా పూనకమూ ఒట్టిదే, భవిష్యత్తు చెప్పడమూ ఒట్టిదే. అవన్నీ కూటికోసం వేసే వేషాలు. అలాటి శకునాల్ని నమ్ముకుంటే అయినట్టే"

అతడు హేళనగా నవ్వేసరికి ఉడుకుమోత్తనం వచ్చేసింది కనకానికి.

"నీకు నమ్మకం లేకపోతే నమ్మకం లేనట్టుండుగాని అలా మాట్లాడకొరేయ్. ఇప్పటికే కష్టాల్లో కూరుకుపోయి ఉన్నాం!"

భార్య మాటలకి "సరి సరే. ఏదైనా ఉద్యోగం చేస్తానంటావా? యూనియన్ లీడర్లకీ షరీఫ్‌కీ చెప్పనా.. ఖాళీలుంటే హెల్ప్ చేస్తారు" అన్నాడు వెంకన్న.

"అదే మంచిది. అన్ని పరిశ్రమల్లోనూ ఎన్‌క్వైరీ చేస్తాను. ఎక్కడో అక్కడ దొరక్కపోదు. నా గురించి గాకపోయినా శేర్‌కి వడ్డీ కట్టటానికి ఉద్యోగం అత్యవసరం"

బయటికి నడిచాడు గోపి. కాళ్ళు తిన్నగా షాప్ దగ్గరికి తీసుకెళ్ళాయి.

దాన్ని చక్కగా అలంకరించి అందులో ఇంటర్నెట్ సెంటర్ ప్రారంభించారు. చాటింగ్ కొచ్చిన యువతీ యువకుల్తో కిటకిలాడుతోంది.

గోపి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

షాపు బిజినెస్ తగ్గుముఖం పట్టగానే రజియా అంది "ఇహ ఇక్కడ ప్రొవిజన్స్ షాపు లాభం లేదు. వ్యాపారం అంతకంతకీ డౌనౌతుంది తప్ప పెరగదు. లేటెస్ట్ క్రేజ్ బ్రౌజింగ్ సెంటర్. నాలుగైదు కంప్యూటర్లు, కొద్దిగా ఫర్నీచరూ, ఇంటర్నెట్ కనెక్షనూ ఉంటే చాలు మంచి బిజినెస్ జరుగుతుంది. ఆలోచించి చూడు"

ఆమె ఆలోచన నచ్చినా కంప్యూటర్ల గురించి పరిజ్ఞానం లేనందున సాహసించలేకపోయాడు.

నిట్టూర్చి కదలబోతోంటే రోడ్డుకవతలి బోర్డు అతడి దృష్టిలో పడింది.

అమెరికన్ పిజ్జా! ఆ పేరు పక్కనే చారలూ చుక్కల అమెరికా జెండా బొమ్మ!

షాపు ముందు తెల్లని మోటారు సైకిళ్ళూ వాటి వెనుక ఎర్రని పెట్టెలూ ఉన్నాయి. పక్కనే బోర్డు మీద ఓ ఫోన్ నెంబరిచ్చి 'ఫోన్‌చేసిన అరగంటలో ఉచిత డెలివరీ ఇవ్వబడును' అని రాసి ఉంది.

రంగు రంగుల విద్యుత్కాంతుల మధ్య మెరిసిపోతున్న ఆ పిజ్జా కార్నర్ నిండా జనమే. బైక్స్ మీద, కార్లలో వస్తున్నారు జనం! ఏదో గుర్తొచ్చి తిరుపతి చాట్ బండార్ని దెబ్బతీసిన బేకరీవంక చూశాడు. కష్టమర్లులేక వెల వెలబోతుందది!

రజియా మాటలు చెవుల్లో ప్రతిధ్వనించాయి.

"మల్టీనేషనల్ కంపెనీలనే రాబందులు రెక్కలు చాస్తున్నాయి!"

★ ★ ★

సెల్‌ఫోన్ మోగగా గబుక్కునందుకున్నాడు సోంబాబు.

ఎక్సర్‌సైజులు చేస్తున్న మల్లిక ఆగి అతడి వంక చూసింది.

లైన్లో ప్రొడ్యూసర్.

"ముంబాయి ట్రిప్ వేశానోయ్, మల్లిక ఖాళీయే కదా? "

"ఫస్ట్ ప్రయారిటీ మీకే సార్, ఖాళీ చేసుకుంటుంది"

"తీసుకురా. ఫ్లయిట్ టిక్కెట్లు తెప్పిస్తా"

"ఒన్ అవర్లో మీ ముందు వాలతాం. వెరి నైసాఫ్ యూ సార్..."

"ఆయనేనా? " మల్లిక అడిగింది.

తనని వాడుకోవడమే తప్ప లిఫ్టిస్తాడో లేదోనని అనుమానంగా ఉందామెకి. 'ఇదిగో సినిమా ఎనౌన్స్ చేసేస్తున్నాను. హీరోయిన్‌గా నీ పేరు ప్రకటించేస్తాను' అంటూ ముహూర్తాలు పెడతాడు తప్ప క్రియ శూన్యం!

"బొంబాయి వెళ్దామంటున్నాడు. బహుశా హిందీ సినిమా ప్లాన్ చేస్తున్నాడేమో. సొమ్ములున్నాయిలే. మన రొట్టె విరిగి నేతిలో పడబోతోంది గాని త్వరగా రెడీ అవ్వు..."

అరగంటలో ఇద్దరూ రెడీ అయ్యి గెస్ట్ హౌస్ కెళ్ళారు.

చొరవగా ప్రొడ్యూసర్ రూంలోకెళ్ళబోతే "లోపల డైరెక్టర్‌తో స్టోరీ డిస్కషన్లో ఉన్నారు. పది నిమిషాలదాకా ఎవర్నీ పంపించొద్దన్నారు" అన్నాడు బోయ్.

అరగంటకి డైరెక్టర్ బయటికొచ్చాడు.

"హలో సార్. మా కజిన్ మల్లిక మీ ఆశీర్వాదం కావాలి" అన్నాడు సోంబాబు.

మల్లిక గబుక్కున ముందుకొచ్చి పాదాభివందనం చేసింది.

ఆమెని తేరిపార చూశాడు. "ఫొటో ఇవ్వండి. అవకాశముంటే చూస్తాను"

నాలుగు రకాల ఫొటోలున్న కవర్ని అతి వినయంగా అందిచ్చాడు.

అతడెళ్ళాక ప్రొడ్యూసర్ గదిలో కెళ్ళారు.

"మల్లిక పేరు బాగోలేదు. సినిమావాళ్ళ సెంటిమెంట్లు మీకు తెలుసు కదా. బన్సీ లాల్ జుమానీని కన్సల్ట్ చేసి కలిసొచ్చే పేరు పెడదామని ముంబాయి ట్రిప్ వేశా. జుమాని గురించి తెలుసుకదా? ప్రముఖ న్యూమరాలజిస్టు. ఎందరో సినిమావాళ్ళ పేర్ల స్పెల్లింగ్ మార్చి హిట్ యాక్టర్లుగా చేసేశాడు"

"ఓకే సార్ సంఖ్యాశాస్త్రమూ జ్యోతిశ్శాస్త్రమూ అన్నీ సంప్రదిద్దాం. మీకు మల్లికకీ కూడా మరపురాని హిట్టివ్వాలి..."

"పన్లో పనిగా గోవా వెళ్ళి లోకేషన్లు చూసొస్తాం. మాకథ సగం పైనే గోవాలో జరుగుతుంది. యూత్‌కి పట్టే రొమాంటిక్ ఫిల్మ్ కదా. మల్లిక జాతకం మారిపోవడం ఖాయం. ఫలానా ప్రొడ్యూసర్ నన్ను టాలీవుడ్‌కి పరిచయం చేశారని పత్రికలకి ఇంటర్వ్యూలిచ్చే రోజు ఆర్నెల్లలో వస్తుంది చూడు..."

"అంతా మీదయ. మీరే మా పాలిట దేవుడు. ఎలాంటి వరాలిచ్చినా సరే..." సోంబాబు ప్రొడ్యూసర్నీ మల్లికనీ ఎయిర్ పోర్టుకి పంపి బార్‌కెళ్ళి బాగా తాగేశాడు.




**బి**స్కెట్ల ఫ్యాక్టరీలో కూలీ మేస్త్రీగా ఉద్యోగం వచ్చింది గోపీకి.

"చూశావా చూశావా సాయినాథుడు ఎంత చక్కని మార్గం చూపించాడో, నేన్చెబితే నమ్మలేదు. ఇప్పుడేమంటావు గోపి?" వార్త వింటూనే అడిగేసింది కనకం.

తనేదో గొప్ప విజయం సాధించినట్టుగా వుందామెకి.

కంపెనీ నుంచి వెంకన్న రాగానే అతడి నోట్లో ఇంత పంచదార పోసి తీపి వార్తని చెవిన వేసింది కనకం.

"మా కంపెనీ పరిస్థితేమీ బావుండలేదురా గోపి. ఏ క్షణంలోనైనా మమ్మల్ని మెడబట్టి గెంటేయొచ్చు. నువ్వు జాగ్రత్తగా పనిచేసి మంచిపేరు తెచ్చుకోరా. మేమంతా నీ సంపాదన మీదే ఆధారపడాల్సిన రోజు వస్తుందేమో!"

కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు వెంకన్న.

"ఇప్పుడేమైంది నాన్నా. మీరనవసరంగా భయపడకండి. వేలమంది పనిచేసే పరిశ్రమని మూసెయ్యడం అంత తేలిక్కాదు"

"పొమ్మన లేక పొగబెడ్తార్రా"

"వాలంటరీ రిటైర్మెంట్ పెడుతున్నారా?"

అవునంటూ తలాడించాడు వెంకన్న.

"అవసరాన్ని మించి ఉద్యోగులున్నార్ట. ఉద్యోగుల జీతభత్యాల వల్లే నష్టాలొస్తున్నాయిట్రా. అందుకని ఈ రకంగా కొందర్ని బయిటికి పంపేస్తారట" విషాద స్వరంతో చెప్పేడు.

"వెళ్ళకుండా వుండిపోయిన వాళ్ళపని బాగానే వుంటుంది కదండి. మీరుండిపోదురుగానీ" కనకం అంది.

"మిగిలిపోయిన వాళ్ళకి ప్రమోషన్లొస్తాయంటున్నారు కొందరు. అదేం కాదు ఇద్దరి పని ఒక్కరిచేత చేయిస్తారంటున్నారు ఇంకొందరు. అదీ ఇదీ కాదు చిప్ప చేతికిచ్చి తన్ని తగలేస్తారని భయపెడుతున్నారు మరికొందరు"

"మీ కంపెనీ సర్కారోడిదే కదా. వాడి దగ్గర డబ్బుంది కదా. వాడికదేం పోయేకాలం?" బాధగా ప్రశ్నించింది కనకం.

"వాడి పుర్రెకి పుట్టిన బుద్ధి కాదిది. వరల్డ్ బ్యాంక్‌ది" అన్నాడు గోపి రజియా మాటల్ని గుర్తు తెచ్చుకుంటూ.

# త్యాగరాజు - ఆనందభైరవి

అనగనగా నిజం

త్యాగరాజు కాలంలో బొమ్మలాటవాళ్ల బృందం తిరువైయ్యారులో ప్రతి రోజూ ప్రదర్శనలు ఇచ్చేది. ఆ బృందంలోని సంగీతకారుడు త్రిభువనం స్వామినాథ అయ్యర్ ఆనందభైరవి రాగాలాపన ప్రజలకు ప్రత్యేక ఆకర్షణ. త్యాగరాజుగారి శిష్యులు ఆ అయ్యర్ ప్రతిభ గురించి గురువుగారికి చెప్పారు. త్యాగరాజు ఒకరాత్రి రహస్యంగా వెళ్లి అయ్యర్ గానం విన్నారు. అతని రాగాలాపనతో ముగ్ధులై జనసమూహంలో దారిచేసుకుంటూ నటుడి దగ్గరికి వెళ్లే ప్రయత్నం చేశారు. అతనిని చూసిన జనం దారి ఇచ్చారు. త్యాగరాజు తన వైపు వస్తుండటం చూసిన అయ్యర్ వేదిక దిగి, 'త్యాగరాజస్వామీ, మీరున్న విషయం గమనించక ఆనందభైరవి రాగాలాపన చేస్తానని అధిక ప్రసంగం చేశాను. మన్నించండి' అంటూ కాళ్లమీద పడ్డాడు.



'నా శిష్యులు నీ రాగాలాపన గూర్చి గొప్పగా చెబితే వచ్చాను. నిజంగా చాలా బాగుంది. నేను ఆనందించాను. శిష్యులు చెప్పడం మంచిదయింది' అన్నారాయన.

'మిమ్ము ఒక వరం కోరాలని వుంది.'

'నీ కోరిక తప్పక తీరుస్తాను.'

'స్వామీ. సంగీతంలో రాగాలన్నీ మీ నాలుకమీదే ఉన్నాయి. నాకు ఒకే రాగం ఆనందభైరవి తెలుసు. ఆ రాగం నాకు వదలి పెట్టండి. మీరు దానిని మరచిపొండి.'

'సరే. అలాగే కానీ.'

త్యాగరాజస్వామి ఆనందభైరవి రాగంలో కృతులను ఆనాటి నుంచి రచించలేదు.

"వాడెవడు చెప్పడానికి? "

"వాడు సర్కస్‌లోని రింగ్ మాస్టర్లాంటివాడు. ఎలాంటి జంతువైనా సరే అతడాడించినట్లు ఆడాల్సిందే. సర్కస్ ఫీట్లు చెయ్యాల్సిందే"

"వాడికి పదిచేతులూ ఇరవై కొమ్ములూ ముప్పై కోరలూ వున్నాయేవిట్రా నాకు తెలీకడుగుతాను? "

"అవేమి లేవమ్మా కాని అంతకన్నా పవర్‌ఫుల్ ఆయుధం వుంది. దాని పేరు అప్పు. ఒకప్పుడు ఇతర రాజ్యాల్నీ దేశాల్నీ కబళించడానికి యుద్ధాలు చెయ్యాల్సొచ్చేది. ఇప్పుడలాంటివేం చెయ్యక్కర్లేదు. ఆ దేశాలకి ఇబ్బడి ముబ్బడిగా అప్పులిస్తే చాలు. మనవాళ్ళే దేశాన్ని బంగారుపళ్ళెంలో పెట్టి మరీ అప్పగించేస్తారు. లేదా ఏం చెయ్యమంటే అది, ఎలా చెయ్యమంటే అలా చేస్తారు. తమ ఉనికిని అస్థిత్వాన్ని సమర్పించుకుంటారు. అవసరమైతే తమకితామే సంకెళ్ళు వేసుకుని బానిసలుగా మారిపోతారు!"

"చదువెలా వుందిరా శీనూ. ఎక్కువ స్ట్రెయిన్ అవుతున్నావా? చాలా నీరసంగా వున్నావు. కళ్ళు లోతుకుపోయాయి" ఇంటికొచ్చిన తమ్ముడి పక్కన కూర్చుని అడిగాడు గోపి.

"ఫైనల్ పరీక్షలకింక నాలుగు నెలలే ఉన్నాయి. ఆ తర్వాత ఎమ్సెట్!"

నిజానికతడికి చాలా టెన్షన్‌గా వుంది. ఉద్వేగంగా వుంది. ఉత్కంఠగా వుంది.

కాలేజి మేనేజ్‌మెంటూ, లెక్చరర్లూ, స్టూడెంట్లూ అంతా కూడా అతడికి ర్యాంక్ వచ్చితీరుతుందని ఆశిస్తున్నారు. అతడికీ నమ్మకంగానే వుంది.

కర్మకాలి ర్యాంక్ రాకపోతే? అంతా ఏమంటారు? ఎలా చూస్తారు?

ఆ సంగతి గుర్తొస్తే చాలు నిద్రరాదు. అర్ధరాత్రి సైతంలేచి కూర్చుని పుస్తకం తెరుస్తాడు. విపరీతమైన ఒత్తిడికి లోన వుతూ తనలో తాను కుంగిపోతున్నాడు!

అన్న మాటతో కళ్ళు చెమ్మగిల్లగా "కొంచెం ఎక్కువగా కష్టపడుతున్నాను. ఇంటెన్సివ్ కోచింగ్ అన్నయ్యా" అన్నాడు.

"అలా అని ర్యాంకే ముఖ్యం అనుకో కురా. అది రాకపోతే బతుకే లేదనుకోకు. చదువులు బతుకులో ఓ భాగం. అవే బతుక్కాదు. అంతటితో బతుకు ఆగి పోదు. మన విద్యావిధానం బతకడం నేర్పడం లేదురా.. చావడం, చంపడం నేర్పుతున్నాయి!" ఆవేదన పడ్డాడు.

"ఇంజనీరవ్వాలనుందన్నయ్యా!"

అన్న మాటలు పట్టించుకోకుండా అన్నాడు.

"తప్పకుండా అవుతావు. నిన్ను నేను చదివిస్తాను" ఉద్వేగంతో ఊగిపోతూ తమ్ముడ్ని గుండెలకి హత్తుకున్నాడు.

"నువ్వు గొప్ప ఇంజనీరువి కావాల్రా. కాటన్ దొరలా, విశ్వేశ్వరయ్యలా చరిత్రలో మిగిలిపోవాలి. లోకానికి అన్నం పెట్టే రైతు శ్రమ ఫలించేలా ప్రాజెక్టులు నిర్మిం చాల్రా. పేదలకోసం తక్కువ ఖర్చుతో ఇళ్ళు నిర్మించాల్రా. జనం నిన్నో దేవుడిలా భావించాల్రా..."

"నీ మాటలెప్పుడూ మర్చిపోను అన్నయ్యా"

"ఇంకో ముఖ్యమైన సంగతి. నీకు పది వేల దాకా ఏ ర్యాంకు వచ్చినా, మంచి ఇంజనీరింగ్ కాలేజీలో సీటు వస్తుందిట. రజియా చెప్పింది. దాని కోసం నువ్వు రాత్రీ పగలూ తపస్సు చెయ్యక్కర్లేదు. నిశ్చల మనస్సుతో చదివి రాస్తే చాలు.."

"కాని... కాలేజీ వాళ్ళు మొదటి పది ర్యాంకుల్లో రావాలనీ..."

"అందుకనీ ఖర్చు భరించి చదివిస్తు న్నారు. పందెంకోడిని మేపినట్టు మేపుతు న్నారు. వాళ్ళక్కావాల్సింది గెలుపు. ఆ గెలుపులోనే వారి లాభాలూ దాగివు న్నాయి. వారి వ్యాపార సంస్కృతిని అర్థం చేసుకోరా. గెలిచిన కోడి ఒళ్ళంతా గాయమై ఎందుకూ పనికి రాకుండా పోవచ్చు గాక యజమాని కది అనవ సరం. గెలుపు ఒక్కటీ చాలతడికి. అందుకే ఓడిపోయిన కోడిని అక్కడికక్కడే చంపేస్తారు తెలుసా?"

ఒక్కసారిగా అందరి గుండెలూ బరువె క్కగా భయం భయంగా చూశారు ఇంటి ల్లిపాదీ. ఒక్కరి ముఖంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు!

★ ★ ★

రజియా ఒంటరిగా వెళ్తోంటే గబగబా వెళ్ళి కలిశాడు గోపి.

"బొత్తిగా నల్లపూసై పోయావు."

నవ్వింది.

అందులో మెరుపుల్లేవు. విషాదమే!

"ఏవయ్యింది నీకు? నువ్వింత ముభా వంగా వుండటం నేనెప్పుడూ చూళ్ళేదు"

"నాకూ నీతో ఎన్నో చెప్పుకోవాలనీ ఎన్నెన్నో మాట్లాడుకోవాలనీ వుంది. కానేం చెప్పలేకపోతున్నాను. చెబుదామని నోరు తెరిస్తే ఏడుపొచ్చేస్తోంది" కళ్లు, ముక్కు తుడుచుకుంది.

"నిన్నింత బేలగా చూడటం ఇదే ప్రథమం. అసలేం జరిగింది?"

"నాకు చక్కని జీతం వచ్చే ఉద్యోగం రాకపోవడమే నా పాలిట శాపమైంది"

"నీకేవిటి మొత్తం యువతకే దిక్కుతోచ కుండా ఉంది"

"అందునా ఆడపిల్లయితే ఇంట్లోనూ నరకం చవిచూడాల్సొస్తుంది. అంతా పెత్తనం చేసేవారే కదా! ఇరవైఒకటో శతా బ్దంలో కూడా ఆడదాన్ని స్వంతాస్తిగా, పని మనిషిగా చూడడం దారుణం కదూ?"

"ఇప్పుడేమయ్యిందనీ అలా మాట్లాడుతు న్నావు? నాకు చెప్పకూడదా?"

"నీకన్నా ఎవరున్నారు చెప్పుకోడానికి!"

"అయితే పద. అలా పార్కులోకెళ్ళి మాట్లాడుకుందాం."

పార్కు అన్నబోర్డు తప్ప మొక్కలేం లేవు. అందులోకెళ్ళి గడ్డిలో చతికిలబడ్డారు.

"అబ్బాజాన్ వచ్చారు"

"ఒక్కనాడూ కన్పించలేదే"

"తాయిబా ఇంటికి రాలేదు. బంధువులింట్లో దిగారు. నేనూ అక్కడే వుంటున్నా వారం రోజుల్నుంచి."

"షరీఫ్ అంకుల్ తన తమ్ముడే కదా. అన్నగారింట్లో వుండకుండా ఎక్కడో వుండటం ఏమిటి?"

"ఇద్దరికీ పడదు. ఉత్తర దక్షిణ ధ్రువాలు. ప్రతి పనీ నీతిగా నిజాయితీగా చెయ్యాలనీ పరోపకారం, దైవభక్తి ముఖ్యమంటారు తాయిబా. అబ్బాజాన్ అందుకు పూర్తి భిన్నంగా ప్రవర్తిస్తారు."

"చూస్తున్నాగా. షరీఫ్ అంకుల్ నిజంగా షరీఫ్ ఆద్మీ. మానవతకి మారు పేరు"

"ఎగ్జాక్ట్‌లీ. మా అబ్బాజాన్ హార్ట్‌లోని ఓ వాల్వ్‌లో ఏదో లోపముందిట. ఆపరేషన్ చేయించాలిట. లక్షదాకా ఖర్చవుతుంది, తెచ్చివ్వు అంటూ పీకలమీద కూర్చున్నారు."

"ఇన్నేళ్ళ నుండి ఉద్యోగం చేస్తున్న ఆయనేమీ దాచలేదు గాని చిరుద్యోగం చేసే నువ్వు తెచ్చివ్వాలా? చాలా బాగుంది. ఆ మహానుభావుడోసారి కన్పిస్తే బావుద్ను నమస్కారం చేద్దును!"

"ఆడపిల్లని కదా. ఎలాగైనా డబ్బు సంపాదించగలనని ఆయన ధీమా"

"రజియా!"

"విలువల వలువలెప్పుడో ఊడిపో

## కొత్తగాలి...

**అమ్మ**
**క్యారీ బ్యాగు**
**నాన్న**
**క్యాష్ బ్యాగు**

**- ఎ.పద్మప్రియ, హైదరాబాద్**

యాయి. డబ్బు! అదొక్కటే ముఖ్యమూ సత్యమూ అయిపోయింది. భూమి సూర్యుని చుట్టూ కాదు, డబ్బు చుట్టూ తిరుగుతోంది. డబ్బు ముందు బంధాలూ సంబంధాలూ మంచీ చెడూ నీతి అవినీతి ఏమీ కన్పించట్లేదు. ఆ గుండె జబ్బు కూడా అబద్ధమేమోనని నా అనుమానం!"

అతడు పెదవి కొరుక్కున్నాడు. "డబ్బు మూటకోసం ముసలి అరబ్ షేక్‌ని పెళ్లి చేసుకోమంటున్నాడా? "

"ఇదివరకైతే అలాగే అనేవాడు. వృద్ధ షేక్‌లకు పసిబాలికలను ఇచ్చి ఎందరు నిఖా చెయ్యలేదు గనుక! ప్రభుత్వం చట్టాన్ని సవరించి కట్టుదిట్టం చెయ్యడంతో ఆ దారి మూసుకుపోయింది. అందుకని నన్ను ఖాదీమాగా పంపిస్తానంటున్నారు.

"అంటే? "

"ఖాదీమా అంటే సేవకురాలని అర్థం. పెట్రోలు డబ్బు దండిగా గల అరబ్ షేకులు తమ పని తాము చేసుకోలేరు కదా. అందుకని వారికి సేవ చేయడానికి ఖాదీమాలని తీసుకెళ్తున్నారు. అందుకు పెద్ద మొత్తాలలో డబ్బు ముట్టజెబుతున్నారు."

"దారుణం! మదించిన అరబ్ షేక్‌ల వికృత వాంచలు, చేష్టల గురించి తెలీనిదెవరికి? సేవకుల పేరుతో తీసుకెళ్ళి బానిసలుగా మార్చుకుంటారు. ప్లీజ్ రజియా. నువ్వా సుడిగుండంలో చిక్కుకోవద్దు" ఆమె చేతులు పట్టుకుని ఆర్తిగా అన్నాడు.

"చిక్కుకోకూడదనే నా ప్రయత్నం, పోరాటం. చూద్దాం ఏం జరుగుతుందో" లేస్తూ అందామె.

"అందుకు చేయూత కావాలంటే నేనెప్పుడూ సిద్ధమే రజియా. మర్చిపోవద్దు."

ఆమె కళ్ళలో కన్నీటి అల బద్దలైంది.

"థ్యాంక్యూ దోస్త్"

★ ★ ★

మల్లిక కుమారి మల్లికారాణి అయ్యింది. సోంబాబు ఆమె మేనమావ కమ్ సెక్రటరీ అవతారమెత్తాడు.

మహంకాళి పనిమనిషైంది.

విశాలమైన ఇంట్లోకి మారారు. సెల్ ఫోన్ వచ్చింది. కాలు బయట పెట్టాలంటే టాక్సీ పిలుస్తున్నారు. మల్లిక ఫోటోలు అన్ని పత్రికల్లోనూ ప్రముఖంగా వచ్చాయి. తెలుగు తెరకి సరికొత్త సోయగాల రమణీమణి అంటూ వర్ణించాయి కూడా.

హీరోయిన్‌వి నువ్వేనన్న ప్రొడ్యూసర్ కడకామెకి హీరో స్నేహితురాలిగా చిన్న వేషం ఇచ్చాడు.

కొత్త హీరోతో ప్రారంభమైన యూత్‌ఫుల్ లవ్‌స్టోరీలో హీరోయిన్‌గా కూడా బుక్కయింది.

కుర్రాళ్ళని వెర్రెత్తించే డ్రెస్సులో కనువిందు చేయబోతోందా సినిమాలో. అది ఆమె సినీకెరీర్‌కి 'టేకాఫ్' అని భావిస్తున్నారు మల్లికా సోంబాబూ.

చెన్నైలో ఇటీవలే షూటింగు మొదలైన తమిళ చిత్రంలో కూడా నటిస్తోంది. అది విడుదలయ్యాక శృంగారదేవతగా పేరొచ్చి తీరుతుందని ధీమాగా వున్నారు.

మల్లికలో చాలా మార్పొచ్చింది.

గల గలా నవ్వుతోంది. ఆగకుండా కబుర్లు చెబుతోంది. బ్యూటీ టిప్స్ మీద లెక్చరిస్తోంది. ఐశ్వర్యంలో పుట్టి పెరిగిందాన్లా ప్రవర్తిస్తోంది.

కలల్ని నిజం చేసుకుంటున్న అదృష్టవంతురాలు ఈ భూప్రపంచం మీద తనొక్కతే అనుకొంటోంది.

అతిత్వరలో ఆంధ్రుల అభిమాన నటి అవుతుందనీ కోట్లకి పడగలెత్తుతుందనీ ఇంద్రభోగాలను అనుభవిస్తుందనీ రంగుల కలలు కంటోంది.

ఆమెకి వంతపాడుతున్నాడు సోంబాబు.

చిత్రంగా ఒక్కనాడూ తల్లిదండ్రులు, అన్నదమ్ములు ఆమెకి గుర్తు రావట్లేదు!

★ ★ ★

వాలంటరీ రిటైర్మెంట్ స్కీంని కంపెనీలో ప్రవేశపెట్టేరు.

వెంకన్న వణికిపోయాడు.

"ఇష్టమైనవాళ్లు అప్లై చేసుకుని ఉద్యోగం వదిలి పోవచ్చు. మిగిలిన వాళ్ళకేం ఫర్లేదు" అని నచ్చ చెప్పారు మిత్రులు.

అయినా అతడి ఆందోళన తగ్గలేదు.

"ఉద్యోగులెక్కువగా వున్నారంటున్నారు కదా. ఈ స్కీంలో ఎక్కువమంది వెళ్లక పోతే బలవంతాన కొందర్ని తొలగిస్తారు కదా. అప్పుడు ఆఖరాఖర్లో చేరిన నా బోటి వాళ్లకి ముప్పురాదూ? " అని ప్రశ్నించాడు.

అతడి భయం ఒట్టి భయమేనని చెప్ప లేకపోయారు.

ప్రతి కార్మికుడి గుండెలోనూ భయం గంటల చప్పుడు! అభద్రతా ప్రకంపనలు!

షరీఫ్ మాత్రం ఉత్సాహంగానే ఉన్నాడు. వీఆరెస్ తీసుకుంటే మూడు లక్షల వరకూ వస్తుందతడికి. "ఒక లక్షతో భార్యతో కలిసి హజ్ యాత్ర కెళ్తాను. మిగతా దాన్ని బ్యాంకులో వేసి వడ్డీతింటూ చిన్నదో చితకదో నౌకరీ చూసుకుంటాను" అంటున్నాడు.

"ఈ అవకాశం తప్పితే మక్కా వెళ్ళ లేను. నా జీవిత లక్ష్యం నెరవేరదు. తర్వాత ఏమైపోయినా సరే ముందు హజ్ కెళ్ళొస్తాం" అంటూ వీఆర్ఎస్‌కి అప్లై చేసేశాడు.

★ ★ ★

గోపి కొన్ని సినిమా పత్రికలు తెచ్చి తల్లి ముందు విసిరి కొట్టాడు.

రకరకాల ఫ్యాషన్ దుస్తుల్లో అర్ధనగ్నంగా ఫోజులిచ్చింది మల్లిక. ఆమె ఇంటర్వ్యూ కూడా ప్రచురించారు.

"ఈ అమ్మాయి మన మల్లికేనంటావ్రా? " అపనమ్మకంగా అడిగింది.

వెంకన్న గబుక్కునొచ్చి చూసి తల పట్టుకున్నాడు.

"ఛీ సిగ్గూ ఎగ్గూ లేకుండా బజారుదాన్లా బరితెగిస్తుందా!" అంది కనకం. కన్నీళ్ళు ఉబికివచ్చాయి.

"నువ్వే ఏదోటి చెయ్యరా గోపి. మీ నాన్న కాళ్ళూ చేతులూ ఆడటం లేదు"

"ఇప్పుడు ఎవరం ఏమీ చెయ్యలేం"

"ఏం"

"మెట్లమీద జారిన చెంబు ఎక్కడికి దొర్లి పోతుందో ఎవరికి తెలుసు? !"

గోపి బయటికెళ్లిపోయాడు.

"నా పెంపకంలో ఏదో లోపముందండీ. అందుకే అది అలా తయారయింది"

పమిట చెంగులో కళ్ళొత్తుకుంది కనకం.

"ఇది నీ తప్పూ నా తప్పూ కాదే. పరిస రాలలాంటివి. వాటి ప్రభావం అలాటిది. లక్షకొకరు వెండితెర మీద ప్రకాశిస్తారు. ఆ ఒక్కరూ తామే అవుతామని లక్షలాది మంది దీపం చుట్టూ శలభాల్లా చేరతారు. గోపి అన్నట్టు వాళ్లేమవుతారో.. వాళ్ళ బతుకులు ఎక్కడ ఎలా ముగుస్తాయో ఆ భగవంతుడికి తెలియాలి!"

## 18

**లం**చ్ టైం.

కబుర్లు చెప్పుకుంటూ ఇంటి నుంచి తెచ్చుకున్నది తిని టీ తాగటానికి కేంటీన్ కెళ్ళాడు వెంకన్న.

పేపర్ చదువుతూ కన్పించాడు యూనియన్ లీడర్.

"నమస్తే. పేపర్ విశేషాలేంటి భాయ్"

పలకరించి పక్కన కూర్చుంటూ అన్నాడు.

"రైతులకి కష్టకాలం వచ్చేసింది. ధాన్యం కొనేవాళ్ళు లేరుట"

అపనమ్మకంగా చూశాడు. "అదేవిటి? తినే గింజలు కొనేవాళ్ళు లేరా? "

"లేరు గనుకే గగ్గోలు పెడుతున్నారు. రైస్ మిల్లర్లు కొనడం లేదుట. ఫుడ్ కార్పొరేషన్ వాళ్లు అంతా కొనలేమని చేతులెత్తేశారు. వాళ్ళమీద ఒత్తిడి తేవడానికి ముఖ్యమంత్రి ప్రయత్నిస్తున్నార్ట..."

తల తిరుగుతున్నట్టనిపించింది.

"చాలా చిత్రంగా ఉందే. ఆరుగాలం కష్టించి పనిచేసి ధాన్యం పండిస్తే అవి కొనేవాళ్ళు కరువయ్యారా? అసలే సరైన ధర లేక అలమటిస్తోంటే ఇప్పుడేకంగా కొనేవాళ్ళే లేకుండాపోయారు. ఇంక రైతు బతికేదెలా? " వేదనగా అన్నాడు.

చెమ్మగిల్లిన అతడి కళ్ళని చూసి చలించిపోయాడతడు.

"ప్రభుత్వ విధానాలు అందరికీ గొడ్డలి పెట్టులానే ఉంటున్నాయి వెంకన్నా. ముందు ముందు మరింత దారుణమైన కాలం రాబోతోంది. ప్రపంచీకరణ సరళీకరణ పేరుతో 'గ్యాట్'కి రాజముద్ర వేసింది మన ప్రభుత్వం. దాంతో అంతర్జాతీయ సంస్థలు ఒక్కో వస్తువు మీదా పేటెంటు హక్కులు పొందుతున్నాయి. మన దేశంలో హిమాలయాల దగ్గర పుట్టిన బాసుమతి బియ్యం మీద అమెరికా సంస్థ హక్కుల్ని సాధించుకుంది. ఇక వారి అనుమతి లేకుండా ఎవరూ దాన్ని పండించడానికి లేదు. పసుపు, వేప పరిస్థితీ అంతే. మన గిరిజనులకు తెలిసిన వనమూలికల్నీ ఔషధ మొక్కల్నీ పట్టుకెళ్లి తమదంటూ హక్కు పొందటానికి కొన్ని బడా కంపెనీలు ప్రయత్నిస్తున్నాయి. కొన్నాళ్ళు పోతే వాటిని అనుమతి లేకుండా ఉపయోగించడం నేరమవుతుంది"

"ఇంక చెప్పకు భాయ్ వినలేను..." లేచి వెళ్ళిపోయాడు వెంకన్న.

★ ★ ★

అర్ధరాత్రివేళ తలుపు దబదబమని బాదేరెవరో గట్టిగా పిలుస్తూ.

గబుక్కునెళ్ళి తలుపు తీశాడు.

షరీఫ్ లోపలికొచ్చాడు. అతని ఆందోళన చూసి కంగారు పడ్డారంతా.

"ఏమయ్యింది భాయ్" అడిగాడు.

"మా రజియాకి ఆపదొచ్చిపడింది. మీరు రక్షిస్తారని అల్లామీద భారంవేసి వచ్చాను"

"ఏం జరిగింది అంకుల్. రజియాని రక్షించడానికి ప్రాణాలు సైతం ఇస్తాం" స్థిర స్వరంతో అన్నాడు గోపి.

అతడి వంక పుత్రవాత్సల్యంతో చూశాడు. అభినందన పూర్వకంగా చూస్తూ తల నిమిరాడు షరీఫ్.

"జీతే రహో బేటా... నీ మీద నాకూ రజియాకీ నమ్మకం ఉంది. అందుకనే అర్ధరాత్రి అయినా ధైర్యంగా వచ్చాను."

"అసలేం జరిగిందో చెప్పు" వెంకన్న మళ్ళీ అడిగాడు.

మంచినీళ్ళు తెచ్చిచ్చింది కనకం.

నీళ్ళు తాగి స్థిమితపడుతూ అన్నాడు. "అరబ్ షేక్‌తో రజియాని ఖాదీమాగా పంపించడానికి డబ్బు కూడా తీసుకున్నాడు నా చోటాభాయ్. నేను తిట్టాను. రజియా గొడవ చేసింది. కేవలం నర్సుగా సేవలందించడానికే అని నమ్మించారు. హోటల్లో ఉన్న షేక్ దగ్గరకి తీసుకెళ్ళారు. అక్కడ తడు రజియా మీద అత్యాచారం చెయ్యబోతే అతడ్ని కొట్టి వచ్చేసింది"

"కన్నతండ్రి డబ్బుకోసం కసాయిగా మారాడా!" వేదన పడ్డాడు వెంకన్న.

"వాళ్ళు పోలీసు కేసు పెట్టొచ్చని భయంగా ఉంది..."

"ఆమె మేజర్. ఎవరూ ఏం చెయ్యలేరు. ఇక్కడే ఉంచుకుంటాం, తీసుకురండి"

"ఒకరోజు కోసమో రెండ్రోజుల కోసమో

కాదు, జీవితాంతం మీ ఇంట్లో ఉండటానికి పంపిద్దామని ఉంది..." వారి ముఖాల్లో కదుల్తోన్న భావాలని చదవాలని ప్రయత్నిస్తూ అన్నాడు షరీఫ్.

"నీ మాటలు నాకు అర్థంగావట్లేదు. వివరంగా చెప్పు షరీఫ్..."

"రజియా అంటే మీ గోపీకి ఇష్టమని నాకు తెలుసు. రజియాకి కూడా గోపి అంటే ప్రేమ ఉందని చెప్పింది. వాళ్ళిద్దరికీ నిఖా జరిపిద్దామని ఉంది..."

ద్రమ్మానపడిపోయాడు వెంకన్న. చెంగుతో నోరు మూసుకుంది కనకం.

గోపి ధైర్యంగా నిశ్వసించి తండ్రి వంక చూశాడు. అతడి అభిప్రాయం తెలుసుకోవాలన్నట్టుగా..

"మీకు మాకూ వియ్యమా!" షాక్ నుండి తేరుకోలేకుండా ఉన్నాడు వెంకన్న. కలలో కూడా ఊహించని విషయమిది!

అసలే కూతురు పరువు తీస్తోందని మధనపడుతోంటే ఇప్పుడు కొడుకు కులభ్రష్టుడ్ని చేస్తాడా? !

"రజియా మంచి పిల్ల. మీకూ మీ ఇంటికీ మంచి పేరు తెస్తుంది. మీ ఇజ్జత్ కాపాడుతుంది. నన్ను నమ్ము భాయ్. రజియా నా బిడ్డే అనుకో వెంకన్నా. నీ కడుపులో వేసుకో" చేతులు జోడించాడు.

మాట్లాడలేకపోయాడు వెంకన్న. ఎటూ తేల్చుకోలేకుండా ఉన్నాడు.

ఒకపక్క సాయిబులతో సంబంధమా అన్న పీకులాట.

మరోపక్క పట్నంలో వేరూనటానిక్కారకుడైన షరీఫ్ అర్థింపు.

మతం, సంప్రదాయం, బంధువుల చూపులు వెనక్కి లాగసాగాయి.

స్నేహం, మానవత్వం, ప్రగతి భావన ముందుకి తోశాయి.

డబ్బుకోసం సంసారాన్ని, సభ్యతనీ, నీతినీ, పరువునీ వదులుకుని రంగుల కలల వెంట పరుగుపెడ్తోన్న మల్లిక గుర్తొచ్చింది. ధనాన్నీ విలాసాల వైభోగాల్నీ ఎడం

## గడుసరి ఇల్లాలు

పంతులుగారి వితంతు వివాహాలు నచ్చని భార్య తరపు బంధువులు అర్ధాంగి ద్వారానైనా ఆయనకు అడ్డుకట్ట వేయించాలని ప్రయత్నించారు. ఆమె మేనమామ కంట తడిపెడుతూ ఎలాగైనా ఆమెను తమవైపు తిప్పుకోవాలని, 'భర్త అడుగు జాడల్లో నడుస్తూ మమ్మందరినీ విడిచి పెట్టెదవా? ' అన్నారు.



చూసేందుకు సరళంగా కన్పించే ఆమె ఏమి సమాధానం చెబుతుందోనని ఆత్రుతగా ఎదురు చూశారాయన. 'మేము మిమ్మెప్పుడూ విడువము' అందామె. దీనికి ఆయన సంతోషించాడు. కాని అంతలోనే 'మీరే నన్ను విడిచి పెట్టెదరేమో. ఆయన పూనిన కార్యము మంచిదని నమ్ముతున్నాను. ఎన్ని కష్టాలు వచ్చిననూ ఆయనకు సాయపడెదను' అందామె.

కాలితో తన్ని నీతి కోసం మమత కోసం మనిషిగా బతకడం కోసం తండ్రిని సైతం ధిక్కరించి వచ్చిన రజియా కళ్ళముందు కదిలింది.

ఒకరు కడుపున పుట్టిన కూతురు.

మరొకరు కోడలు కావాలనుకుంటున్న అమ్మాయి.

తన మతం మల్లిక పతనాన్ని నిరోధించలేకపోయింది.

రజియా మతం ఆమె ఉన్నతికి అడ్డుపడలేదు

ఒక నిశ్చయానికొచ్చాడు వెంకన్న.

కొడుకు వంక చూశాడు. మందహాసం చేశాడు. భార్య వంక చూశాడు ఆశ్చర్యాంబుధిలో నిలువునా మునిగిచూస్తోంది.

మిత్రుడివంక చూశాడు. ఉత్కంఠంతో

## కొత్తగాలి...

**శూన్యంలో**
**సూర్యుణ్ణి చంద్రుణ్ణి**
**ఆడించే కీలుగుర్రం**
**హృదయం**

*- ఆచార్య కొలకలూరి ఇనాక్, హైదరాబాద్*

ఉద్వేగభరితుడై తనవంకే చూస్తున్నాడు. తన నిర్ణయం వినడానికి ఒళ్ళంతా చెవులు చేసుకున్నాడు.

షరీఫ్ చేతిలో చేయివేసి "రేపు ఉదయమే గుడిలో పెళ్ళిచేద్దాం భాయ్" అన్నాడు.

షరీఫ్ హర్షాతిరేకంతో మిత్రుడ్ని ఆలింగనం చేసుకున్నాడు. గోపిని కౌగిలించుకుని ముబారక్ చెప్పేడు.

శిలలా బిగుసుకుపోయింది కనకం.

వారిని పొగిడి వెళ్ళిపోయాడు షరీఫ్.

"మీకు మతిపోయిందా? ఆ సాయిబుల పిల్లని కోడల్ని చేసుకుంటారా? మతుండే మాట ఇచ్చారా? " కయ్‌మంది కనకం.

"తప్పేవిటే? "

"హవ్వ! వర్ణ సంకరం చేస్తూ ఇంకా తప్పేవిటంటారేవిటండీ ఖర్మ!"

"మతం అనేది ఒక అభిమతం. ఒక నమ్మకం. ఒక విశ్వాసం. ఒక ధర్మం. ఒక పద్ధతి. ఎవరిష్టానుసారం వాళ్లు మతం తీసుకోవచ్చు మతం మార్చుకోవచ్చు. మనిషికి కావల్సింది మానవత్వం. మనం విలువివ్వాల్సిందీ, గౌరవించాల్సిందీ మానవతకి తప్ప మతానిక్కాదు"

"అయితే మాత్రం ఇంటా వంటా లేని పనిచేస్తారా? ఆ పిల్లని వంటింట్లోకీ పూజ గదిలోకీ ఎలా రానివ్వగలను? అటు ఏడు తరాలూ ఇటు ఏడు తరాలూ తిరగేసి చూడండి. ఎక్కడా ఎవ్వరూ ఇలాంటి పాడుపన్లు చెయ్యలేదు. అంతా ఎంతో గొప్పగా బతికేరు. సాంప్రదాయాన్నీ సంస్కృతినీ గౌరవించారు"

"పిచ్చిదానా! కాలాన్నిబట్టి మనమూ మారక తప్పదు"

"మీరు మారండి నేను మారను"

"పరిస్థితుల్ని బట్టి అందరం మారాల్సిందే కనకం. మన సంగతే చూడు. తర తరాల్నుంచీ భూమిని నమ్ముకున్న కుటుంబం మనది. అలాటి కుటుంబం లోంచి వచ్చి నేనివాళ యంత్రాల కోరలు తోముతున్నాను. మన పూర్వులు చదువుకున్నారా? లేదే, శీను గొప్పగా చదువుతున్నాడు. మనమే కాదూ. అంతా ఇంతేనే పూర్వపు వృత్తుల్ని పట్టుకుని ఎవరు వేలాడుతున్నారు చెప్పు? అసలు పల్లెదాటి ఎరుగని వాళ్ళం ఇవాళ పట్నవాసులమయ్యామా లేదా? అక్కడ గుప్పెడు మెతుకులు దొరక్క ఇక్కడికొచ్చాం. ఇక్కడ చుక్కెదురైతే మరోచోటికి పోతాం. అవరసమైతే వంగుతాం తప్ప విరగం. నలుగతాం తప్ప నశించిపోం"

"నువ్వు చాలా ఎదిగిపోయావు నాన్నా. నీ భావాల్లో ఇంత స్పష్టత, ఇంత ముందు చూపు, ఇంతమార్పు ఉంటుందని కలలో కూడా ఊహించలేదు" ఆనందబాష్పాలు రాలుస్తూ అన్నాడు గోపి.

"బతుకు నేర్పిన పాఠాలురా ఇవి! వరి మొక్కని చూడు. ఆకుమడిలోంచి తీసి చేనులో నాటుతాం. నిలదొక్కుకుంటుంది. మొన తిరుగుతుంది. ఏపుగా ఎదుగుతుంది. కంకుల్ని వేస్తుంది. దానికి రెండే జన్మలు. మనిషికైతే ఎన్నో!"

"మీరు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి. నేనీ పెళ్ళికి ఒప్పుకోనుగాక ఒప్పుకోను. ఆడది దీని మాట లెక్కేవిటనుకుంటే మీ ఇష్టప్రకారమే కానివ్వండి. నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాను" ఆఖరి అస్త్రం ప్రయోగించింది కనకం.

"బాబాని మనస్ఫూర్తిగా నమ్ముతావా అమ్మా? " గోపి అడిగాడు.

"నమ్ముతావ్రా. మనమీ రోజున ఇలా ఉన్నామంటే అంతా సాయినాథుడి దయే!"

"షిర్డీ సాయిబాబా ఎవరో తెలుసా? ఒక ముస్లిం!"

★ ★ ★

సాయి మందిరంలో గోపీ రజియాల వివాహం నిరాడంబరంగా జరిగింది.

కాలనీలోని అన్ని మతస్తుల వారూ వచ్చి ఆశీర్వదించారు.

షరీఫ్ ఆనందోద్వేగంతో చిందులేశాడు. "ఇవాళే దీపావళి! ఇవాళే బక్రీద్! ఇవాళే క్రిస్టమస్!" అన్నాడు ఆనందబాష్పాలు జల జలా రాలిపోతోంటే.

కోడలికి దిష్టితీసి హారతిచ్చి ఇంట్లోకి ఆహ్వానించింది కనకం.

రజియా తండ్రికి వార్త తెలీడం ఆలస్యం ఆఘమేఘాల మీద బంధుమిత్రుల్ని వెంటే సుకొచ్చాడు. అవతల రజియా పారిపోయి నందున తనిచ్చిన డబ్బు తిరిగిమ్మని అర బ్ షేక్ చిందులేస్తున్నాడు మరి!

షరీఫ్‌ని నానా దుర్భాషలాడాడు. మత విరుద్ధమైన పని చేశావన్నాడు. తన కూతుర్ని తనక్కాకుండా చేశావన్నాడు. మొత్తం కుటుంబం నోట్లో మన్ను పోశా వని నిందించాడు. పుట్టగతుల్లేకుండా పోతావని శపించాడు.

బంధుమిత్రులు కూడా షరీఫ్‌ని తప్పుబ ట్టారు. నువ్వు చేసింది మంచి పని కాద న్నారు. సంతానం లేని వాడికి పిల్లల మీది ప్రేమ గురించి తెలీదన్నారు.

"అల్లా చేయించాడు. నేను చేశాను" అన్నదే షరీఫ్ సమాధానమయ్యింది.

వెంకన్న ఇంటికెళ్ళి గొడవ చేశారు- బెది రించారు.

రజియాని లేవదీసుకొచ్చారని పోలీసు కేసు పెడతామన్నారు.

వెంకన్నకీ కనకానికీ కాలూ చెయ్యీ ఆడ లేదు. సమయానికి గోపీ కూడా ఇంట్లో లేడు.

రజియా వాళ్ళముందు కొచ్చింది.

"నేను మేజర్ని. నా ఇష్టానుసారం ఈ పెళ్లి జరిగింది. అనవసరంగా అల్లరి చేస్తే మీరు కాదు నేనే పోలీసు కేసు పెడతాను. పన్లో పనిగా ఖాదీమా వ్యవహారాన్నీ బయ టపెడతాను. ఎవరెవరు ఇరుక్కుంటారో, ఎవరెంత కాలం జైల్లో కూర్చుంటారో ఆలో చించుకోండి"

అవాక్కయ్యారు. అసహనంతో మండారు.

అసహాయులై "నువ్వు చచ్చేవను కుంటాం" అని వెనుదిరిగారు.

కనకం పరుగునొచ్చి కోడల్ని అక్కున చేర్చుకుంది.

★ ★ ★

షరీఫ్ వాలంటరీ రిటైర్మెంట్ తీసుకు న్నాడు. ఒంటరి అయిపోయినట్టు విలవి ల్లాడాడు వెంకన్న.

"మనవాళ్ళు చాలామంది ఉన్నారు భాయ్. హజ్ యాత్ర నా జీవిత లక్ష్యం. వీఆర్ఎస్ సొమ్ముతో ఆ కోరికని పూర్తిచే సుకుంటాను. తర్వాతెలా బతుకుతామ న్నది ఇప్పుడాలోచించదలచలేదు. అల్లా దయ ఎలా ఉంటే అలా జరుగుతుంది" అన్నాడు.

ఎప్పట్నుంచో చేస్తున్న ఏర్పాట్లు ఫలిం చాయి. బేగంతో కలిసి మక్కా యాత్ర కెళ్ళాడు. రజియా గోపి వెంకన్న కనకం అంతా వెళ్ళి సాగనంపేరు.

"రజియాని నీకప్పగించాను. నీ కూతుర్లా చూసుకో భాయ్. నిన్ను చల్లగా చూడమని అల్లాని ప్రార్థిస్తాను" అన్నాడు విమానం ఎక్కే ముందు షరీఫ్.

"రజియా నా కూతురే. నువ్వు నిశ్చిం తగా ఉండు. అక్కడ నా గురించో చిన్న ప్రార్థన చేస్తావా?"

"చెప్పు వెంకన్నా నీ కోసం ఏం కోరను చెప్పు?"

## కొత్తగాలి... 

**సర్దుకు పోయేదే**
**జీవితం**
**విరుద్ధ భావాల**
**ఆలుమగలే ఉదాహరణ**

*– గంపా శ్రీదేవి, సింహాచలం*

"మళ్ళీ జన్మంటూ ఉంటే నన్నో అన్నం మెతుకులా నీటి బొట్టులా మట్టి రేణువులా పుట్టించమను..."

అమాంతం కావలించుకున్నాడు షరీఫ్ "నువ్వు మనిషివి కాదు భాయ్ మనీషివి!"

ఊహించని దానికన్నా ఎక్కువ మంది కంపెనీ నుంచి వాలంటరీ రిటైర్మెంట్ తీసుకున్నారు.

"నా ఉద్యోగానికి ముప్పులేదు. నేనింక బెంగపెట్టుకోనక్కర్లేదు" అన్నాడు వెంకన్న ఇంటికొస్తూనే.

"హమ్మయ్య ఇకనైనా మీకు పీడకలలు రాకుండా ఉంటే అంతేచాలు! అంతా సాయి దయ!" అంది కనకం.

"మా నాన్న ఉద్యోగానికి భద్రత ఉందంటావా? " రజియాని అడిగాడు గోపి.

"నాకైతే నమ్మకం లేదు."

"రజియా!"

"పురుగు అనువైన మొక్కనే ఆశిస్తుంది. అత్యధిక రుణం ఇవ్వడానికి ప్రపంచ బ్యాంకు మన రాష్ట్రాన్ని సెలక్టు చేసుకుంది. వాళ్ల సూచనల్ని ఆదేశాలుగా భావించి తు.చ. తప్పకుండా పాటించడానికి మన రాష్ట్రం సిద్ధపడింది. అంచేత ప్రైవేటీకరణ, గోల్డెన్ హేండ్‌షేక్, సబ్సిడీల తగ్గింపు, మద్య నిషేధం ఎత్తివేత, నీటి తీరువా హెచ్చింపు, విద్యుత్ సంస్కరణలు, సెజ్‌ల ఏర్పాటు వగైరా వగైరాలన్నీ నిరాటంకంగా కొనసాగి తీరతాయి. మన బతుకులిప్పుడు ప్రపంచ బ్యాంకు తాకట్టులో ఉన్నాయి. వాళ్ళ చేతిలోని కీలు బొమ్మలు మన ప్రభుత్వాలు. నిజానికి మనల్ని పాలిస్తున్నదీ వాళ్ళే!"

నిర్ఘాంతపోయాడు గోపి.

★ ★ ★

ఎంసెట్ పరీక్ష ముగియగానే ఇంటికొచ్చేశాడు శీను.

చాలా బాగా రాశానన్నాడు.

అయినా అతడికి గుబులు గుబులుగానే ఉంది.

ఇది పోటీ పరీక్ష. పాసయ్యామా లేదా అన్నది ముఖ్యం కాదు, ర్యాంకు ఎంత వచ్చిందన్నది ముఖ్యం. తను బాగా రాశాడు. కాని మిగతావాళ్ళు తనకన్నా బాగా రాసి ఉండొచ్చు అప్పుడు తనకన్నా వాళ్ళకి మంచి ర్యాంక్ రావచ్చన్న భయం అతడి గుండెని కేన్సర్లా కొద్దికొద్దిగా కొరికి తినసాగింది.

కాలేజీ మేనేజ్‌మెంట్ వారు మాత్రం చాలా ధీమాగా ఉన్నారు. మొదటి పది ర్యాంకుల్లో ఒకటి శీను సాధిస్తాడన్నారు. ఘనంగా సన్మానిస్తామన్నారు. బంగారు పతకం బహుకరిస్తామన్నారు. సూట్ వేసి ఫొటోలు తీయించి పెట్టుకున్నారు.

వారి అంచనాలు శీనుని మరింత భయపెడుతున్నాయి. నిద్రకు దూరం చేస్తున్నాయి!

ఎవరూ లేకుండా చూసి "మీరు దేని గురించో తీవ్రంగా కలవరపడుతున్నారు అంకుల్" అనడిగింది వెంకన్నని రజియా.

తలాడిస్తూ అన్నాడు. "బతుకంటే భయమేస్తోందమ్మా. అదాయం పెరిగినా బొటాబొటిగా సరిపోతోంది తప్ప ఏమీ మిగల్టం లేదు. షాపు కోసం చేసిన అప్పు ఎలా ఉన్నది అలాగే ఉండిపోయింది. అప్పు సుడిగుండంలాంటిది తల్లీ. అందులో చిక్కుకున్నవాళ్లు బయట పడలేరు. స్వానుభవంతో చెబుతున్నాను...."

"అగ్నిశేషం, రుణశేషం, శత్రుశేషం ఉంచ

కూడదన్నారు పూర్వులు. అవెంతటి ప్రమాదకారకాలో పూర్వులే గ్రహించారంటే వాటి ప్రభావాన్ని తేలిగ్గా అంచనా వెయ్యొచ్చు. అప్పుడే కాదు ఆకర్షణలూ ఆడంబరాలూ డబ్బు యావా అన్నీ సుడి గుండాలే. కొన్ని కంటికి కన్పిస్తాయి. కొన్ని కన్పించవు..."

"గోదావర్లో కూడా దొంగసుడిగుండాలుంటాయి. పైకి ఏమీ లేనట్టుంటాయి. గాని లోపల్నుంచి లాగి ఊపిరాడకుండా చేస్తాయి..."

"బాగా చెప్పేరు. అప్పుచేసి పప్పుకూడు తినాలని చూడకూడదు. అప్పు చెయ్యొచ్చు. కానది సవ్యంగా ఆదాయాభివృద్ధి కోసం వినియోగించాలి. అప్పుడే అప్పు చెల్లించగలశక్తి వస్తుంది. లేకపోతే అప్పు నిప్పు అవుతుంది. అది మనిషికైనా దేశానికైనా ముప్పు తెచ్చి తీర్తుంది! ఈనాటి షైలాక్‌లు గుండె దగ్గర మాంసం కాదు, గుండెకాయే కావాలంటారు. రక్తం కారినా సరే, కోసిమ్మని కూర్చుంటారు"

జాగ్రత్త. అవగాహన, ముందు చూపూ గల గృహిణి చేతిలో గృహమూ, నాయకుల చేతుల్లో మాత్రమే దేశమూ క్షేమంగా ఉండగలవు!




ఇంటర్వ్యూకి వెళ్ళి వచ్చింది రజియా.

"ఆ ఉద్యోగం నీకే రావాలని సాయంత్రం గుడికెళ్ళి మొక్కుకుందాం."

నవ్వింది.

"ఏ గుడికి ఆంటీ? ఇదివరకు వెంకటేశ్వరస్వామి దేవాలయం, వేణుగోపాలస్వామి కోవెల అనేవాళ్ళు. ఇప్పుడు బిర్లామందిర్, సంఘీ టెంపుల్ అయిపోయాయి!"

అయోమయంగా చూసింది కనకం.

ఇంతలో శీను రావడంతో, "సినిమా ఎలా వుంది శీనూ" రజియా అడిగింది.

వాడేమీ చెప్పలేదు. కాళ్ళు కడుక్కొనొచ్చి బుంగమూతి పెట్టుక్కూర్చున్నాడు.

"వదినకి సమాధానమివ్వవేరా..."

"సినిమాలో అక్క వుంది..."

ఉలిక్కిపడ్డారిద్దరూ.

"అక్క బాగా నటించిందా?" కన్నుతీపి అడిగింది.

"క్లబ్బు డాన్సు చేసింది"

వెనుకెరటం మొఖాన్ని బలంగా తాకినట్టు ఫీలయ్యింది కనకం. కళ్ళల్లో కన్నీటి పొర కదిలింది.

"ఆ పాపిష్టిదాని ఊసు ఎత్తొద్దు. నా దృష్టిలో అదెప్పుడో చచ్చిపోయింది..." అంటూ తన మొఖం ఎవరికీ చూపించలేక గదిలో కెళ్ళిపోయింది కనకం.

"ఎవ్వరికీ చెప్పకు..." శీను తల నిముర్తూ చెప్పింది రజియా.

సినీనటి మల్లికారాణి వెంకన్న కుమార్తె అన్న సంగతి కాలనీ వాసులందరికీ తెలిసిపోయింది.

సినిమాల్లో ఆమె వస్త్రధారణా డాన్సులూ చూసి అంతా అసహ్యంగా చూస్తారేమో, మాట్లాడతారేమోనని ముడుచుకుపోయారు వెంకన్న దంపతులు.

కాని చిత్రంగా అంతా వారిని అపురూపంగా చూడటం మొదలుపెట్టారు. అభినందనలు కురిపించడమేగాక వారి పరిచయం కలిగినందుకు పొంగిపోతున్నారు.

మల్లిక వచ్చినప్పుడు పరిచయం చేస్తామని మాట ఇచ్చేకగాని వదల్టం లేదు.

ముక్కుమీద వేలు వేసుకోకుండా వుండలేకపోయారు కనకమూ వెంకన్నా!

## కొత్తగాలి...

**మానవత్వం మసైపోయింది!**
**పసిమొగ్గను గొంతునులిమి**
**కొలిమిలో వేస్తారా?**
**ఏమైపోయింది నా భారత్‌కు??**

– గుడిమెట్ల గోపాలకృష్ణ
శ్రీకాకుళం

★ ★ ★

"ఇంట్లో ఎవరూ? బయటికి రండి" ఎవరో అరవగా వీధి గుమ్మంలోకెళ్ళారు, వారి వెనుకే వచ్చింది కనకం.

ఇద్దరు గూండాలు మీసాలు తిప్పుతూ తొడలు చరుస్తూ రెచ్చిపోయారు. ఇజ్జత్ నిలవాలంటే శేర్ బాకీ తీర్చమంటూ రంకె లేశారు.

ఆడవాళ్లకి చాలా అవమానంగా ఉంది. వాళ్ళెక్కడ ఇంటి మీదకొచ్చి పడతారోనని కించిత్తు ఆందోళనగానూ ఉంది.

"మీరు అప్పు అడగడానికొచ్చారా? అల్లరి చెయ్యడానికొచ్చారా?" ధైర్యం కూడ దీసుకుని నిలదీసింది రజియా.

"అప్పు కక్కండి లేదా అల్లరి చేస్తాం.."

"మూడు రోజులు గడువివ్వమని చెప్పండి. అప్పుకు శ్రీరామ చుట్టేస్తామని చెప్పండి. వెళ్ళండి" ఎప్పుడొచ్చాడోగాని ముందుకొచ్చి అన్నాడు వెంకన్న.

"మూడు రోజుల్లో లంకెబిందెలు దొరుకుతాయా? " ఎకసక్కెమాడాడొకడు.

"అది నీకనవసరం. వెళ్ళు. వెళ్లి నీ శేర్‌కి చెప్పు. ఇంకాస్సేపు మీరిక్కడే వుంటే నా కొడుకు వస్తాడు. మూడో కన్ను తెరిచిన శివుడైపోతాడు. మీ పేగుల్ని తీసి మెడలో వేసుకుంటాడు. పోండి? "

అతడు ఆగ్రహ జ్వాలలు వెలిగ్రక్కుతోంటే నీళ్లు నములుతూ జారుకున్నారు.

"ఛీ! బుద్ధి వున్నోడెవడూ అప్పు చెయ్యకూడదు. అప్పు చేయడమంటే మన పరువూ మర్యాదా సిగ్గు లజ్జా అన్నీ తాకట్టు పెట్టేయడమే!" స్వగతంలా అన్నాడు.

"మూడ్రోజుల్లో అంత డబ్బు ఎక్కడ్నుంచొస్తుంది? " లోగొంతుకతో అడిగింది కనకం.

"ఎక్కడో అక్కడ్నుంచి తెస్తాను. గోపీకేమీ చెప్పకండి డబ్బు తేవడానికి ఒక చోటుకెళ్తున్నాను. రెండ్రోజుల్లో వస్తాను.." అంటూ వెళ్ళబోయి ఆగాడు.

భార్యవంక ఆప్యాయంగా చూశాడు. కొడుకు భుజం తట్టాడు. కోడలివంక అభిమానంగా చూశాడు.

తడబడుతూ వెళ్లిపోయాడు వెంకన్న.

మూడోరోజున శేర్ ఇంటి ముందు ఆటో దిగాడు వెంకన్న.

చాలా నీరసంగా ఉన్నాడు. అయినా అదృశ్య శక్తి ఏదో నడిపిస్తున్నట్టుగా అడుగులేశాడు.

"మా గోపి బాకీ ఎంతయ్యిందో చెప్పు శేరూ, అణాపైసల్తో తీరుస్తాను"

నిలువునా ఆశ్చర్యబోయాడు శేర్.

గోపి కాలనీ తలలో నాలుక అవడం సహించలేకుండా ఉన్నాడు దాదా. శేర్ మీద ఒత్తిడి తెచ్చాడు.

దాంతో గూండాల్ని పంపి గొడవ చేశాడు తప్ప బంగారు గుడ్లు పెట్టే బాతును కోసుకుని తినే ఉద్దేశమే లేదు శేర్‌కి.

"అన్నా కొంచెం అవసరమై మా వాళ్ళని పంపాను. వాళ్ళు ఓవరేక్షన్ చేసినట్టున్నారు. సంగతేంటంటే వెంకన్నా..."

"నీచొల్లు వినే ఓపికలేదు. బాకీ తేల్చు"

బాకీ చెల్లించి ప్రోనోటు తీసుకుని తృప్తిగా చూసి జేబులో పెట్టుకుని బయటికి నడిచాడు.

ఎంతో హాయిగా వుందతడికి. శృంఖలాలు తెంపుకున్నట్టుగా ఉంది. స్వేచ్ఛాజీవి అయినట్టుగా ఉంది.

ఎవరివో రెండు కిడ్నీలూ పాడయ్యాయనీ ఒక కిడ్నీ కొందామని చూస్తున్నారనీ

ఫలానా ఆసుపత్రిలో ఉన్నారనీ ఫ్యాక్టరీలో తోటి కార్మికుల ద్వారా విన్నాడు. కిడ్నీ కొనుక్కునే వాళ్ళేకాదు, అమ్ముకునే వాళ్ళూ వుంటారని అప్పుడే తెలిసిందతడికి.

ఇంటికొచ్చేసరికి శేర్ మనుషులు వీరంగ మాడుతున్నారు.

మూడ్రోజుల్లో తీరుస్తానని చెప్పి తిన్నగా ఆసుపత్రికెళ్ళాడు. రోగి సంబంధీకుల్ని కలిశాడు. డాక్టర్లు పరీక్షించారు. అతడి కిడ్నీ సూటవుతుందని చెప్పేరు. యాభైవేలిస్తామన్నారు. బేరమాడలేదు.

కిడ్నీ మార్పిడి జరిగిపోయింది.

ఇంటిముందు ఆటో దిగుతోన్న వెంకన్నని చూసి మ్రాన్పడిపోయారంతా.

పది లంఖణాలు చేసినవాళ్ళా వున్నాడు.

"అలా వున్నావేం నాన్నా, ఎక్కడికెళ్ళేవు? ఒంట్లో ఎలావుందసలు?" గోపి ఎదురెళ్లి తండ్రికి చేయూతనిస్తూ అన్నాడు.

"శేర్ అప్పు తీర్చేశాన్రా."

"నిజమా? ఎక్కడ్నుంచొచ్చింది అంత డబ్బు" తండ్రి వంక అనుమానంగా చూస్తూ అడిగాడు.

"అప్పు ఊబిలాంటిదిరా గోపీ. అందులో పడకూడదు. పొరబాటున పడ్డా వెంటనే బయటపడాలి. లేదనుకో నిలువునా మింగేసి ఆనవాలు లేకుండా చేసేస్తుంది. లేదా గుండెకాయని తినేసి అస్థిపంజరాన్ని మిగులుస్తుంది!" ఆయాసపడ్తూ చెప్పేడు.

"అంత డబ్బెలా వచ్చింది నాన్నా?" రెట్టించాడు.

"ప్రాణాలు తప్ప అమ్ముకోడానికి మన దగ్గరేమున్నాయి చెప్పు? మన ప్రాణాలకి దమ్మిడీ విలువలేదు కదా. కానీ మన కిడ్నీకి విలువుందట్రా.. అది తప్ప అమ్మడానికి భూమీ ఇల్లూ ఏవీ లేవు కదా. అందుకని దాన్ని అమ్మేశాను. అయితే నేంరా అప్పు నిప్పు తొలిగిపోయిందిరా. నేనిప్పుడు పోయినా ఫర్లేదు. నీకు అప్పు మిగల్చలేదు. అదే నేన్నీకిచ్చే కొండంత ఆస్తిరా.."

"నాన్నా!" ఏడ్చేశాడు గోపి.

రజియా కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

బిక్క మొఖం పెట్టేశాడు శీను. బావురుమంది కనకం.

★ ★ ★

ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీ రజియాని టెలిఫోన్లో ఇంటర్వ్యూ చేస్తోంది.

ఇప్పుడిప్పుడే ఊపందుకుంటోంది సాఫ్ట్‌వేర్ రంగం. మాస్టర్ ఆఫ్ కంప్యూటర్ అప్లికేషన్స్(ఎం.సి.ఎ) చదివిన ఆమెకి అమాంతం డిమాండ్ వచ్చేసింది.

ఎలాంటి తొట్రుపాటూ లేకుండా చకచకా సమాధానాలిస్తోంది.

ఇంట్లోనే ఉన్న కనకం, శీను ఆమె హావభావాలని విస్మయంగా చూస్తూండిపోయారు.

ఇంటర్వ్యూ పూర్తయ్యింది. రజియా మోము పున్నమిచంద్రుడయ్యింది.

"ఆంటీ! నాకు జాబ్ వచ్చింది... హైటెక్ సిటీలో ఉద్యోగం..."

పరమానందపడిపోయింది కనకం.

"మా తల్లే! మా తండ్రే! ఎంత చల్లని కబురు చెప్పేవు తల్లీ..."

ఆమె బుగ్గలు పుణికి మెటికలు విరిచింది.

"కంగ్రాచ్యులేషన్స్ వదినా" షేక్‌హేండిచ్చాడు శీను.

"జీతం పదిహేను వేలు... ఆర్నెల్లకి

## కొత్తగాలి...

పల్లె
రమ్మంటోంది
పట్నం
తెమ్మంటోంది

– జి.ఆర్.వెంకటకుమార్,
కత్తిపూడి, తూ.గో.జిల్లా



పెంచుతామన్నారు..."

అక్షరాలా గాలిలో తేలిపోయింది కనకం. కాళ్ళు భూమిమీద ఆనటం లేదు.

సాయి విగ్రహం ముందు కూలబడింది. ఆనందోద్వేగంతో కన్నీళ్ళు కారిపోతుంటే, "ఇన్నాళ్ళకి దయదలిచావా సాయినాథా" అంటూ చేతులు జోడించింది.

గోపి, వెంకన్న వచ్చారు. సంగతి విని ఆనంద నాట్యం చేశారు.

ఇంట్లో పండుగ వాతావరణం నెలకొంది. గుండెలు పట్టనంత సంబరంతో ఊగిపోయారంతా.

ఇరుగు పొరుగుకి స్వీట్లు పంచింది కనకం.

"మా ఆయనది ఉద్యోగం. మా అబ్బాయిది ఉద్యోగం. మా కోడల్ది ఉద్యోగం. మాకింక దేనికీ లోటుండదు. భూమ్మీద మా అంత అదృష్టవంతులే ఉండరు" అని అడిగిన వారికి, అడగని వారికీ చెప్పేస్తోందామె.

"నిజంగా అదృష్టవంతులమేనే. అప్పు లేదు కదా. అప్పు లేకపోవడమే గొప్ప ఐశ్వర్యమన్నారు.. ఇది వరకు హైటెక్కు సిటీలెందుకనుకున్నారు. వాటి విలువ ఇప్పుడు తెలుస్తోంది. వాటి ఫలాలు ఇప్పుడందుతున్నాయి" అన్నాడు వెంకన్న కళ్ళు తుడుచుకుంటూ.

"ఇకనుంచి మనమిలా ఇరుకుబతుకు బతకక్కర్లేదు. దేనికీ ఎవర్నీ దేబిరించక్కర్లేదు. ఒరేయ్ గోపీ! మంచి ఇల్లు చూడరా, వెంటనే మారిపోదాం"

"అలాగేనమ్మా. ఇన్నాళ్ళూ కోరికలకి బిగించిన కళ్ళేలు విప్పేద్దాం. ఇక అంతా

నీ ఇష్టం" అన్నాడు కొడుకు నవ్వుతూ.

"ఇన్నాళ్ళూ పడ్డ కష్టం చాలు. ఇకనుంచి మీరూ అంకులూ విశ్రాంతి తీసుకోండి. మిమ్మల్ని కంటికి రెప్పలా చూసు కుంటాం" రజియా మాటలకి పొంగిపో యింది కనకం.

"ఈ సంతోష సమయంలో అత్తయ్యగారుంటే ఎంత బావుం డేదో! ఇన్నేళ్ళకి సంసారం తేలా టంలో కొచ్చినందుకు ఎంత పొంగిపోయేవారో!" పమిటకొం గుతో కళ్ళొత్తుకుంది.

★ ★ ★

వెంకన్న కుటుంబం ఇల్లు మారింది.

రజియా ఉద్యోగానికి వెళ్లి



రావడానికి అనువుగా వుంటుందని సిటీ లోకి మారారు.

ఫ్లాట్ చిన్నదే అయినా సౌకర్యంగా ఉంది. టూ బెడ్‌రూం పోర్షన్. అభివృద్ధి చెందిన ప్రాంతం. నీటివసతి పుష్కలంగా వుంది.

తమ అంతస్తు పెరిగినట్టు పొంగిపో తోంది కనకం. కోడలి మొదటినెల జీతాన్ని పూర్తిగా ఇంటి ఆడంబరానికే ఖర్చు పెట్టేసింది.

ఎన్నాళ్ళనుంచో ఉబలాట పడుతోన్న ఫ్రిజ్ కొన్నది. సోఫాసెట్ కొన్నది. హాల్లోని షోకేసుని అందమైన బొమ్మలతో నింపేసింది. ఇంటిల్లిపాదికీ బట్టలు ఖరీదు చేసింది.

భార్య సంబరం అంబరాన్ని తాకడం చూసి సరదాపడ్డాడు వెంకన్న.

"తర్వాత ఏం కొంటావే? కారు కొనకూ డదూ. రోజూ నువ్వూ నేనూ షికారుకె ళ్దాం..." వేళాకోళమాడాడు.

"కారు, ఏ.సి.. ఒకటేమిటి అన్నీ సొం తం చేసుకుంటాం. చూస్తూవుండండి..."

"అబ్బో ఇంకా చాలా కోరికలున్నాయే!"

"అనంతమైనవి గనుకే వాటిని కోరికల న్నారంకుల్. కోరికల్ని అదుపులో పెట్టు కుంటేనే ఆనందం అన్నాడు బుద్ధుడు. కాని అదుపులో వుండకపోవడం వాటి సహజ లక్షణం" నవ్వుతూ అంది రజియా లోపలికొస్తూ.

"ప్రభుత్వం అదేపనిగా భూముల్ని అమ్మే స్తోందేంటమ్మా" రజియాని అడిగాడు వెంకన్న బాధగా.

"డబ్బుకోసం"

"ఎవరైనా సరే గత్యంతరం లేనప్పుడు

## కొత్తగాలి...

**అందరి బంధువైన**
**ఆర్టీసీ బస్సే**
**ఉద్యమకార్ల**
**ఆగ్రహజ్వాలలకూ ప్రీతి**

– వినిశెట్టి లక్ష్మీశారద, రాజమండ్రి

భూముల్ని అమ్ముకుంటారు. దిగజారో, దివాలా తీసో అమ్ముకుంటారు. సిగ్గుతో చితికిపోతూ అమ్ముకుంటారు. వీళ్ళేంటి సంబరంగా అమ్ముతున్నారు. అమ్ముతూ సంబరాలు చేసుకుంటున్నారు!"

"డబ్బు అవసరం కొంత, అయిన వాళ్ళకి మేలు చెయ్యాలన్న తపన కొంత. ప్రభుత్వాస్తుల్ని ప్రజా ప్రయోజనాలకోసం ఉపయోగించకుండా అయినకాడికి అమ్మేస్తున్నారు. ప్రభుత్వం కోసం అన్చెప్పి సెజ్‌ల పేరిట ప్రైవేటుభూముల్ని బలవంతాన సేకరించి మరీ అమ్మేస్తున్నారు. ముమ్మందు రైతు ఉపాధే కాదు, ఉనికి సైతం కోల్పోయినా ఆశ్చర్యపడక్కర్లేదు"

"అబ్బే సర్కారు పద్ధతేం బావోలేదమ్మా"

"మీరు నేనే కాదు, దేశమంతా కోడైకూసినా వినే స్థితిలో లేదు ప్రభుత్వం!"

"దేశానిక్కూడా దేవుడే దిక్కేమో!"

"దిక్కంటే గుర్తొచ్చింది ఇక రైతుబజార్ల పనీ అవుటే. రిలయన్స్ ఫ్రెష్, హెరిటేజ్ ఫ్రెష్, చౌపట్ ఫ్రెష్‌లొచ్చేశాయి. రిలయన్స్ మందులూ చెప్పులూ వచ్చాయి. సెలూన్లు కూడా వస్తాయిట. చేతివృత్తుల వారి పని ఇక గోవిందే!"

ప్రమాన్పడి చూశాడు వెంకన్న. 'ఔరా! కలికాలం!'

★ ★ ★

మర్నాడు ఎంసెట్ రిజల్ట్సు రాబోతున్నాయి.

శీను కంటిమీదకు కునుకు రావట్లేదు.

కళ్ళు తెరచుకుని చీకట్లోకి చూస్తున్నాడు.

ఏ ర్యాంక్ వస్తుందో! సింగిల్ డిజిట్ ర్యాంక్ రాకపోతే?

ఛా ఛా! అలా ఎలా జరుగుద్ది. తప్పక వస్తుంది. మంచి ర్యాంక్ వచ్చితీరుతుంది.

అమ్మా నాన్నా అన్నయ్యా వదినా స్నేహితులూ లెక్చరర్లూ కాలేజీవారూ అంతా ఆనందిస్తారు. అభినందిస్తారు. ఆకాశానికెత్తేస్తారు. పేపర్లలో తన ఫొటోని పెద్ద సైజులో ప్రింటు చేస్తారు. సన్మానిస్తారు. బంగారు పతకం ఇస్తారు. బోల్డన్ని సంస్థలు డబ్బిస్తాయి. స్కాలర్ షిప్ వస్తుంది. ఇంజినీరవుతాడు. ఎన్నో ప్రాజెక్టులు కడతాడు. గొప్ప పేరు తెచ్చుకుంటాడు.

ఒకవేళలా జరక్కపోతే...?

అబ్బే. జరిగి తీరుతుంది. రెండేళ్ళపాటు రాత్రీ పగలూ కష్టపడ్డాడు. కలవరించాడు. చదువే ఊపిరిగా మసిలాడు. అలాటి తనకి తప్పకుండా మంచి ర్యాంక్ వచ్చి తీరుతుంది!

అతి కష్టం మీద తెల్లవారింది.

సెంటర్లోకెళ్లాడు శీను. పేపర్ రాలేదు.

కాలేజీకి ఫోన్ చేస్తే?

పత్రికల వాళ్ళకన్నా ముందు కాలేజీల వారికి ఫలితాలు తెలుస్తాయి.

వెంటనే బాణాసంచా పేలుస్తారు. అందరికీ ఫోన్లు చేస్తారు. టీవీలో ప్రకటనలిస్తారు.

సెలక్టయినవారికి పూలగుచ్ఛాలూ ఛైర్మన్‌తో ఫోటో సెషన్నూ ఇంటర్వ్యూలూ...

అవునూ తనకి ఫోన్ రాలేదేం!

అంటే... తనకి... ర్యాంక్... రా... లే... దా? !

గుండెలు గుబగుబలాడాయి.

గుడ్లగూబ వికృతంగా అరుస్తూ తల మీంచి ఎగిరెళ్ళినట్టు నిలువునా వణికిపో

యాడు.

నోరు తడారిపోయింది. నిలబడే శక్తిలే నట్టు రోడ్డు పక్కన కూలబడ్డాడు.

ఒకవేళ... తమ ఫోన్ నెంబరు దొరక్క...!

అదీ పాయింటే. తనెవరో చెప్పకుండా ఫోన్ చేస్తే?

కాస్సేపు తర్జన భర్జన పడ్డాడు.

కడకి ధైర్యం చేసి పబ్లిక్ ఫోన్ దగ్గరికె ళ్ళాడు.

రింగవుతోంది.

గుండె శబ్దం చెవుల్లో మార్మోగుతోంది.

వార్డెన్ ఎత్తాడు.

"సార్... నేను శ్రీ.. శ్రీనివాస్‌ని..."

"సిగ్గు లేకుండా ఏ మొఖం పెట్టుకొని ఫోన్ చేశావురా ఇడియట్. నీకు ర్యాంక్ వస్తుందని దున్నపోతులా మేపితే చెత్త ర్యాంకు తెచ్చుకుంటావా. చెత్తకారీ వెధవ. ఛా... నీ పేరు తలచుకుంటేనే అసహ్యామే స్తోంది...!"

కోపంగా రిసీవర్ పెట్టేశాడు.

చిరు తుపానుకే సర్వం కోల్పోయి నవాళ్ళా కూలబడిపోయాడు శీను!

అప్పుడే వచ్చాయి రిజల్ట్ పేపర్లు. జనం ఎగబడ్డారు.

తడబడ్తూ వెళ్ళి పేపర్ కొని వెదికాడు.

నూటడెబ్భై ఎనిమిదో ర్యాంక్ వచ్చింది!

ఎవరో నవ్వుతున్నారు. వార్డెన్ బూతులు తిడుతున్నాడు.

చుట్టాలు పక్కాలు స్నేహితులు అంతా నవ్వుతున్నారు. ఊరికే మేపినందుకు భలేగా చేశావని కాలేజీవాళ్ళు తిడుతు న్నారు. మిగతా కాలేజీల వాళ్ళు హేళన చేస్తున్నారు. గొప్పోడివవుతావనుకు న్నాంరా అని అమ్మా నాన్నా బాధపడుతు న్నారు.

అందరి ఆశల్నీ, కోరికల్నీ, కాంక్షనీ నిర్దా క్షిణ్యంగా నమిలి రాక్షసంగా కాళ్ళతో తొక్కే సింది నూట డెబ్భై ఎనిమిదో ర్యాంక్!

ఏ ముఖం పెట్టుకుని ఇంటికెళ్ళగలడు?

## కొత్తగాలి...

**చెరువంటే నీటి పలక**
**చెట్టంటే ఆకు చిలక**
**పంటంటే ఆకలిపై జేగంట**
**ఆకాశమంటే అందరి దేవుడు**

– కందాళై రాఘవాచార్య,
నిజామాబాద్

అందరికీ తన పరాజయాన్నెలా చెప్పగ లడు? లేదు లేదు!

తనెవ్వరికీ ముఖం చూపలేడు. అంద రికీ దూరంగా వెళ్ళిపోవాలి. అసలు బత కడం శుద్ధ దండుగ. పరమవేస్ట్. అవు నంతే. బతకడం అనవసరం. ఎవర్నీ ఉద్ధ రించలేని బతుకు బతికి ప్రయోజనం లేదు.

ఉద్వేగంతో ఊగిపోతున్నాడు శీను.

★ ★ ★

శీను ఎంతకీ రాకపోయేసరికి ఇంటిల్లి పాదీ కలవరపడ్డారు. అంతా తలో దిక్కూ పరుగెట్టారు.

రజీయా పేపర్ కొని చూసింది. శీను మానసిక పరిస్థితిని అంచనా వేసింది.

"ఎలాంటి అఘాయిత్యానికి తలపడక ముందే శీనుని వెదికి పట్టుకోవాలి. పోలీసు కంట్రోలు రూమ్‌కి ఇన్ఫార్మ్ చేద్దాం"

"శీను అంత బలహీన మనస్కుడం టావా? " గోపి అడిగాడు.

"కాకపోవచ్చు కాని ఇలాంటి స్థితిని తట్టుకుని నిలబడగలిగేంత మనోస్థైర్యం ఉందనుకోను. అందరి ఆశలూ తనమీదే ఉన్నాయని అతడికి తెలుసు"

పోలీసు సాయం కోరారు. అన్నిచోట్లా వెదికారు.

రైల్వే ట్రాక్ మీద ఓ కుర్రాడి శవం పడుందని తెలిసింది.

గుండెలు బాదుకుంటూ వెళ్ళారు.

వాళ్ళెళ్ళేసరికి పోలీసులు శవాన్ని ఆసుపత్రికి తరలించారు. మళ్ళీ అక్కడికి పరుగెత్తారు.

కడకి శవాన్ని చూశారు.

గుర్తు పట్టలేనంతగా ఛిన్నాభిన్నమై ఉంది, చిన్నారి పొన్నారి శ్రీను మృత దేహం!

కనకానికి స్పృహ తప్పింది.

చిన్నపిల్లాడిలా ఏడ్చేశాడు గోపి.

రజియా దుఃఖాన్ని కంట్రోలు చేసుకోలేకపోయింది.

వెంకన్న రాయిలా కూర్చునుండిపోయాడు. పిచ్చి చూపులు చూస్తూ గోడకి జేరబడ్డాడు.

"మా శీను గొప్పోడవుతాడు... శానా గొప్పోడవుతాడు, మమ్మల్ని సుఖపెడ్తాడు..."

పిచ్చి పిచ్చిగా కలవరించడం చూసి గోపికి చెప్పింది రజియా.

అతడొచ్చి తండ్రిని గట్టిగా పట్టుకుని వూపుతూ "నాన్నా" అని పిలిచాడు.

ఆకాశం బద్దలైనట్లు బరస్టయ్యాడు వెంకన్న.

"ఒరే. శీనురా... మన శీనురా. మన బంగారు కొండరా. ఎంత అన్యాయం చేశాడో చూడ్రా. వాడు చచ్చిపోలేదురా, నేను చంపేశాను. నేనే.. నేనే చంపేశాను. పట్నంలో బతుకుదామని తీసుకొచ్చి చంపేశాను. ఒరే గోపీ.. పట్నంలో బతుకు లేదురా. అడుగడుగునా చావు ఉంది. మోసం ఉంది. అభద్రత ఉంది. దోపిడీ ఉంది. దౌర్జన్యం ఉంది. అందుకేరా ఒక్కొక్కర్నీ.. ఒక్కో అవయవాన్నీ పట్నానికి బలిపెట్టేస్తున్నాను. ఇది మనలాంటోళ్ళని బతికించే పట్నం కాదురా. దొంగల పట్నం. దోపిడీదార్ల రాజ్యం...!"




**పే**పర్లలో వాంటెడ్ కాలమ్స్ తిరగేస్తున్నాడు గోపి.

బిస్కెట్ ఫ్యాక్టరీని మూసెయ్యడంతో అతడి ఉద్యోగం పోయింది. ఫ్యాక్టరీస్థానే కమర్షియల్ మాల్ నిర్మించబోతున్నారు.

"ఏం చేద్దామనీ" అతడి కెదురుగా కూర్చుంటూ అడిగింది రజియా.

"వ్యాపారం పోయింది. ఉద్యోగం పోయింది. ఇంకేం చెయ్యగలనా అని వెదుకుతున్నాను"

"నీకు నువ్వు తక్కువగా అంచనా వేసుకోవద్దు. నువ్వేమైనా చెయ్యగలవు"

"ఏం చెయ్యమంటావో చెప్పు" సూటిగా అడిగాడు.

సమాధానం ముందుగానే సిద్ధం చేసుకున్న రజియా అంది "కన్సల్టెన్సీ ప్రారంభించు. మేన్‌పవర్ సప్లై కంపెనీ అన్నమాట"

"అంటే..."

"ఇప్పుడు ప్రతీదీ అవుట్ సోర్సింగ్‌కి ఇచ్చేస్తున్నారు. ఉద్యోగుల్ని స్వంతంగా మెయిన్‌టెన్ చెయ్యకుండా కొన్ని కొన్ని విభాగాలని, ఉద్యోగాలని బయటివారికిచ్చేస్తున్నారు. సాఫ్ట్‌వేర్ కంపెనీల్లోని కేంటీన్లని మెయిన్‌టెనెన్స్‌నీ, ట్రాన్స్‌పోర్ట్‌నీ కాంట్రాక్టుకిచ్చేస్తున్నారు. అలాటివి చెయ్యొచ్చు లేదా కన్సల్టెన్సీ ప్రారంభించి సెక్యూరిటీ గార్డుల్ని ఆఫీసులకీ, షాపులకి, మాల్స్‌కి, బ్యాంకులకీ, ఎపార్ట్‌మెంట్లకీ సప్లై చెయ్యొచ్చు"

"ఎలా గెలాగా? "

"సెక్యూరిటీ గార్డులకి చాలా డిమాండ్ వుంది. యువకుల్ని, పెద్దవాళ్ళనీ కూడా సెలక్టు చేసుకుని ఎక్స్‌సర్వీస్‌మెన్ చేత పదిరోజులు ట్రయినింగ్ ఇప్పించి యూనిఫాం వేయిస్తే చాలు సెక్యూరిటీ గార్డ్ రెడీ. వాళ్ళు క్రమం తప్పకుండా డ్యూటీకెళ్ళేట్లు చూడాలి. కొందర్ని అదనంగా వుంచుకుని ఎవరైనా సెలవు పెడితే వారి స్థానంలో పంపించాలి. ఆయా సంస్థలకి ఎలాంటి ఇబ్బందీ రాకుండా చూడాలి. వారి జీతాన్ని కంపెనీలు నీకు డైరెక్టుగా చెల్లిస్తాయి. నువ్వు కొంత పెర్సంటేజ్ తీసుకుని మిగతాది వాళ్ళకి జీతంగా ఇస్తావు"

"ఇదేదో బాగానే వున్నట్టుందే"

"స్కిల్డ్ వర్కర్లని కూడా కన్సల్టెన్సీ ద్వారానే తీసుకోవడం ఈమధ్యే మొదలైంది. అమెరికాలో ఉద్యోగుల్ని కన్సల్టెన్సీ ద్వారానే తీసుకుంటారు. అంటే యజమానికీ ఉద్యోగికీ డైరెక్టుగా జీతభత్యాల విషయంలో సర్వీసు విషయంలో ఎలాంటి సంబంధమూ ఉండదన్నమాట"

"ఒకే డన్. ఇలాంటి కొత్తపుంతలు తొక్కకపోతే తుప్పుపట్టి పోతాం. ఆఫీసు ఎక్కడ పెడితే బావుంటుందో చూడు. స్టార్ట్ చేసేస్తాను. మా ఫ్యాక్టరీలోనూ నాన్నగారి కంపెనీలోనూ ఉద్యోగాలు పోగొట్టుకున్న కొందరికైనా ఉపాధి కల్పించిన వాడ్నవుతాను"

"దట్స్ వై ఐ లైక్యూ" గబుక్కునొచ్చి అతడ్ని ముద్దు పెట్టుకుంది రజియా.

★ ★ ★

"ఒక్కసారి అమ్మాయిని చూసొద్దామండీ. రోజూ కలలోకి వస్తోంది..." భయం భయంగా అంది కనకం.

మీదపడి కురవబోయే ఆమె కళ్ళల్లో కదిలిన తడి చూసి ఆగిపోయాడు వెంకన్న.

"దాన్ని మర్చిపోవడం మంచిది"

"పేగు తెంచుకుని పుట్టిన బిడ్డ. ఎలా మర్చిపోగలను? "

"పదిమందిలో తలవంపులు తెస్తోంది..."

"మీరలా అనుకుంటున్నారుగాని అంతా ఎంత పొగుడుతున్నారో మీకు తెలీదూ? అభిమాన సంఘాలు కూడా పెట్టేరట..."

"పిచ్చోళ్ళు అన్నిచోట్లా వుంటారు"

"అబ్బాయీ కోడలూ సుఖంగా వున్నారు. అమ్మాయీ అల్లుడు కూడా సుఖసంతోషాలతో తులతూగుతూండి వుంటారు. ఈ కళ్ళతో ఒక్కసారి చూసొద్దాం..."

ఆమె అభ్యర్థనని త్రోసిరాజన లేకపోయాడు.

గోపీకి చెప్పలేక రజియా ముందు తమ కోరిక వ్యక్తపరిచారు.

"వెళ్ళిరండి ఆంటీ. మీ కూతుర్ని చూసి రావడానికి మీకెవరి పర్మిషనూ అక్కర్లేదు..."

మల్లికకి ఇష్టమైన మైసూర్‌పాక్ ప్రత్యేకంగా తయారుచేసి తీసుకెళ్లారు.

కృష్ణానగర్లో ఉన్న ఆమె ఇంటి కెళ్లారు. చిన్న డాబా ఇల్లు. ముచ్చటగా వుంది. సంకోచిస్తూనే లోపలికెళ్ళారు.

మల్లిక, సోంబాబు ఎక్కడికో వెళ్ళడానికి రెడీ అవుతున్నారు. వారిని చూసి విస్తుబోయారు. అదే సమయంలో ఇబ్బందిగానూ చూశారు.

"బాగున్నావా తల్లీ" దగ్గరికెళ్ళి ఆప్యాయంగా పలకరించింది కనకం.

"మిమ్మల్నెవరు రమ్మన్నారు? "

సూటిగా ప్రశ్నించేసరికి అవాక్కయ్యారు.

"రెండు చేతుల్లో సంపాదిస్తున్నావుకదా కాస్త విదుపుతావని వచ్చారు. స్టేటస్ మెయిన్‌టెయిన్ చెయ్యడానికి మనమెంత అవస్థపడుతోందీ వాళ్ళకేం తెలుస్తుందీ!" అదోలా నవ్వేడు సోంబాబు.

## కొత్తగాలి...

**వాడొక వర్ణం**
**నేనొక వర్ణం**
**అందర్నీ కలిపేది**
**త్రివర్ణం**

- పాయసం సుబ్రహ్మణ్య మహర్షి, నెల్లూరు

"నీ సొమ్ము కోసం రాలేదు. నీ సంతోషం చూసెళ్దామని వచ్చాం"

"ఇంకెప్పుడూ రావద్దు. మా పేరెంట్స్ బిజినెస్ మాగ్నెట్స్ అని చెబుతున్నాను. మీరని మీడియాకి తెలిస్తే పరువు పోతుంది"

నల్ల కళ్ళజోడు, ఫ్యాషన్ దుస్తులు, హైహీల్స్ ధరించిన ఈ మల్లికకీ, తమ బిడ్డ మల్లికకీ పోలికే లేదనిపించింది.

"నీకిష్టమని మైసూరుపాక్ చేసి తెచ్చాను మల్లికా. నా చేతుల్తో తినిపించి ఎన్నాళ్ళయిందో" ఒక ముక్కతీసి కూతురి నోట్లో పెట్టబోయింది.

"అక్కడ పెట్టండి. కృష్ణా స్వీట్సూ, పుల్లారెడ్డి స్వీట్సూ తప్ప ఇంకేవీ తినదు. నానా చెత్త తింటే ఫుడ్ పాయిజన్ అవ్వొచ్చు" అన్నాడు సోంబాబు.

"అయిందిగా సంబడం. ఇంక బయల్దేరు" అన్నాడు వెంకన్న కోపంగా.

సీట్సు డబ్బాని టీపాయ్ మీద పెట్టింది.

నీళ్ళు నిండిన కళ్ళతో కూతుర్ని చూసి నిట్టూరుస్తూ వెనుదిరింది కనకం!

★ ★ ★

నీరసంగా ఉన్నాసరే లెక్క చెయ్యకుండా కంపెనీ కెళ్ళాడు వెంకన్న. జనమంతా గేటు దగ్గరే ఉన్నారు. వాచ్ డివిజన్‌లోకి ఎవర్నీ అడుగు పెట్టనివ్వలేదు. ఊహిం చని పరిణామానికి అవాక్కయ్యారు.

ప్రభుత్వం ఫ్యాక్టరీని మూసేసిందన్నారు. అందర్నీ వెనక్కెళ్ళి పొమ్మన్నారు.

ఇదేం అన్యాయమని ప్రశ్నించారు. ఫ్యాక్టరీని నమ్ముకున్న మా బతుకులేం కావాలన్నారు. జవాబిచ్చే నాథుడు లేడు.

కార్మిక నాయకులు ఆవేశపడ్డారు. కార్మికులు ఉద్రిక్తులై ఊగిపోతున్నారు.

సెక్యూరిటీ అధికార్లతో ఫ్యాక్టరీ అధికార్లతో ఘర్షణకి దిగారు.

ఎలాంటి నోటీసులూ ముందు హెచ్చరికలూ లేకుండా ఒక ప్రభుత్వరంగ సంస్థని అర్థాంతరంగా మూసెయ్యడం అన్యాయమన్నారు. అమానుషమన్నారు. చట్ట వ్యతిరేకమన్నారు.

గేటు దగ్గర బైఠాయించారు కొందరు.

వాదనలూ గొడవలూ ఘర్షణ అంతకంతకీ శృతి మించుతోంది.

పోలీసులు రంగప్రవేశం చేశారు. పరిస్థితిని అదుపు చెయ్యడానికంటూ లాఠీచార్జీ చేశారు. కార్మికులు చెదరిపోయారు!

కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చిన వెంకన్న వంక సాభిప్రాయంగా చూసింది కనకం.

అతడు మాట్లాడలేదు. మొహం కాళ్ళూ చేతులూ కడుక్కొచ్చాడు.

"డ్యూటీ మధ్యలో వచ్చేశారేం. ఒంట్లో బావుండలేదా? "

"సర్కారోడి లీల మనకర్థం గాదు. ఇప్పుడెలా? " నవ్వేడు. ఆ నవ్వు భయం గొల్పగా భయం భయంగా చూసిందామె!

ఆఫీసునుంచొచ్చిన రజియా జరిగింది తెల్సుకొని బాధపడింది. అది కన్పడకుండా సర్దుకుంటూ అంది, "ఇదీ మన మంచికే అనుకోండంకుల్. ఇన్నాళ్లూ కుటుంబం కోసం రెక్కలు ముక్కలు చేసుకున్నారు. ఆవేదనతో అలమటించారు. చేసిందీ, అనుభవించిందీ చాలు. ఇకనుంచి విశ్రాంతి తీసుకోండంకుల్. మిమ్మల్ని సుఖపెట్టే బాధ్యత మాది"

కళ్ళెత్తి ఆమె వంకోసారి చూసి తలదించుకున్నాడు వెంకన్న.

★ ★ ★

"మనూరెళ్ళి పోదామనుకున్నా్రా"

రాత్రి భోజనాలయ్యాక అంతా హాల్లో చేరగానే బాంబు పేల్చాడు వెంకన్న.

ఎవరూ మాట్లాడలేకపోయారు.

అతడి మానసిక పరిస్థితిని అంచనా వెయ్యసాగారు రజియా, గోపి.

ముందుగా తేరుకున్న కనకం లబలబ లాడింది. "ఇంత బతుకూ బతికి ఇంటెన కాల చచ్చినట్టు మళ్ళీ ఆ పల్లెటూరికె ళ్తారా? నేను చచ్చినా రాను..."

"నేను వెళ్ళాలనే నిర్ణయించుకున్నాను"

"అంతా మీ ఇష్టమేనా? అసలక్కడ ఏవుందనీ బావుకోవడానికి! కొంపాగోడూ పొలమూపుత్రా గొడ్డూగోదా- ఏముంది? "

"భూమితల్లి"

"ఇక్కడున్నది భూమి కాదా? "

"ఇక్కడివారికి భూమిపైది కావాలి భూమి గుండెలక్కర్లేదు"

"చిత్రంగా మాట్లాడకండి. వయస్సు పైబడ్డాక కృష్ణారామా అనుకుంటూ కొడుకు దగ్గరుండక మారుమూల పల్లెకి పోతానంటారేమిటి ఖర్మ! అక్కడ బతక లేకే కదా ఇక్కడికొచ్చి పడింది!"

"అమ్మ చెప్పిందీ నిజమే నాన్నా. ఈ వయస్సులో ఇంక మీరేం కష్టపడలేరు..."

గోపి మాటలకి తోక తొక్కిన తాచులా లేచాడు వెంకన్న.

"అదిగో ఆ మాటంటేనే నాకు మండుద్ది. నేను పనికి రానివాడ్ని కాదు. చేవ సచ్చినోడ్నీ సత్తాలేని వాడ్నీ కాదు. చచ్చేదాకా భూదేవికి సేవ చెయ్యగలను. ఏవనుకుంటున్నారో!"

అతడి స్వాభిమానం దెబ్బతిందని గ్రహించి డామేజ్ కంట్రోల్‌కి సిద్ధపడింది రజియా.

"మీ శక్తిని తక్కువగా అంచనా వెయ్య ట్లేదంకుల్. మీరు దుక్కి దున్నగలరు. నాటు వెయ్యగలరు. కలుపు తీయగలరు. పంట పండించి ధాన్యరాశుల్ని బండ్లకెత్తగ లరు. మీరు భూమి పుత్రుడు. అసలు మీ

## కొత్తగాలి...

**గుండెకు దగ్గరగా**
**జేబుంది**
**అందుకే**
**లబ్.. డబ్..**
**డబ్బు.. డబ్బు.. అంటోంది**

— ఎన్.కె.నారా, చెరుకువాడ

అడుగులకే భూదేవి పరవశించేది!"

స్థిమితపడి తృప్తిగా చూశాడు వెంకన్న.

"మాది తల్లీబిడ్డల అనుబంధమమ్మా. మా అమ్మ ఆదిలోనే చెప్పింది. నేలని విడి చిన మొక్క బతకలేదురా అని. నేనే పిచ్చోడ్ని. వినలేదు. ఏదో బావుకుందామని వచ్చాను. ఇక్కడికొచ్చి ఏం బావుకున్నానో ఏం పోగొట్టుకున్నానో అని వెనక్కి తిరిగి చూసుకుంటే ఏముంది, అంతా శూన్యం!"

"పరిస్థితుల్ని బట్టి అలా అనిపించడం సహజం. మీకు చెప్పేంతదాన్ని కాదుగాని, జీవితం ఎప్పుడూ సరళరేఖలా వుండదు. మెట్టపల్లాలూ ఆటు పోట్లూ తప్పవు. అను భవాల ఆసరా తీసుకుంటూనే కొత్త అను భవాల కోసం ముందుకెళ్లటమే జీవితం..." రజియా అంది.

"నాకేమీ తెలీదమ్మా. నాకు తెలిసిందల్లా భూమి, నీరు, వ్యవసాయం. మా తాత రైతు. మా నాన్న రైతు. వాళ్ళు అన్నమే తిన్నారో గంజే తాగారో నాకు తెలీదు. కాని నిశ్చింతగా కన్ను మూశారు. మొన్న టివరకూ నేనూ రైతునే. కడుపు కాలు తున్నా పచ్చని చేనుని చూసి తృప్తితో కడుపు నింపుకున్నవాడ్నే. నాచేయి తగిలి విత్తనం మొలకెత్తితే, ఆకు మొన తిరిగితే, మొక్క కంకువేస్తే మురిసిపోయినవాడ్నే. అప్పుడిన్ని ఒత్తిళ్లు, వేదనలు, ఆరాటాలు, పరుగులు, నిరాశలు, చావుదెబ్బలు ఏమీ

లేవు. మల్లిక ఎండమావులెంట పరుగెడుతోంది. ఉద్ధరిస్తాడనుకున్న శీను అర్థాంతరమైపోయాడు. గోపి చావు తప్పి..." దుఃఖం పొంగిరాగా ఆగి గుండెల్నిండా గాలి పీల్చుకున్నాడు.

"ఇదంతా మట్టికి, ప్రాణధారకి దూరమైనందునే వచ్చి పడ్డాయనిపిస్తోంది. మళ్ళీ రైతుగా మారితే తప్ప మనస్సుకి శాంతి వుండేట్లు లేదు..."

"మరీ ఇంత సెంటిమెంటు పనికిరాదు. ఇప్పుడు వ్యవసాయ పరిస్థితులేం బాగోలేవు. ప్రాజెక్టులు అవినీతి వరదలో కొట్టుకుపోతున్నాయి. విత్తనాలు, ఎరువులకోసం రైతులు ఆందోళనకి దిగాల్సి వస్తోంది..." నచ్చచెప్ప చూశాడు గోపి.

"ఏమైనా కానీ నాది చాదస్తమో పిచ్చితనమో ఏదైనా అనుకో. నా మానాన నన్ను వదిలెయ్యండి. మీరు సుఖంగా వున్నారు. అది చాలీజన్మకి..."

"మీ మనఃస్థితిని నేను అర్థం చేసుకోగలను అంకుల్. మనిషిదీ ప్రకృతిదీ విడదీయరాని బంధం. నిజానికి మనిషి ప్రకృతిలోని భాగమే తప్ప విభాగం కాదు. అరవిందయోగి 'సావిత్రి'లో భర్తతో బాటు అరణ్యానికెళ్ళిన సావిత్రి స్థితి గురించి చెబుతూ ఏమన్నారో తెలుసా?"

హిందూ గ్రంథం గురించి ఆమె చెబుతోంటే గుడ్లప్పగించి అపనమ్మకంగా చూశారు ఇంటిల్లిపాదీ.

"తన శక్తికి, విశ్వశక్తికి అభిన్నత్వాన్ని, తన ప్రకృతి, విశ్వ ప్రకృతితో ఏకాత్మకతను ఆమె అనుభూతి చెందింది. ఆత్మపరంగానూ ప్రకృతి పరంగానూ ఆమె విశ్వాత్మతో విశ్వప్రకృతితో మమేకమైంది!"

వెంకన్నకేమీ అర్థం కాలేదు. కానేదో ఎంతో అర్థమైన అనుభూతి కలిగింది. ఆనందజలం ఊరింది.

"అరణ్యాలలో వేదఘోష విన్పిస్తుందిట. నిర్జనారణ్యాలలోనే మహర్షులకు దివ్యదర్శనాలు లభించాయిట. పుట్టుట, ఎదుగుట, క్షీణించుట, నశించుట అనే కాల లక్షణాల్లేని ఆత్మ గురించి తెలుసుకున్నారుట. భూమాత తద్వారా పంచభూతాలనీ ప్రకృతినీ మీరు ప్రేమించారు. ఆరాధించారు. సేవించారు. అందులో తరించాలనుకున్నారు. ప్రకృతితో అనుబంధం ఎంత గాఢంగా వుంటే ఆనందం అంత అక్షయమవుతుంది! మీరు ధన్యులు అంకుల్! మీది పిచ్చికాదు మమేకం! ఆ స్థాయిని రుషులు మాత్రమే అందుకోగలిగారు!"

అతడి కళ్లనుండి ఆనందబాష్పాలు జలజలా రాలాయి.

"నీ మాటలు వింటోంటే తల్లి భూదేవి నా గుండెల్ని నిమిరినట్టుగా వుంది. గుండెల్నిండా శాంతిని, ఆనందాన్ని, తృప్తిని నింపినట్టుంది... చాలమ్మా - నీ మాటల్ని తలచుకుంటూ మా ఊరెళ్లి నేల తల్లి సేవలో దేవుడ్ని దర్శిస్తాను..."

"మరి గీతావాక్కూ మర్చిపోకూడదు కదా అంకుల్, కర్మణ్యేవాధికారస్తే అన్నారు కృష్ణపరమాత్మ. విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించటం మీదే మనకి అధికారం వుంది. ఫలంమీద లేదు. జనం అన్నం తింటున్నారంటే అదంతా రైతుల కష్టమే. వారిఘర్మజలం సృష్టించిందే. సృష్టించడం భగవంతుడికీ రైతుకీ మాత్రమే సాధ్యం!"

"మా గుండె చప్పుడు అర్థం చేసుకున్నది నువ్వొక్కదానివే తల్లీ. ముస్లింవి అయినా మా గ్రంథాలూ చదివావు. మాకు తెలీనిది నువ్వు గ్రహించావు. నీ విజ్ఞాన సంపదకి చేతులెత్తి మొక్కాలనిపిస్తోంది. ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు చెప్పు?"

"ఇన్నేళ్ళూ రైతుగా కార్మికుడిగా కొడుకుగా తండ్రిగా మావగారిగా బాధ్యత నిర్వహించారు. ఇక తాతగా నిర్వర్తించండి..." ముసిముసిగా నవ్వుతూ అంది రజియా.

"నీళ్ళోసుకున్నావా" అడిగింది కనకం.

"నిజమేనా తల్లీ. నా చెవుల్ని నమ్మలేక

## కొత్తగాలి...

**నిశ్శబ్దం**
**ఒంటరితనంలోనా?**
**కానేకాదు**
**అందరి మధ్యే!**
**లోకం మహిమ మరి!!**

– యలమర్తి అనూరాధ, పెనుగొండ

పోతున్నాను"... వెంకన్న అడిగాడు.

సంగతి ముందే తెలిసిన గోపి మంద హాసం చేస్తూండిపోయాడు.

"నెల తప్పింది అంకుల్. ఇంకో ఆర్నెల్లలో మీరు తాత కాబోతున్నారు"

ఆశ్చర్యానందాలలో తేలియాడారంతా. వెంకన్న సంబరం అంబరాన్ని తాకింది.

"ఎంత ఆనందంగా వుందో చెప్పలేను తల్లీ. మా ఇంట మళ్లీ మా అమ్మ పుట్టబోతోంది. నట్టింట తల్లి భూదేవి నడవబోతోంది. దేవుడా! ఈ ఆనందం తట్టుకోలేక పోతున్నాను. గోపీ మనకి మళ్లీ మంచి రోజులు రాబోతున్నాయిరా. నా పిచ్చిగానీ.. రాక ఎక్కడికి పోతాయిలే. చెట్టుని అడ్డంగా నరికినా సరే మళ్ళీ చిగురిస్తుంది. కొత్త ఊపిరి పోసుకుంటుంది. సరికొత్త జవజీవాలతో మళ్లీ కళకళలాడుతుంది..."

ఆనందోద్వేగంతో చెబుతుంటే ఫోన్ మోగింది. అవతలి మాటలూ విన్నాడు. వెర్రి సంబరంతో ఊగిపోయాడు. కొత్త నీరొచ్చిన నదిలా జీవకళతో వెలిగిపోతున్న అతడ్ని చూసి ఆశ్చర్యచకితులయ్యారంతా.

"మా కంపెనీ మేనేజర్ రామానందం సార్ వ్యవసాయం చెయ్యడానికి నాలాంటి అనుభవజ్ఞుడి కోసం వెతుకుతున్నాట్ట. నేనిదివరకు వ్యవసాయదారుడ్నని ఆయనకు సూపర్వైజర్ పాణి చెప్పేట్ట. రేపొచ్చి అన్నీ వివరిస్తానన్నారు..."

"వెదకబోయిన తీగ కాళ్ళకడ్డం పడిందన్నమాట. అన్నీ నువ్వనుకున్నట్టే జరుగుతాయి. అనవరసపు ఆలోచనలు పెట్టుకోక హాయిగా నిద్రపో" అన్నాడు గోపి.

మర్నాడు రామానందం వెంకన్నని కారులో నగర శివార్లకు తీసుకెళ్ళారు.

"అయితే ఒరిజినల్‌గా నువ్వు రైతువన్న మాట" డ్రైవ్ చేస్తూ అన్నారు.

"అవునండి. వరి పండించాను. టైగర్ ప్రాన్ క్రాపు తీశాను. కొబ్బరిచెట్లు పెంచాను. ఆ పనీ ఈ పనీ అని లేదండి, అన్ని పనులూ చేస్తాను. భూమన్నా మొక్కన్నా ప్రాణమండీ..."

"నువ్వీ జనారణ్యంలో కొచ్చిపడటం బ్యాడ్‌లక్. మన కంపెనీ మూసెయ్యడం మరీ బేడ్. నాలాటి వాళ్లకి వేరే వ్యాపకాలున్నాయి గనుక ఫరవాలేదు. నీలాటి చిన్నవాళ్ళే బాగా ఎఫెక్ట్ అయ్యారు..."

"రాత తప్పించుకోలేం కదండి..."

"సడన్‌గా మబ్బులు కమ్ముతున్నాయి. వానొస్తుందేమో!"

"రానివ్వండి. వానచుక్క శుభమే"

"పదేళ్ళ క్రితం కొన్నాను. మొత్తం పదిహేను ఎకరాలు. ఉద్యోగపు హడావిడిలో దాన్ని పట్టించుకోలేదు. ఇప్పుడు ఖాళీ అయ్యాను గనుక అందులో మెడిసినల్ ప్లాంట్స్ అంటే ఔషధపు మొక్కల్ని పెంచాలని చూస్తున్నాను. వాటికి ఇక్కడే గాక విదేశాల్లోనూ మంచి డిమాండ్ వుందిలే. నా ఫ్రెండొకడు అగ్రికల్చర్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాడు. అతడి పర్యవేక్షణలో, నీ ఆధ్వర్యంలో ఈ వ్యవసాయం చేబట్టాలన్నది నా ప్లాన్..."

వెంకన్న పొంగిపోయాడు.

"మీకు నేను గుర్తు రావడం నా అదృష్టమండి. మహాభాగ్యం అనుకుని చేస్తాను. మొక్కల్ని చిన్న పిల్లల్ని సాకినట్టు సాకాలండి..."

"నువ్వు రైతువి. అగ్రికల్చర్ కొత్త అని భయపడుతున్న నాకు మంచి హేండ్‌వి

దొరికావు. నెలకి నాలుగువేల జీతం ఇస్తాను. లాభంలో టెన్ పర్సెంట్ ఇస్తాను. ఈ భూమి నీదే అనుకుని మొక్కల బాగోగులు చూడాలి..."

రోడ్డు పక్కన కారునాపి పొలాల్లోకి తీసుకెళ్ళాడు. భూమి చదునుగా లేదు. ఎత్తుపల్లాలు. గుట్టలు. రకరకాల పిచ్చిమొక్కలు. అక్కడక్కడా ద్రాక్ష తోటలు. నీటి వసతి వున్నచోట వివిధ రకాల కాయగూరల మొక్కలు, పాదులు.

"ఇదిగోనయ్యా ఇక్కడ్నుంచి ఆ పెద్దగుట్టవరకూ వున్న భూమి నాదే. దీన్లోనే నువ్వు ఔషధ మొక్కలు పెంచాలి"

మట్టి గడ్డ విరిచి చూశాడు వెంకన్న.

"నేల మంచిదేనండి. బోరు వేయిస్తే బంగారం పండించొచ్చు. ఇదంతా శుభ్రం చేసి రాళ్ళూ రప్పా ఏరి చదును చేయించి దాయిపని చేస్తే చాలు దారిలో పడిపోద్ది" సంబరంగా అన్నాడు.

రామపాదం తాకి రాయి నాతి అయ్యిందో లేదో గాని రైతు పాదం తాకగానే పుడమి పులకరించింది. జీవచైతన్యం వచ్చినట్టు వినూత్న కాంతితో మెరిసిపోయింది. పుడమి తల్లికి పురిటి నొప్పులు మొదలైనట్టుగా వుంది!

వారి పునఃకలయికను మెచ్చుతూ ఆకాశం చిటా పటా ఆనందబాష్పాలు రాల్చింది. కమ్మని మట్టి వాసన ముక్కుపుటాలకు తాకింది. చల్లగాలి మేనుని ఆప్యాయంగా స్పృశించింది.

అమ్మ కడుపు చల్లగా బతకమని పంచభూతాలు రైతుని దీవిస్తున్నట్టుగా వుంది.

వెంకన్న గుండెల్లో ఆనందం జలపాతంలా దుముకుతోంది. సంతోషం ఉప్పెనలా ఎగస్తోంది. మనస్సుని మధురానుభూతులు నింపేసి నరనరంలోకీ పొంగి ప్రవహిస్తున్నాయి. శరీరంలోని అణువణువూ నవచైతన్యంతో ఉప్పొంగిపోతున్నది. వివిధ అంగాలూ ఉత్సాహంతో ఉబ్బితబ్బిబ్బవుతున్నాయి.

## కొత్తగాలి...

**ఆశ ముదిరితే**
**అవకాశం దొరికితే**
**అవినీతి నోరు**
**ఆకాశమంత**

**– అంబటి వెంకట శివారెడ్డి, యర్రగుంట్ల**

రాముని సన్నిధి లభించిన త్యాగయ్యలా, వేంకటేశ్వరుడి దర్శనం పొందిన అన్నమయ్యలా వున్నాడు.

యశోదమ్మ ఒడిలో గారాలుపోతూ ఆడుకుంటున్న బాలకృష్ణుడిలా వున్నాడు. నాగలితో దున్నటానికి పరిశీలిస్తోన్న బలరాముడిలా వున్నాడు.

సన్న వాన పెద్ద వానగా మారుతోంటే కారు దగ్గరకి పరుగెట్టారు రామానందం.

వర్షంలో తడుస్తూనే అంతా పరిశీలిస్తూ కలయతిరుగుతున్నాడు వెంకన్న. ప్రతి మొక్కనీ మట్టినీ అరచేతితో పలకరిస్తున్నాడు. సంబరంతో చిందులేస్తున్నాడు.

ఆనందతాండవం చేస్తోన్న నటరాజు గుర్తొచ్చాడు రామానందానికి. ఉత్తేజితుడై అతన్నే చూస్తుండిపోయారు. ఏదో తెలియని ఆనంద స్పందన ఆయన హృదయమంతా పరచుకోసాగింది.

సృష్టికర్త సాక్షాత్కారమయినట్టు పరవశులయ్యారు. రెప్పవేస్తే ఆ అపూర్వ దృశ్యం కరుమరుగవుద్దేమో అన్పించి ఆనందంగా అపురూపంగా చూస్తూండిపోయారు.

కాస్సేపటికి తడిసిముద్దయి వచ్చాడు వెంకన్న. ఆనందోద్విగ్నుడై అన్నాడు-

"మళ్ళీ భూమిలో నన్ను నేను విత్తనంగా విత్తుకుంటాను. మొలకెత్తుతాను. మొక్కనై మానునై ఎదుగుతాను. రైతూ ప్రకృతీ వారి అనుబంధం సత్యం నిత్యం అని ఎలుగెత్తి చాటుతాను..." ©

# కాప్షన్ మీదే - 15




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

పెళ్లి కెళుతూ పిల్లిని కట్టుకెళ్తే
ఎంగిలాకుల డిన్నర్ దొరకదేమో?
అసలే పోటీ ప్రపంచం!

–ఎం.హన్మంత్రావ్,
టోలీచౌక్, హైదరాబాద్



## కాప్షన్ మీదే -14

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

వేషము మార్చెను!
మోసము నేర్చెను!

– బుర్రి కుమార్ రాజు, గుంటూరు

ఏంటీ! ఈ పరిస్థితి...
'పెళ్లి' మాస్క్‌తో బతకాల్సిన దుస్థితి.
'కుక్క' బతుకంటే ఇదే నేమో?

– షేక్ రియాజ్ అలీ, గూడూరు

రాజకీయాల్లోకి
అడుగుపెట్టాలంటే తప్పదు మరి!

– బి.ఎన్.దామోదరం, అనంతపురం

అబ్బా ! ఈ డబుల్ యాక్షన్
చేయలేక ఛస్తున్నా.
ఓ పిల్లిని కూడా పెంచుకోవచ్చుగా

– ఎం.రాధారాణి
mrr58@yahoo.com




# ఆమె ఎందుకేడ్చింది?

**ట్యాం**క్ బండ్ బస్టాప్‌లో బస్‌కోసం నిల్చున్నాడు శంకర్రావు. సాయంత్రంవేళ కావడంతో ట్రాఫిక్ విపరీతంగా ఉంది. సమీపంలో ఏదో చిరుశబ్దం విన్పించి తల తిప్పి పక్కకు చూశాడు శంకర్రావు.

పద్నాలుగు, పదిహేనేళ్లుంటాయేమో- ఓ పిల్ల, బలవంతాన దుఃఖాన్ని దిగమింగుకుంటూ నిలబడి ఉంది. సాధారణ పంజాబీ డ్రెస్, ఓ చేతిలో సెల్‌ఫోన్, మరోచేతిలో హ్యాండ్‌బ్యాగ్! చాలాసేపట్నుంచీ ఏడుస్తోందేమో కళ్ల కాటుక చెరిగి బుగ్గలమీద పల్చగా చారికలు!

ఆమెనలా చూస్తుంటే శంకర్రావు కడుపు తరుక్కుపోయింది. పాపం ఏం కష్టం వచ్చిందో పిచ్చి తల్లికి? అనుకుని పలకరించ బోయేంతలో వడివడిగా నడిచి అల్లంత దూరాన వెళ్లి నిలబడింది.. దాంతో మౌనంగా ఆమెనే గమనిస్తూ తనున్న చోటే నిలబడ్డాడు శంకర్రావు.

శంకర్రావు ఆలోచనలు ఆ పిల్లచుట్టే గిరికీలు కొడ్తున్నాయి. పిల్ల లక్షణంగా ఉంది.

పోతబోసిన బొమ్మలా ఉంది. ఏ వెధవ ఏడిపించి చచ్చాడో? వాడికేం పోయేకాలం వచ్చిందో? ఇంతకీ ఆమె చేతిలో డబ్బులున్నాయో? లేవో? సెల్ ఉందిగా ఇంటికి ఫోన్ చేస్తుందిలే? అయినా అందులో బ్యాలెన్సు ఉందో లేదో? తనకి తెలుసు. చాలామంది ఆడపిల్లలు ఇన్‌కమింగ్ కోసం సెల్ వాడుతుంటారు. ఎవరిదాకానో ఎందుకు? తన కూతురు బిందు సెల్‌లో ఎప్పుడూ బ్యాలెన్స్ ఉండదు. తనో లేదంటే వాళ్లన్నయ్యో కాల్‌చేసి ఎక్కడుందీ ఏమిటి, ఎన్నింటికి వస్తుందీ కనుక్కుంటూ ఉంటారు.. అయినా ఈ పిల్ల మిస్డ్‌కాల్ అయినా ఇవ్వవచ్చుగదా? ఫలానా చోట ఉన్నానని..

అంతలోనే ఓఆటో ఆమె దగ్గర ఆగడం, ఏడుస్తూనే ఆమె చటుక్కున ఎక్కడం చూసి వణికిపోయాడు శంకర్రావు. ఆడపిల్లల్ని మాయమాటలతో ఆటో ఎక్కించుకుని తీసుకెళ్లి సామూహిక అత్యాచారాలు చేసిన ఆటోడ్రైవర్ల వార్తలన్నీ బుర్రలో తిరిగాయి.. గొర్రె కసాయివాడ్ని నమ్మినట్టు ఈకాలపు ఆడపిల్లలంతా ఇంతే! తాడును పామనుకుంటారు పామును తాడనుకుంటారు.. లేకపోతే ఇందాక తను పలకరించబోతే విసవిసా వెళ్లిన మహాతల్లి తగుదునమ్మా అని ఆటో ఎక్కుతుందా? చేతిలో కానీలేదు, సెల్‌లో బ్యాలెన్స్‌లేదు.. (అతనలా తీర్మానించేసుకున్నాడు) ఇదేంటి ఖర్మ? ఇప్పుడెలా? అని తత్తరపడుతున్న శంకర్రావు ముందు ఓ ఖాళీ ఆటో ఆగింది. మరేం ఆలోచించకుండా అదెక్కి ముందుపోయే ఆటోను ఫాలోకమ్మన్నాడు. ఆటోవాడు అదోలా చూసి, మౌనంగా ఆ ఆటోవెనకే తన ఆటో పరుగెత్తించాడు.

ఆ పిల్లకు ఆటోవాడు ఎలాంటి హాని కలిగించకూడదని మనసులోనే దేవుళ్లకు మొక్కుతున్నా.. వాడామె శరీరాన్ని ఆక్రమించుకుంటున్న దృశ్యాలు కళ్లముందు తిరుగుతుండడంతో బాధగా మూలిగాడు శంకర్రావు. ఎలాగైనా ఈ పసిదాన్ని కాపాడాలి. ఆమెని చూస్తుంటే అతనికి తన కూతురు బిందూయే గుర్తుకు వస్తోంది..

అంతలో ముందున్న ఆటో మాయమైంది.. ఆటోడ్రైవర్ ఆ మాట చెప్పడంతో శంకర్రావులో ఆందోళన పెరిగింది. అధిక రక్తపోటు కారణంగా ముఖం ఎర్రబడిపోయింది. దగ్గరల్లో ఉన్న పోలీస్‌స్టేషన్‌కు పోనిమ్మని ఆదేశించాడు.

ఆశ్చర్యం? శంకర్రావు ఆటో పోలీస్‌స్టేషన్ ఆవరణలోకి వచ్చేసరికి అక్కడ ఆ పిల్ల ఎక్కివచ్చిన ఆటో కన్పించింది. దాన్ని ఆనుకుని బీడీ తాగుతూ నిలబడ్డాడు దాని డ్రైవర్. శంకర్రావు ప్రాణాలు కుదుటపడ్డాయి. తనొచ్చిన ఆటోను డబ్బిచ్చి పంపేసి అతన్ని సమీపించాడు శంకర్రావు.

'నై ఆతా సాబ్! గీడ కొంచెం పనుంది' అన్నాడు ఆటోడ్రైవర్.

'వోబాత్ నై బయి..' అంటూ ఆ పిల్ల గురించి వాకబు చేశాడు శంకర్రావు.

'బహుత్ పరేశాని మేటర్ సాబ్! వో లడ్కీ కుచ్‌నై బోల్తీ.. ఏడుస్తనే ఉంది.. ఇస్కేలియే సీదా ఠానాకు తెచ్చినా.. బయట కూర్చోమన్నాడు హవల్దార్‌సాబ్'

'ఆపిల్ల ఎక్కడుంది?'

'అందర్ హై సాబ్! ఇన్‌స్పెక్టర్‌సాబ్ మాట్లాడుతుండు సాబ్'

మాటల్లో ఆ ఆటోడ్రైవర్ పేరు ఖాశిం అని తెలిసింది. చాలా మంచోడు. ఇతన్నా తాను అనుమానించింది అనుకుని మనసులోనే చెంపలు వేసుకున్నాడు శంకర్రావు. బస్టాప్‌లో తనామెను గమనించిన సంగతి చెప్పి ఎలాగైనా ఆమెను రక్షించాలనే వచ్చానన్నాడు.. అదే సమయంలో అతన్ని తను అనుమానించిన విషయం చెప్పి 'ముజే మాఫ్‌కీజియే ఖాశిం భాయ్' అన్నాడు పశ్చాత్తాప హృదయంతో. ఖాశిం చిరునవ్వు నవ్వాడు.

అరగంటైనా ఆమె బయటకు రాలేదు.. లోపల ఏం జరుగుతోంది? లోనికి వెళ్దామంటే సెంట్రీ వాళ్లను వెళ్లనీయడంలేదు.

'శంకర్రావు సాబ్ ఏం చేద్దాం? ఏ ఖాకీ వాలోం పూరా గలత్ ఆద్మీ.. నమ్మడానికి లేదు పిల్లను లోన ఏంచేస్తన్నారో? '

'నాకూ అదే అనుమానం ఖాశిం బాయ్.. ఎన్ని సిన్మాల్లో చూడలేదు? ఎన్ని పేపర్లలో చదవలేదు లాకప్ రేప్‌లు, లాకప్‌డెత్‌లు? పాపం చిన్నపిల్ల!' అన్నాడు శంకర్రావు భయం భయంగా.

మరో అరగంట గడిచింది.

ఇన్‌స్పెక్టర్ పిలుస్తున్నాడని సెంట్రీ చెప్పడంతో ఖాశిం, శంకర్రావులు హడావుడిగా లోనికి వెళ్లారు. ఆ పిల్ల ఇన్‌స్పెక్టర్ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని ఉంది..

'సాబ్ ఏ మేరా దోస్త్ శంకర్రావు..' అంటూ అతని గురించి ఇన్‌స్పెక్టర్‌కు అంతా చెప్పాడు ఖాశిం.

ఇన్‌స్పెక్టర్ మొహంలో చిరునవ్వు.

'ఈ పిల్ల తెలుగమ్మాయి కాదు. మరాఠా పిల్ల! ఆమెకు ఆ భాషతప్ప మరేం రాదు. డిగ్రీ చదివిన రోజుల్లో మహారాష్ట్రలో కొన్నాళ్లున్నాన్లే! ఒకటీ అరా ముక్క మరాఠా తెలుసు. ఆ నాలెడ్జితో ఆరా తీశా! తల్లిదండ్రులతో నగరానికి వచ్చిందట.. ఎన్టీఆర్ పార్క్‌వద్ద తప్పిపోయింది.. సెల్ పనిచేయడంలేదు.. చేతిలో డబ్బుల్లేవు.. ఇప్పటికే సమాచారం సిటీలోని అన్ని పోలీస్ స్టేషన్లకు పంపాం. ఆమె తల్లిదండ్రులు ఏ స్టేషన్‌కు వచ్చినా ఇక్కడికి పిలిపించి వారి బిడ్డను వారికి అప్పగించేస్తాం. వాళ్లెవరూ రాకపోతే రేపు మేమే స్వయంగా మహారాష్ట్ర పంపే ఏర్పాట్లు చేస్తాం.. మీరేం భయపడక్కర్లేదు.. ఇవ్వాళ రాత్రి మా పెట్రోలింగ్ టీమ్ వచ్చాక ఈమెని స్టేట్‌హోమ్‌కు పంపుతాం'

శంకర్రావు, ఖాశిం కదల్లేదు..

ఇన్‌స్పెక్టర్ రాబర్ట్ ప్రశ్నార్థకంగా వారి వంక చూశాడు.

శంకర్రావు కొద్దిగా సాహసించి 'పాపం చిన్నపిల్ల అర్ధరాత్రి స్టేషన్‌లో? ' అన్నాడు.

'అప్‌సాబ్.. పంద్రాసాల్ లడ్కీ' ఖాశిం వినయంగా చేతులు నులుముకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ రాబర్ట్‌కు కోపం వచ్చింది..

'మరేం చేయమంటారయ్యా? ' అన్నాడు కోపాన్ని అణచుకుంటూ.

'మా ఇల్లు ఇక్కడ శ్రీనగర్ కాలనీలోనే సార్! పువ్వుల్లోపెట్టి పాపను రేపు ఉదయం స్టేషన్‌లో అప్పగిస్తా.. నన్ను నమ్మండి.. నేనూ ఓ ఆడపిల్ల తండ్రినే' శంకర్రావు చేతులు జోడిస్తూ అన్నాడు.

'అప్‌సాబ్ నేను భీ ఇవ్వాళ శంకర్రావు సాబ్ ఇంట్లనే పండి కల్ సుబే సుబే పాపను తెస్తా.. నాకు భీ రెండు ఆడ పిల్లలున్నాయ్ సాబ్'

ఇన్‌స్పెక్టర్ రాబర్ట్ ఆలోచనలో పడ్డాడు. వారిద్దరూ స్టేషన్‌లో పాపకు రక్షణ ఉండదని భయపడుతున్నారు.. నిజమే వారి భయానికి ఆధారాలు కొన్ని వందలున్నాయి.. హఠాత్తుగా అతనికి తన కూతురు మేరీ గుర్తొచ్చింది. ఈ పరిస్థితి తన కూతురికి వస్తే అర్ధరాత్రి దాకా స్టేషన్‌లో ఉండడానికి తను అంగీకరిస్తాడా? అంగీకరించడు. మరిప్పుడేం చేయాలి? వాళ్లను నమ్మి, తను అమ్మాయిని వాళ్లింటికి పంపడానికి రూల్స్ ఒప్పుకుంటాయా?

అంతలో ఫోన్ మోగింది..

హెడ్‌కానిస్టేబుల్ తీశాడు.

ఆ పాప తల్లిదండ్రులు ట్యాంక్‌బండ్ పీఎస్‌లో ఉన్నారనీ, మరో పావుగంటలో ఇక్కడికి రానున్నారని సమాచారం.

అంతే! అందరికీ గొప్ప రిలీఫ్ వచ్చింది..

పాపం ఆ అమ్మాయి వాళ్లేమనుకుంటున్నారో తెలీక అయోమయంగా వారినే చూస్తూ కూర్చుంది.

–చంద్రప్రతాప్

అపార్ట్‌మెంటాలజీ 26

యర్రంశెట్టి శాయి

# గూండా నెంబర్ వన్



(గత సంచిక తరువాయి..)

"మనం చాలా పెద్ద తప్పు చేశాం గురూ" అన్నాడు విజయ్‌యాదవ్.

"ఏంటది"

"ఇందాకవాళ్ళతో రాజీకొచ్చి సూర్యారావ్‌తో ఆ క్రెడిట్‌కార్డ్ బాకీ, ఇన్‌స్టాల్‌మెంట్స్ పద్ధతిలో చెల్లగొట్టే బాధ్యత మాది అని చెప్పేస్తే- మనకి ప్రాబ్లెమ్ ఉండేది కాదు" అన్నాడు విజయ్ యాదవ్.

"ఇదంతా హమీద్‌మియా తొందరపడటంవల్లే జరిగింది" అన్నాడు రెడ్డి.

"అవ్- తప్పు ఒప్పుకుంటున్నయ్- నేనే ముందు ఆ గూండా ఒంటిమీద చేయి వేసినయ్" అన్నాడు హమీద్‌మియా.

కాసేపు తప్పంతా నీదే- అంటే నీదే అని వాదులాటలు జరిగాయ్.

ఆఖర్లో మళ్ళీ అందరం రాజీకొచ్చాం.

"ఇంతకూ రేపు వాళ్ళనెలా ఎదుర్కొందాం? ముందు డిసైడ్ చేయండి" అన్నాడు శంకరమూర్తి.

మామూలుగా తలో ఉపాయం చెప్పారు. కానీ అవేవీ మాకు నచ్చలేదు.

చివరకు కృష్ణమూర్తి ఐడియా ఇచ్చాడు.

"చూడు గురూ!! దీనికి పరిష్కారం చాలా ఈజీ!"

అందరూ అతని చుట్టూ మూగారు.

"ఏంటో చెప్పు"

"ముల్లుని ముల్లుతోనే తీయాలి, అవునా? "

కొంతమంది చిరాకుపడ్డారు.

"ఆ సామెతకీ- మనం ఉన్న పరిస్థితికీ ఏమిటి లింక్? "

"ఇంకా అర్థం కాలేదా? రేపు ఆ గూండా లొచ్చే టైమ్‌కి మనం కూడా వేరే గూండా గ్యాంగ్‌ని డబ్బుతో కొనుక్కొచ్చి వాళ్ళమీద దాడి చేయించాలి". అంతా సైలెన్స్.

అందరి బ్రెయిన్స్‌లో ఆలోచనలు.

"ఈ ఐడియా ఏదో బాగానే ఉంది" అన్నాడు మొహిందర్.

"అవ్- మంచిగానే ఉన్నయ్" అన్నాడు హమీద్‌మియా.

"కానీ మనం తీసుకొచ్చిన గూండాలు ఒకరోజు మనల్ని రక్షిస్తారనుకో! మరి మర్నాడు సంగతేంటి? మనం తీసుకొచ్చే గ్యాంగ్ రోజూ మన కాలనీలోనే ఉండి పోరు కదా? " అడిగాడు విజయ్‌యాదవ్.

కృష్ణమూర్తి చిరునవ్వు నవ్వాడు.

"చూడండి బ్రదర్! మన అసోసియేషన్‌కి ఎట్లాగో కొంత డబ్బుంది కదా! మనం ఒక గూండా గ్యాంగ్‌తో నెలకు ఇంత అని మామూలు ఇచ్చేలా అగ్రిమెంట్ చేసుకుంటే మనకి ఎప్పటికీ ప్రాబ్లెమ్ ఉండదు- ఉదాహరణకి మనం ఒక ఫ్రిజ్ కొన్నామనుకోండి అప్పుడే ఆ కంపెనీతో యాన్యువల్ మెయింటెనెన్స్ కాంట్రాక్ట్ తీసుకుంటామే.. ఇదీ అంతే"

"అంటే మన అపార్ట్‌మెంట్స్ అన్నీ గూండా గాంగ్ ప్రొటెక్షన్‌లో ఉంటాయ్ అన్నమాట. అపార్ట్‌మెంట్స్ బయట ఒక పెద్ద బోర్డ్ పెట్టేస్తాం!"

'ఈ రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ రామేశ్వర్ దాదా గ్యాంగ్ పరిరక్షణలో ఉన్నవి. ఇతర గూండా గ్యాంగ్‌ల ప్రవేశం నిషేధించడమైనది.

ఇట్లు,
రామేశ్వర్ దాదా'

అందరికీ ఐడియా నచ్చింది. వెంటనే మా ఏరియాలో కొంచెం పేరు ప్రఖ్యాతులున్న గూండాగ్యాంగ్ కోసం వెతకటం మొదలుపెట్టాం. వాటినన్నిటినీ స్టడీ చేసి చివరకు మూడు గ్యాంగ్‌లను షార్ట్‌లిస్ట్ చేశాడు విజయ్ యాదవ్.

**నెంబర్ వన్ గ్యాంగ్:** నర్సింగ్ దాదా! అతడికి హోమ్ మినిస్టర్‌తో లింక్స్ ఉన్నయ్. అందుకని మర్డర్లు చేసినా పోలీసులు అతని జోలికి రారు. పోలీస్ కానిస్టేబుల్స్, ఆఫీసర్ల ట్రాన్స్‌ఫర్లు కూడా అతను డీల్ చేస్తూంటాడు.

**నెంబర్ టూ గ్యాంగ్:** కొత్తసత్యం దాదా! ఇది కొంచెం చిల్లర గ్యాంగే. కానీ పెద్ద పెద్ద కాంట్రాక్ట్‌లు తీసుకుంటారు. వీళ్ళ స్పెషలైజేషన్ రియల్ ఎస్టేట్ గొడవల్లో మధ్యవర్తిత్వం, లాండ్‌గ్రాబ్‌లు, కబ్జాలు- 'లా' మినిస్టర్‌తో బంధుత్వం ఉంది. అందుకని వీళ్ళమీద ఎలాంటి కేసులున్నా గవర్న




మెంట్ అన్నీ ఎప్పటికప్పుడు విత్‌డ్రా చేసేసుకుంటుంది. మర్డర్లు చేసి జైలుకెళ్ళినా వాళ్ళందరినీ 'పెరోల్' మీద విడుదల చేయించేస్తుంటారు.

**నెంబర్ త్రీ గ్యాంగ్:** ఛోటూ పైల్వాన్- ఓల్డ్‌సిటీతో లింక్స్ ఉన్నయ్. వీళ్ళ దగ్గర మర్డర్స్ చేయడానికి స్పెషల్ టీమ్ ఉంది. ఆ టీమ్‌లో టెర్రరిస్టులు కూడా ఉన్నారని వినికిడి! బంగ్లాదేశ్ నుంచి డూప్లికేట్ కరెన్సీ నోట్లు తెచ్చి వాటిని తన కస్టమర్స్‌కి అమ్ముతూంటాడు.

టెర్రరిస్ట్ లింక్స్ ఉన్నవాడితో మనకు లింక్స్ ఉంటే ఎప్పటికయినా ప్రమాదమని మాకనిపించి, ఆ గ్యాంగ్‌ని ఎవాయిడ్ చేశాం.

ఇక మిగిలిన రెండు గ్యాంగ్‌లతో మేము చర్చలు జరపడానికి బయల్దేరాం. ఎందుకయినా మంచిదని మాకు కొద్దిపాటి పరిచయమున్న నర్సింగ్ దాదా శిష్యుడు రాముల్ని వెంటపెట్టుకెళ్లాం. ముందు నర్సింగ్‌దాదాని అతని ఆఫీస్‌లో కలుసుకున్నాం. చాలా పెద్ద ఏసీ రూమ్ అది.

పెద్ద టేబుల్ దగ్గర ఒక కార్పొరేట్

కంపెనీ ఎండీలాగా కూర్చుని ఉన్నాడు. కాకపోతే అతని డ్రస్ చూస్తే తెల్సిపో తోంది, కొంచెం లెవల్ తక్కువున్న కేండి డేట్ అని!

అందరం వినయంగా నమస్కరించాం.

"రాండ్రి! కూసోండ్రి" అన్నాడతను.

అందరం కూర్చున్నాం.

"ఏడకెళ్లొచ్చిన్రు? "

"మాది రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ సార్!" అన్నాడు శంకరమూర్తి.

"నాతోటి ఏంది పని? "

వెంటనే ఆ క్రెడిట్ కార్డ్ గూండాల సంగ తంతా చెప్పాం!

"వాళ్లు రేపు మళ్లీ వచ్చి మమ్మల్ని ఎటాక్ చేస్తారు సార్. మీరు మాకు ప్రొటె క్షన్ ఇవ్వాలి."

"రేపొక్కదినం ప్రొటెక్షనిస్తే చాల్తదా? "

"ఒక్కరోజు చాలదు సార్. మీరేమ యినా చేయండి. వాళ్లు మళ్లీ మా అపార్ట్ మెంట్స్‌కి రాకుండా చేయాలి సార్"

"ఇంతేనా? మర్డర్స్‌గిట్ట అవసరం లేదా? "

"అవసరం లేద్సార్"

నర్సింగ్‌దాదా డిజప్పాయింటయ్యాడు.

"ఏమిరా రాములూ! గింత చిన్నకేసు తెచ్చినావ్? " రాములుతో అన్నాడతను.

"ఏదో జర మదద్ జేయన్నా! మనం ఎవరికి ఓటెయ్యమంటే వానికే ఓటెస్తా రీళ్లు. పురానా దోస్తానా అనుకో. మస్తు సార్లు వీళ్ల ఓట్లు నేనే వేసేసినా!" దాంతో నర్సింగ్ శాంతించాడు.

"సరే! హెల్ప్ జేద్దాంలే గానీ పైసలెన్ని స్తార్రా భయ్? "

మేము మొఖాలు చూసుకున్నాం!

"ఆప్ హీ బోల్‌నా సాబ్" అన్నాడు హమీద్‌మియా.

పదిలక్షల రూపాయలిస్తరా? "



ఉలిక్కిపడ్డాం.

పది లక్షలా? ? ? మావాడి క్రెడిట్ కార్డ్ బాకీయే లక్ష సార్. మీకు పది లక్షలు కట్టే బదులు ఆ బాకీ తీర్చేస్తే వాళ్లతోటి కిరికిరే ఉండదు కద్సార్" అన్నాడు మొహిందర్.

నర్సింగ్ దాదాకి మళ్లీ చిరాకేసింది.

"అరె నీయవ్వ గిసంటి చిల్లర కేసులేం దిరా రాములూ! ఇజ్జత్ తీస్తున్నావ్ బే"

"అన్నా! నేనొక్కమాట జెప్పనా అన్నా!"

"ఏందిరా అది? "

"ఈళ్లంతా గరీబోళ్లన్నా!! పైసలున్నోళ్లు కాదు. యాభైవేలు తీసుకుని మదద్ జెయ్యన్నా. అదీ ఈ ఒక్కసారికే అన్నా! తర్వాత ఆళ్లసంగతి ఆళ్లే చూసుకుంటారు"

"ఛానీయవ్వ.. యాభైవేల్రా? "

"ఈ ఒక్కసారికీ హెల్ప్ చేయండి సార్" బతిమాలాడు శంకరమూర్తి.

"నెక్స్ట్ ఎలక్షన్స్‌లో మీకు హెల్ప్ చేస్తాం సార్. మీరెవరికి ఓటెయ్యమంటే వాళ్లకే వేస్తాం!" చెప్పాడు రెడ్డి.

కొంచెం మెత్తబడ్డాడు నర్సింగ్ దాదా.

"ఎన్ని ఓట్లున్నయ్ మీ తాన?

"మొత్తం ఎనిమిదొందల తొంభయ్ ఆరున్నయ్ సార్"

"మస్తుగానే ఉన్నయ్" ఆలోచనలో

పడుతూ అన్నాడు. రెండు నిమిషాలు ఆలోచించాక చిరునవ్వుతో మా వంక చూశాడు...

"ఓకేరా భయ్! మీ ఓట్ల గురించి మీకు మదద్ జేస్తున్నా. ఆ యాభైవేలూ ఎప్పుడి స్తారు? "

"ఇంకో గంటలో తెచ్చిస్తాం సార్"

"సరే, ఇంక బేఫికరుండండి! ఆ గూండా గాళ్ళ సంగతేందో నేన్జూసుకుంటా!"

"అలానే సార్. థాంక్యూ సార్"

అందరం అపార్ట్‌మెంట్స్‌కి చేరుకుని మా సొసైటీ ఫండ్స్‌లో నుంచి యాభైవేలు డ్రా చేసి రాములుకిచ్చి పంపించాం. ఆ డబ్బు మాకు ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో కడతానని ప్రామిస్ చేశాడు సూర్యారావ్.

★ ★ ★

మర్నాడు ఒక మినీబస్ వచ్చి ఆగింది మా అపార్ట్‌మెంట్స్ ముందు. అందులో నుంచి తల్వార్లు, కత్తులు తీసుకుని క్రెడిట్ కార్డ్ గూండాల గ్యాంగ్ దిగారు. మొత్తం అరడజను మందున్నారు. మేమంతా మా అపార్ట్‌మెంట్స్ ఆవరణలోనే కుర్చీల్లో కూర్చుని పేకాడుకుంటున్నాం.

"అరుగో వచ్చారు!" అన్నాడు విజయ్ యాదవ్ రహస్యంగా.

"ఎవ్వరూ వాళ్ళ సైడ్ చూడకండి" అన్నాడు శంకరమూర్తి. వాళ్ళు వస్తూనే కేకలు వేయటం మొదలుపెట్టారు.

"సాలే.. బాడుకవ్. ఎవర్రా ఈడ దాదా గిరి జేస్తున్రు? సాలే.. ఒక్కొక్కడిని ఏరి ఖతమ్ జేస్తాం" అంటూ మాకు సమీపంగా వచ్చేశారు.

అంతవరకూ గోడ వెనుక నిలబడి ఉన్న నర్సింగ్ దాదా తన గ్యాంగ్ మెంబర్స్‌తో వాళ్ళకెదురుగ్గా వచ్చాడు.

"ఎవర్రా మీరు? ఏందీడకొచ్చి రుబాబ్ జేస్తున్రు? " నర్సింగ్ దాదా అరిచేసరికి వాళ్ళంతా ఠక్కున నిలబడిపోయారు.

వాళ్ళ మొఖాల్లో షాక్.. భయం.

"మాకు ఈళ్ళల్లో ఒకడు క్రెడిట్‌కార్డ్ పైసలు కట్టాల్నన్నా"

"ఆడు కట్టడుబే. ఏం చేస్తావ్? "

వాళ్ళు ఖంగారుపడిపోయారు.

"అది కాదన్నా.. వీళ్ళు నిన్న మా బాస్ మీద రువాబు జేసిన్రు"

"బరాబర్ జేస్తారు బే. ఏం జేస్తావ్ నువ్వు? "

వాళ్ళకింకేం మాట్లాడాలో అర్థం కావటం లేదు.

"అది కాదన్నా.."

"ఏయ్ - ఇగో నేన్జెప్తున్నా.. ఇనండ్రి! ఈ అపార్ట్‌మెంట్స్ నాది. నా ఇలాకాల ఉన్నది! ఈడకి ఎవ్వడు రావాలన్నాగానీ నా పర్మిషన్ తీసుకోవాలె. సమజైందా? "

"ఇది నీ ఏరియా అని మాకెరుకలేకుండె నన్నా"

"ఇప్పుడెరుకయింది కదుబే. ఇంక ఛురా యించండ్రి!

"ఇక గల్తీల కూడా ఇటు దిక్కు రావొద్దు. నేం జెప్తున్నా? "

"సరేనన్నా. నువ్ జెప్పినాంక ఇంకెందు కొస్తాం? "

"మరింక నిలబడ్డారెందుకురా? "

వాళ్ళు వెనక్కు తిరిగారు.

ఆ తరువాత మళ్ళీ ఎప్పుడూ మా అపార్ట్‌మెంట్స్ వేపు తిరిగి కూడా చూళ్లేదు వాళ్ళు.

ఇది జరిగిన వారం రోజులకు ఓ పెద్ద ఏసీ బస్ వచ్చి మా అపార్ట్‌మెంట్స్ ముందాగింది.

అందులో నుంచి పాతికమంది గన్స్ పట్టుకుని దిగారు.

సఫారీసూట్ ఉన్న వాళ్ళ లీడర్ లోపలి కొస్తూంటే మా వాచ్‌మెన్ అడ్డు వెళ్ళాడు.

"ఎవరికోసం సార్? ఈ బుక్‌లో ఎంట్రీ చేసి వెళ్ళాలి సార్" అంటూండగానే నలు



గురు ముందుకొచ్చి వాడిని అమాంతం ఎత్తుకెళ్లి ఆ బస్‌లో పడేశారు. మేమంతా స్టన్నయిపోయాం.

ఏదో గొడవ జరగబోతూందని అర్థమయిపోయింది. వెంటనే నర్సింగ్ దాదాకి ఫోన్ కొట్టాం!

"ఏంది సంగతి? " అడిగాడు నర్సింగ్ దాదా.

"మళ్లీ ఎవరో గూండాలొచ్చారన్నా! ఈసారి చాలా ఎక్కువమంది ఉన్నారు"

"అట్లనే? నేనిప్పుడే అస్తున్నా!"

ఆ మాటతో మాకు ధైర్యం వచ్చేసింది.

"ఏయ్.. ఈ అపార్ట్‌మెంట్స్‌కి ప్రెసిడెంట్ ఎవళు? " సఫారీ సూట్ మమ్మల్ని అడిగాడు.

"నేనే.. నువ్వెవరు? " అంటూ ఎదురు ప్రశ్న వేశాడు హమీద్‌మియా.

"నా సంగతి తర్వాత తెలుస్తదిగానీ ఈడేందిరా పేద్ద పీకుడుగాని లెక్క రుబాబ్ చేస్తున్నావంట? క్రెడిట్ కార్డ్ బాకీలు అడగటానికి వచ్చినోళ్ళమీద వేరే గూండాలతో ఎటాక్ జేయిస్తున్నావంట? "

మాకెవరికీ వాడి మాటలకు గానీ, వాడి జనాన్ని చూసి గానీ భయం వేయలేదు. ఎందుకంటే ఇంకో నిమిషంలో ఎలాగూ మా నర్సింగ్ దాదా దిగుతాడని మాకు తెలుసు.

"అవ్- మా అపార్ట్‌మెంట్ కొచ్చి ఆళ్ళు రుబాబ్ చేస్తున్రు. అందుకని వాళ్ళను బొక్క లిరగ్గొట్టి బయటకు నూకినాం" అన్నాడు విజయ్‌యాదవ్ ఛాతీ విరుచుకుని.

"సాలే ఛాతీ ఇరిచి మాట్లాడుతున్నావేంది బే- నిన్నూ, ఈ ప్రెసిడెంట్‌నీ, మీకు సపోర్ట్ ఇచ్చినోళ్ళనీ- అందర్నీ ఈడనే ఖతమ్ జేసి ఈడనే పాతి పెడతాం! ఎరుకనా? "

అయినా గానీ మేము వాడి మాటలు లైట్ తీసుకున్నాం! ఎందుకంటే మా నర్సింగ్ దాదా వచ్చాడంటే ఇప్పుడు వచ్చిన వాళ్లంతా పిల్లులయిపోయి 'మ్యావ్ మ్యావ్' అంటూ వాడి కాళ్ళ చుట్టూ తిరగాల్సిందేనని మాకు తెలుసు.

"అట్టనా! మమ్మల్ని ఖతమ్ జేసేలోపలే నిన్నూ, నీ గ్యాంగ్‌నీ సమాధి చేస్తాం బే" అన్నాడు రెడ్డి.

ఆ మాట పూర్తయినా అవలేదు. ఆ గ్యాంగ్‌లో నలుగురు ముందుకొచ్చి రెడ్డినీ, విజయ్ యాదవ్‌నీ ఈడ్చుకెళ్లి బస్‌లోకి తోశారు.

మేము షాక్ అయిపోయాం. వెంటనే ఈ విషయం మరోసారి దాదాకి, చెప్దామని హమీద్‌మియా ఫోన్ చేస్తూంటే ఆ గూండాలు సెల్‌ఫోన్ లాక్కుని నేలకేసి కొట్టేసరికి అది రెండు ముక్కలయింది.

"ఎవళ్లకిరా ఫోన్ చేస్తున్నావ్ సాలే. ఏడీ.. ఆ సూర్యారావ్‌గాడిని పిలు" అరచాడతను.

మధ్యలో నిలబడ్డ సూర్యారావ్ ఏమాత్రం భయపడకుండా ముందుకొచ్చాడు.

"నేనే సూర్యారావున్నా! అయితే ఏంటి? " అంటూండగానే లాగి గూబమీద కొట్టాడో కడు.

సూర్యారావ్ గావుకేక పెట్టి కింద

పడ్డాడు.

మాకేం చేయాలో తోచటంలేదు.

సమయానికి భగవంతుడిలా జీప్ దిగాడు నర్సింగ్ దాదా.

ఆ సంతోషం తట్టుకోలేక అందరం తప్పట్లు కొట్టాం.

"నర్సింగ్ దాదా జిందాబాద్"

నర్సింగ్‌దాదా జిందాబాద్.. జిందాబాద్"

"దేశ్‌కీ నేతా కైసే హో.. నర్సింగ్ దాదా జైసేహో"

నర్సింగ్ యాదవ్ హేపీగా ఆ నినాదాలు వింటూ హీరోలా నడచి మా దగ్గరకొచ్చాడు.

"ఎవఁళ్లా మీ మీద ఎటాక్ చేస్తోంది? " అనడిగాడు మా అందరి వంకా చూస్తూ.

"నేనే బే" అంటూ పక్కనుంచి ముందు కొచ్చాడు సఫారీ సూటు.

ఆ సఫారీ సూటువాడిని మా నర్సింగ్ దాదా ఇంక ఫుట్‌బాల్ ఆడతాడని మా కర్థమయింది. లేకపోతే అంత గొప్ప నర్సింగ్‌దాదాని పట్టుకుని 'బే' అంటాడా?

"ఈ సఫారీ సూటోడికి ఇవాళ నర్సింగ్ దాదా చేతిలో చావు రాసిపెట్టి ఉన్నట్లే" అన్నాడు రెడ్డి ఉత్సాహంగా.

కానీ అక్కడ మేమంతా షాక్ అయే సీన్ జరిగింది.

అంత పెద్ద ఎత్తున భీకరంగా అరుస్తూ ఛాలెంజ్ చేసిన నర్సింగ్ దాదా ఆ సఫారీ సూట్‌ని చూడగానే నెత్తిమీద పిడుగు పడినట్లు అదిరిపడ్డాడు.

"ఉస్తాద్! నువ్వా! మాఫ్ కరోనా ఉస్తాద్. నువ్వని నాకు తెల్వనే తెల్వక పాయె-" అంటూ అతని కాళ్ళు కళ్ళ కద్దుకున్నాడు. మాకు మతిపోయింది.

"ఠీక్ హై" అన్నాడు సఫారీవాలా.

"నువ్వీడకొచ్చినావేంటి ఉస్తాద్. కాకితో కబురంపితే నేను నిమిషాల్లో నీ దగ్గర వాలకపోతినా? " అన్నాడు నర్సింగ్ దాదా.

"గిసంటి చిల్లర్ కేసులు మనం చూడం గానీ- ఆ బ్యాంక్ ఛైర్మన్‌గాడు ఇంటికొచ్చి కాళ్లమీద పడ్డాడు భయ్."

"ఈ క్రెడిట్ కార్డోళ్ళు పైసలు కట్టక మా బ్యాంక్ మూతపడేటట్లున్నది సార్! నువ్వా బాకీలు వసూలు చేసివ్వకుంటే మేము పెండ్లాం బిడ్డలతో రోడ్డున పడాలంటూ ఒక్కటే ఏడుపు.



నా దొంగ అకౌంట్లన్నీ ఆడి బ్యాంక్‌లోనే ఉండెగదా. దాన్దిక్కు కెళ్లి డిప్యూటీ జనరల్ మేనేజర్ రికవరీస్ పోస్ట్‌లో జాయినవనీకి వప్పుకున్నా. జీతం జరంత తక్కువే అనుకో. నెలకు రెండు లక్షలు. ప్లస్ వసూలు చేసిన మొండి బాకీలమీద టెన్ పర్సెంట్ కమీషన్. మొత్తం బాకీలన్నీ వసూలు గిట్టజేస్తే సంవత్సరంలో రెండు కోట్లు కమాయించచ్చు. ఇదిగాక మనకి మర్డర్స్ బిజినెస్ అలగ్ ఉండనే ఉన్నది. ఎంత లేదన్నా స్టేట్‌ల నెలకు యాభై మందిని లేపేయానికి కాంట్రాక్ట్‌లు దొరుకు తయ్- అంటే పాతిక్కోట్లు! మా గ్యాంగ్‌కీ నాకూ మస్తు- అయితే నువ్వీ అపార్ట్‌మెంటోళ్లకు ప్రొటెక్షనిస్తున్నావ్? "

"ఏదో ఉస్తాద్! వచ్చే ఎలక్షన్ల ఎమ్మెల్యేగా నిలబడాల్నని సోంచాయిస్తున్న! ఎమ్మెల్యే అయితే నా మీదున్న ఎగ్జార్షన్ కేస్‌లు, మర్డర్ కేస్‌లూ, ఏటీఎమ్ రాబరీ కేస్‌లూ- అన్నిటినుంచి తప్పించుకోవచ్చని నా ఆలోచన! మరీ అపార్ట్‌మెంటోళ్ళ దగ్గర అందాజూ రెండువేల ఓట్లున్నయ్. దాన్దిక్కుకెళ్లి జరంత మదద్ జేస్తున్నానన్నట్లు"

"ఇగో నర్సింగ్- నువొక్క విషయం అర్థం జేస్కో? మదద్‌జేస్తే జెయ్‌గానీ, క్రెడిట్ కార్డ్స్ కిరికిరిలోకి మాత్రం పోకు. ఎందుకంటే రేపటికెళ్లి 'లోన్ రికవరీ వీక్' షురూ జేస్తున్న! పైసలు కట్టనోళ్ళందర్నీ కిడ్నాప్ జేసి- మొత్తం బాకీ క్లియర్ అయ్యే వరకూ వదల"

"అట్టనే ఉస్తాద్! నువ్వెట్ట జెప్తే అట్ల"

స్పృహ తప్పిన సూర్యారావ్ ఛటుక్కున లేచి నిలబడ్డాడు.

"నేనెక్కడున్నా? " అనడిగాడు మా అందరివంకా చూస్తూ.

"యమలోకం ఎంట్రెన్స్ ఎగ్జామినేషన్ హాల్లో ఉన్నావ్ బే! పైసలు కట్టలేదనుకో. ఇంక ఎనక్కిరావ్" అన్నాడు సఫారీ.

"నా దగ్గర డబ్బు లేద్సార్"

సఫారీ తన మనుషులకు సైగలు చేయగానే వాళ్ళు అమాంతం సూర్యారావ్‌ని ఎత్తుకెళ్లి బస్‌లో పడేశారు.

సఫారీ సూటతన్ని బతిమాలాడాం.

"సార్- వాడికి ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో కట్టే ఫెసిలిటీ ఇవ్వండి సార్. ఎగ్గొట్టకుండా ప్రతినెలా కట్టించే బాధ్యత మాది" అన్నాడు శంకరమూర్తి సఫారీతో.

"నెలకు ఇరవై వేలు కట్టాలి- ఓకేనా? "

"ఆc నెలకు ఇరవైవేలా? వాడి జీతమంతా కలిపినా 20 వేలు లేద్సార్"

"లేనప్పుడు క్రెడిట్ కార్డ్‌మీద లక్షలెందుకు దొబ్బాడుబే. వాని అబ్బ ముల్లున్నదనుకుంటుండా? " మేము సైలెంట్ అయిపోయాం!

నర్సింగ్‌దాదా, సఫారీ మొత్తం అంతా ఎవరి వాహనాల్లో వాళ్ళు వెళ్ళిపోయారు.

సూర్యారావ్ భార్య వెంటనే పుట్టింటికి పరుగెత్తి- వాళ్ళ స్వంత ఇల్లు తాకట్టు పెట్టించి లక్షన్నర తీసుకొచ్చి సఫారీగ్యాంగ్‌కి కట్టేశాక గానీ సూర్యారావ్‌ని విడువ

లేదు వాళ్ళు.

సూర్యారావ్‌ని గూండాగ్యాంగ్ కిడ్నాప్ చేసుకువెళ్ళిందని టీవి ఛానెల్ వాళ్ళు టెలి కాస్ట్ చేసినాగానీ పోలీసులు ఏమీ యాక్షన్ తీసుకోలేకపోయారు.

బ్యాంక్ పి.ఆర్.ఓ మాత్రం ఇంటర్ వ్యూలో స్పష్టంగా చెప్పాడు.

"మా బ్యాంక్ ఆర్.బి.ఐ ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం గూండాలను రికవరీలకు ఉపయో గించటం మానేసింది. ప్రస్తుతం మా దగ్గర జనరల్ మేనేజర్ రికవరీస్ పోస్ట్ మాత్రమే ఉంది. అందులో ఎంతో అను భవం, అర్హత ఉన్న డాక్టర్ శంకర్ ఫైల్వా న్‌గారున్నారు"

మేము షాకయ్యాం. "ఆ గూండాకి డాక్ట రేట్ ఇచ్చారా?" ఆశ్చర్యంగా అడిగాడు బోస్.

"ఓల్డ్ సిటీ డాక్టరేట్ అయ్యుంటుంది" అన్నాడు రెడ్డి. మా అపార్ట్‌మెంట్స్‌లో కూడా ఒకళ్ళిద్దరు డాక్టరేట్‌లు ఓల్డ్‌సిటీలో కొనుక్కోవటం మాకు తెలుసు! వెంటనే సఫారీ మైక్ ముందుకొచ్చాడు.

"నేను గత ఇరవై ఏళ్ళుగా రికవరీ ఫీల్డ్‌లో ఎంతో అనుభవం గడించాను. క్రెడిట్ కార్డ్ బాకీలున్న వాళ్ళను మా ఆఫీస్‌కి పిలిపించి వాళ్ళు ఆ బాకీలు తేలిగ్గా, హేపీగా ఎలా తీర్చవచ్చో వాళ్ళకి సలహాలిచ్చి వాళ్ళంతట వాళ్ళే బాకీలు తీర్చేస్తామంటూ మా వెనుకబడే విధంగా కొత్త ఒరవడిని స్టార్ట్ జేశాం.

ఇలా బాకీదారుడిని మా ఆఫీస్‌కి తీసు కెళ్ళి అతనికి కౌన్సిలింగ్ చేయడాన్ని టీవీ ఛానెల్స్ కిడ్నాప్ అని ఆరోపిస్తున్నాయ్ గానీ అది వాస్తవం కాదనడానికి ఈ బాకీ దారుడే రుజువు" ఇలా అనగానే సూర్యా రావ్ కనిపించాడు మాకు.

అతని మొఖంలో బెదురు స్పష్టంగా కన బడుతోంది.

"జనరల్ మేనేజర్ రికవరీస్ శంకర్ ఫైల్వాన్ చాలా గొప్పవ్యక్తి. ఇంతకాలం నేను ఆ క్రెడిట్‌కార్డ్ బాకీ ఎలా తీర్చాలా అని భయపడుతూండేవాడిని! కానీ ఆయన నన్ను వాళ్ళాఫీస్‌కి తీసుకెళ్ళి రెండురోజుల పాటు ఎంతో ప్రేమగా, ఒక కుటుంబ సభ్యునిలా మాట్లాడి ఆ బాకీ తీర్చడం ఎంత తేలికో చెప్పారు. వెంటనే బాకీ తీర్చే శాను. శంకర్ ఫైల్వాన్ నిజంగా ఈనాటి మహాత్ముడు" అంటూ కన్నీళ్ళు పెట్టుకుని శంకర్‌దాదా కాళ్ళు కళ్ళకద్దుకున్నాడు. ఆ తరువాత పోలీస్ అధికారి మాట్లాడాడు.

"బ్యాంక్‌వాళ్ళు సూర్యారావ్ అనే బాకీ దారుడిని కిడ్నాప్ చేసినట్లు టీవీ ఛానెల్లో ఆరోపించారు. వెంటనే మేము స్పందించి జనరల్ మేనేజర్, రికవరీస్ గారిని కలుసు కోవటం జరిగింది. అక్కడ సూర్యారావ్ వాలంటరీగా తన బాకీ తీర్చే విషయంలో రకరకాల ఆప్షన్స్ గురించి శంకర్ ఫైల్వాన్ గారితో డిస్కస్ చేయటం చూశాము."

"ఛఛ! దీన్ని చానెల్ వాళ్ళు కిడ్నాప్ అంటున్నారా? నా స్వంత ఇంట్లో ఉన్న ట్లుంది నాకిక్కడ- ఎంతో హేపీగా నా ప్రాబ్లెమ్స్ అన్నీ శంకర్ ఫైల్వాన్‌గారు డిస్కస్ చేస్తున్నారని సూర్యారావ్‌గారు మాతో చెప్పటం జరిగింది" అంటూ ముగించాడతను.

ఈ గొడవంతా సద్దుమణిగాక ఒకరోజు ఓ వ్యక్తి మా అపార్ట్‌మెంట్స్ కొచ్చాడు.

"సార్! నేను ఒక బ్యాంక్‌కి నాలుగు లక్షలు క్రెడిట్‌కార్డ్ బాకీ ఉన్నాన్సార్. ఆ గూండాలు నా జోలికి రాకుండా మీరు తక్కువ ఖర్చుతో నాకు ప్రొటెక్షన్ ఇప్పిస్తా రని తెలిసింది. మీకు ఎంత డబ్బుకట్టాలి సార్?" అంటూ మా ప్రెసిడెంట్ హమీద్ మియా నడిగాడు.

మాకు నోట మాట రాలేదు.

*(మరో అంశంతో వచ్చేనెల)*

కాలాతీతం



బ్రాం స్టోకర్

# డ్రాకులా




ట్రాన్సిల్వేనియాలో ఉంటున్న కౌంట్ డ్రాకులా, ఇంగ్లండులో ఒక ఎస్టేట్ కొనుగోలు చేస్తాడు. ఆ విషయమై డ్రాకులాతో చర్చించటానికి దస్తావేజులు తీసుకుని, ట్రాన్సిల్వేనియా బయల్దేరతాడు ఒక యువ బ్రిటిష్ లాయర్ జోనాథన్ హార్కర్.

డ్రాకులా పేరు చెబితే చాలు, అందరూ భయంతో వణికిపోతారు. దారిలో తారసపడిన రైతులు, కూలీలు అక్కడికి వెళ్లొద్దని హెచ్చరిస్తారు. డ్రాకులా నివాసం ఉంటున్న దుర్గం ఎక్కడుందో వేలెత్తి కూడా చూపించారు. హార్కర్ హేతుబద్ధంగా ఆలోచిస్తాడు. మూఢనమ్మకాలను నిరసిస్తాడు. దేన్నైనా శాస్త్రీయంగా పరిశోధించాలంటాడు.

బోర్గోపాస్ వద్ద కౌంట్ దూత ఎదురు వచ్చి దుర్గానికి సాదరంగా ఆహ్వానిస్తాడు. అప్పటికి చీకటి పడింది. తోడేళ్ల కూతలతో అడవి ప్రతిధ్వనించింది. హార్కర్ కూర్చున్న గుర్రపు బండి ఇరుసు చప్పుడు కూడా వింతగా వినిపించింది.

దుర్గంలో అతిథి కోసం సకల సౌకర్యాలూ ఏర్పాటు చేశాడు కౌంట్. అతడు మరణించని ఒక సైతాను స్వరూపం, కామరూపి. మనుషుల నెత్తురే ఆహారంగా బతికే వాంపైర్. కొన్ని వందల ఏళ్లుగా ఈ గబ్బిలం రూపంలోనే కొనసాగుతున్నాడు. ఈ నవలలో అతడు చాలా కొద్దిసార్లు మాత్రమే ప్రత్యక్షంగా దర్శనమిస్తాడు. అయితే కథంతా ఆ పాత్ర చుట్టే తిరుగుతుంది. ట్రాన్సిల్వేనియాలో జనాభా చాలా తక్కువ. అంటే, నెత్తురు తాగటానికి జనం దొరకరు. అందువల్ల జనసాంద్రత అధికంగా వున్న ఇంగ్లండుకు మకాం మారిస్తే, కావలసినంత ఆహారం దొరుకుతుందని అక్కడ ఎస్టేట్ కొనాలనుకుంటాడు. రచయిత వర్ణించిన ప్రకారం అతడు సన్నగా, పొడుగ్గా వున్న వృద్ధుడు. నున్నగా షేవ్ చేసుకునివుంటాడు. తెల్లటి బుర్రమీసాలు,

దట్టమైన కనుబొమ్మలు, గిరజాల జుత్తు, తెల్లటి, పొడుగాటి కోరలు- పలువరుసతో అసహ్యంగా ఉంటాడు. తలనుండి, కింది దాకా నల్లటి గౌను వేసుకుంటాడు. నెత్తురులేక పాలిపోయినట్టుగా వుంటుంది మొహం. అయినా మంచి శరీర దారుఢ్యం వుంది. ఎంతటి క్లిష్ట సందర్భంలోనైనా ఆత్మరక్షణ చేసుకోగల సమర్థుడు.

హార్కర్‌కు అతడి వాలకం వింతగా తోస్తుంది. షేవింగ్ చేసుకుంటున్నప్పుడు, పొరబాటున గాటుపడి, కొద్దిగా నెత్తురు కారుతుంది. అది చూసి కౌంట్, హార్కర్ పైకి లంఘిస్తాడు. పెనుగులాటలో కౌంట్‌దే పైచేయి అవుతుంది. హార్కర్‌ను బంధించి ముగ్గురు అందమైన స్త్రీల(కామపిశాచాలైన వాంపైర్‌ల)ను కాపాలా పెడతాడు డ్రాకులా.




వాళ్ల అందచందాలకు పరవశుడవుతాడు హార్కర్. ముత్యాల్లాంటి పలువరుస వున్న ఒక సుందరి అతడి మీదకి వంగుతుంది. ఆమె ఊపిరి వేడికి మెడ కాలిపోతుందేమోననిపిస్తుంది. కోరలు చర్మానికి తగిలేటంతలో గదిలోకి ప్రవేశించిన డ్రాకులా ఆమెను వెళ్లిపొమ్మని సైగ చేస్తాడు. ఆ తర్వాత హార్కర్ స్పృహ కోల్పోతాడు. తరువాత మెలకువ వచ్చినా, జరిగిందంతా వాస్తవమో, స్వప్నమో, మానసిక చాంచల్యమో గుర్తించలేడు. రాత్రిళ్లు మాత్రమే కనిపిస్తాడు డ్రాకులా. కౌంట్ తన అనుచిత ప్రవర్తనకు సిగ్గుపడి, అతిథిని భోజనానికి ఆహ్వానిస్తాడు. ఇంటి నిండా ఆహారమున్నా అతడు మాత్రం తినడు.

దుర్గంలో ఉన్నంత కాలం హార్కర్‌కు తోడేళ్ల అరుపులే నేపథ్య సంగీతం. "ఇవి చీకటి శిశువులు. వీటి కూతలు మధుర సంగీతంలాగ మనల్ని ఆకట్టుకుంటాయి. నా అతిథిగా మీకీయింట్లో పూర్తి స్వేచ్ఛ వుంది. ఎక్కడైనా తిరగొచ్చు. మూసి ఉన్న తలుపుల్ని మాత్రం తెరవొద్దు" అని హార్కర్‌ను హెచ్చరిస్తాడు డ్రాకులా.

జలగలాగ మనిషి నెత్తురుతాగే ఈ దుష్టునితో వ్యాపార లావాదేవీలకు వచ్చినందుకు పశ్చాత్తాప పడతాడు హార్కర్. వీడు అక్కడికి వచ్చి, స్థిరపడి ఇంగ్లిషు స్త్రీలను, పిల్లల్ని చంపటానికి తాను సాయం చేయాలా? అంతలో పసిగుడ్డు పాలికేక వినిపిస్తుంది. ఎవరో దాన్ని గొంతునులిమి చంపుతున్నారు. కౌంట్ నవ్వుతాడు. నెత్తుటితో తడిసిన పెదవులు తుడుచుకుంటూ ప్రవేశిస్తారు స్త్రీలు. కోపం పట్టలేక డ్రాకులాను చంపబోతాడు హార్కర్. అతడు కోట గోడల మీద బల్లిలా జారిపోతాడు. ఆ తర్వాత జాగిలాల అరుపులు వినిపిస్తాయి. హార్కర్ మళ్లీ బందీ. గది బయట జిప్సీలు మట్టి తవ్వి పెట్టెల్లో నింపుతుంటారు. ఒకటి కాదు, రెండు కాదు, యాభై భోషాణాల నిండా పోస్తున్నారు. అప్పటికి తెల్లవారింది. ఒక భోషాణంలో దూరిపోతాడు డ్రాకులా.

★ ★ ★

ఇక కథా స్థలం ఇంగ్లండుకు మారుతుంది. హార్కర్ ప్రియురాలు మినా అనాథ. అసిస్టెంట్ స్కూల్ మిస్ట్రెస్‌గా వుద్యోగం చేస్తుంటుంది. తన స్నేహితురాలు లూసీ వెస్టెర్నాను చూడటానికి కొచ్చింది.

లూసీ ఒక పిచ్చాసుపత్రికి అధిపతిగా వున్న డాక్టర్ సెవార్డ్‌నూ, టెక్సాస్ నుండి వచ్చిన క్విన్సీ మారిస్‌నూ కాదని, ఇరవై తొమ్మిదేళ్ల ఆర్థర్ హోంవుడ్‌ను ప్రేమిం

# బ్రాం స్టోకర్ (1847 - 1912)

మిస్టరీ, హారర్ సాహిత్యంలో నూతన శకం ప్రారంభించిన బ్రాం స్టోకర్ జీవితంలో కొన్ని ఘట్టాలు ఇప్పటికీ మిస్టరీగానే మిగిలాయి. స్టోకర్ మనవడు డేనియల్ ఫార్సన్ మాటల్లో 'పాఠకులు బ్రహ్మరథం పట్టిన ఈ రచయిత గురించి లోకానికి తెలిసింది చాలా తక్కువ.'

ఐర్లండ్‌లోని డబ్లిన్‌లో 1847లో జన్మించాడు బ్రాం స్టోకర్. బాల్యమంతా ఏదో ఒక జబ్బుతో బాధపడ్డా, తరువాత ఆరడుగుల ఆజానుబాహుడిగా ఎదిగాడు. ట్రినిటీ కాలేజిలో ఎం.ఎ. చదివాడు. రచనే వృత్తిగా ఎంచుకున్న స్టోకర్, తొలి దశలో నాటక విమర్శలు ఎక్కువగా రాశాడు. ప్రసిద్ధ అమెరికన్ కవి, వైతాళికుడు వాల్ట్ విట్‌మన్ పరిచయంతో సాహిత్యంమీద అభిరుచి మరింత పెరిగింది. భుక్తికి లేక కొంతకాలం ప్రభుత్వోద్యోగం చేశాడు.

1876లో ఇరవైతొమ్మిదో ఏట, ఆనాటి అగ్రశ్రేణి నటుడు హెన్రీ ఇర్వింగ్‌తో పరిచయమేర్పడింది. ఇర్వింగ్ నడుపుతున్న నాటకశాలలో యాక్టర్-మేనేజర్‌గా చేరి, 1905లో ఇర్వింగ్ మరణం దాకా అక్కడే కొనసాగాడు. 1878లో, స్టోకర్, ఫ్లొరెన్స్ బాల్కోంతో ప్రేమలో పడ్డాడు.

చింది. అతని తండ్రి లార్డ్ గొడాల్మింగ్. లూసీకి నిద్రలో నడిచే అలవాటుంది. తన స్నేహితురాలికున్న ఈ అలవాటు మాన్పించటానికి మినా చెయ్యని ప్రయత్నం లేదు. ఆమె ప్రియుడు జోనాథన్ గురించి సమాచారం తెలియక చాలా కాలం గడిచింది. అది మినాకున్న మరో బెంగ

ఒక రాత్రి మినా, లూసీ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నప్పుడు తీరానికి వస్తున్న వింత ఓడ ఒకటి కనిపిస్తుంది. అది దేనికో కొట్టుకుని మునిగిపోతుంది. కేవలం ఒక జాగిలం మాత్రం ఒడ్డుకు చేరి అదృశ్యమైపోతుంది. కౌంట్ డ్రాకులా పంపిన యాభై భోషాణాల మట్టి వున్నది ఆ ఓడలోనే.

ఓడ మునక తర్వాత, ఒక అర్ధరాత్రి లూసీ మళ్లీ స్లీప్ వాకింగ్ చేస్తున్నట్టుగా గుర్తిస్తుంది మినా. ఏదో అదృశ్య శక్తి ఆమెను చేయిపట్టుకుని నడిపిస్తున్నది.

కళ్లు మూసుకున్నా అడ్డంకులు తప్పించుకుని నడిచింది. ఆ ఊరి శ్మశానం చేరి, ఒక ఎత్తైన ప్రదేశంలో కూర్చుంది. ఆమె పైన పొడుగాటి, సన్నని, నల్లని ఆకారమేదో వలయాలు తిరిగింది. మినా దగ్గరకు చేరటంతో మాయమైంది. మరి కాసేపటికి లూసీకి మెలకువ వచ్చింది. ఎంత అడిగినా ఏం జరిగిందో తెలియదంది. మంచులా చల్లబడిన స్నేహితురాలి శరీరం మీద శాలువా కప్పాలనుకుంది మినా. చేతులడ్డంపెట్టింది లూసీ. వాటిని తొలగించే ప్రయత్నంలో మినా చేతికున్న పిన్ను గుచ్చుకుని లూసీ మెడమీద రెండు నెత్తుటి గుర్తులు పడతాయి. ఆ తర్వాత ప్రతిరాత్రీ లూసీ తన పడకగది కిటికీ పక్కన నిలుచోవటం, పరిసరాల్లో పక్షి లాంటి ఓ ఆకారం ఎగరటం గమనిస్తుంది మినా. అది గబ్బిలమని తరువాత తెలుస్తుంది. అంతలో లూసీ ఆరోగ్యం క్షీణిస్తుంది. ఆమెను పరీక్షించిన డాక్టర్ సెవార్డ్‌కు కారణమేమిటో అంతుపట్టదు.

ఈలోగా జోనాథన్‌ను కలుసుకోవాలని ట్రాన్సిల్వేనియా బయల్దేరుతుంది మినా. లూసీ పరిస్థితి మరింత దిగజారుతుంది. తనకు గురుతుల్యుడైన డాక్టర్ అబ్రహాం వాన్ హెల్సింగ్‌ను తక్షణం రమ్మని టెలిగ్రాం యిస్తాడు డాక్టర్ సెవార్డ్. డాక్టర్ వాన్ హెల్సింగ్ గొప్ప పండితుడు. ఎం.డి; పిహెచ్.డి, డి.లిట్ వగైరా డిగ్రీ

సంచలన రచయిత, నాటకకర్త ఆస్కార్ వైల్డ్ కూడా ఆమెకోసం ప్రయత్నించాడు గాని, ఇద్ద రిలో పెద్దవాడైన స్టోకర్‌నే పెళ్లాడింది ఫ్లారెన్స్. వైల్డ్‌తో సహా, అనాటి సాహిత్య దిగ్గజాలు కాన న్ డాయల్, ఆల్ఫ్రెడ్ టెన్నిసన్, మార్క్‌ట్వేన్, థియోడర్ రూజ్వెల్ట్ కూడా స్టోకర్‌కు మిత్రులే.

1882లో స్టోకర్ తన తొలి కథాసంకలనం 'అండర్ ది సన్‌సెట్', 1890లో తొలినవల 'ది స్నేక్స్ పాస్' ప్రచురించాడు. సుదీర్ఘ పరిశో ధనా ఫలితంగా స్టోకర్ మాస్టర్‌పీస్ 'డ్రాకులా,' ఆర్చిబాల్డ్ కాన్‌స్టేబుల్ ప్రచురణగా 1897లో వెలువడింది. ఆనాటి నుండి ఇప్పటిదాకా ఎన్ని వందలవేలసార్లు, ఎన్ని భాషల్లో ఇది పాఠకు లను అలరించిందో అంచనా వెయ్యటం కూడా అసాధ్యమే. 1906లో స్టోకర్, 'హెన్రీ ఇర్వింగ్ స్మృతులు' ప్రచురించాడు. అది అతడి ఆత్మక థగా భావిస్తారు. ఈయన ఇతర నవలలు మిస్టరీ ఆఫ్ సీ (1902), దిమాన్ (1905), ది లెయిర్ ఆఫ్ ది వైట్‌వర్మ్ (1911), హారర్ కథలు డ్రాకులాస్ గెస్ట్, ది జడ్జెస్ హౌస్‌లను కూడా పాఠకులు విశేషంగా ఆదరించారు. చివరి రోజుల్లో స్టోకర్ ఆరోగ్యం అకస్మాత్తుగా క్షీణించింది. డెత్ సర్టిఫికెట్‌లో కారణం, 'ఉన్మా ద ఫలితంగా వచ్చిన పక్షవాతం' అని తెలి పారు. సిఫిలిస్‌వల్ల యిలా జరుగుతుందన్నారు కొందరు డాక్టర్లు. కాదన్నారు మరికొందరు. డ్రాకులాలాగ, స్టోకర్ మరణం కూడా ఒక మిస్ట రీగానే మిగిలింది.

లున్నాయి. లాయర్. బ్రహ్మచారి. అతీం ద్రియశక్తుల గురించి విశేష పరిశోధన చేశాడు. ఆమ్‌స్టర్‌డ్యామ్‌లో వుంటాడు. ఆమె మెడమీద నెత్తుటి గాయాలు చూసి వాన్‌హెల్సింగ్‌కు ఏదో సందేహం వస్తుంది. రక్తస్రావ లక్షణాలు లేవుగాని, ఒంట్లో రక్తం ఎవరో పీల్చేసినట్టుగా వుంది.

ఆమెను బతికించటానికి రక్తం ఎక్కి స్తారు. అలా ఎక్కించిన ప్రతిసారీ ఆమె కోలుకుంటుంది. కాని ఒకటి రెండు రోజుల్లో మళ్లీ రక్త క్షీణతతో పాలిపో తుంది. చివరికి వాన్‌హెల్సింగ్ ఓ ఉపాయం ఆలోచిస్తాడు. ఆమె గదిలోకి ఎవరూ ప్రవేశించకుండా దిగ్బంధం చేసి, మెడమీద వెల్లుల్లి లేపనంతో కట్టుగడ తాడు. వాంపైర్‌లను నిరోధించటానికి ఇలా చేస్తారని మనకు తరువాత తెలు స్తుంది.

**వందలాది సినిమాలకు ప్రాణం పోసిన కథ**

**తొ**లిసారిగా జర్మన్ చలన చిత్ర దర్శకుడు ఎఫ్. డబ్ల్యు. ముర్నవ్, 1922లో తీసిన 'నాస్ఫె రాటూ' ఆదిగా, డ్రాకులా లేదా వాంపైర్లు ఆధా రంగా కొన్ని వందల సినిమాలు వచ్చాయి. వస్తూనే వున్నాయి. అప్పటికి ముర్నావ్‌కు 'డ్రాకులా' హక్కులు లేవు గనక సినిమా పేరు 'నాస్ఫెరాటూ'గా, వాంపైర్ పేరు 'కౌంట్ ఆర్లాక్' గా మార్చాడు. ప్రజలు హారర్‌ను ఆనందిం చినంత కాలం 'డ్రాకులా'కు మరణం లేదు.

అందరూ నిద్రిస్తున్నప్పుడు, ఒక రాత్రి అనూహ్యంగా ఒక తోడేలు వచ్చి కిటికీ కున్న గాజు తలుపులు పగలగొడుతుంది. అది చూసి, కూతురికి తోడుగా పడుకున్న లూసీ తల్లి గుండె ఆగి మరణిస్తుంది. వాంపైర్ మళ్లీ లూసీ మీద దాడి చేస్తుంది. లూసీ ఇక బతకదని తెలిసిన వాన్ హెల్సింగ్, ఆమె ప్రియుడు ఆర్థర్ హోంవుడ్‌ను కడసారి చూపులకు రమ్మం టాడు. అతని తండ్రి కూడా మరణశయ్యా పై ఉన్నాడు. వీడ్కోలు ముద్దివ్వటానికి వంగినప్పుడు, అప్పటికే కోరలు పెరిగిన లూసీ, హోంవుడ్ మీద దాడికి ప్రయత్ని స్తుంది. వాన్‌హెల్సింగ్ అతణ్ణి వెనక్కు లాగుతాడు. లూసీ మరణిస్తుంది.

ఈ సంఘటన తర్వాత స్థానిక వార్తాప త్రికలో ఓ కథనం ప్రచురితమవుతుంది. 'బ్లూఫర్ లేడీ' అనబడే ఓ ఆకారం పిల్లల మీద దాడి చేసి నెత్తురు తాగుతున్నదని దాని సారాంశం. తన బాధితులను ఆక

## దుష్ట శక్తుల పరాజయం తప్పదు!

నవలలోని కథనం నేరుగా సాగదు. లేఖలు, నోట్స్, డైరీలలోని కొన్ని పేజీలు, వార్తాపత్రికలలోని కథనాలు, ఫోనోగ్రాఫ్ రికార్డింగ్ వగైరా పద్ధతుల్లో ముక్కలు ముక్కలుగా పాఠకుడికి సమాచారం అందిస్తాడు రచయిత. మిస్టరీ, సస్పెన్సు కథలకు ఈ పద్ధతే అనువు. బ్రిటిష్ మిస్టరీ నవలా రచయిత విల్కీ కాలిన్స్ 1860లో ప్రచురించిన 'ది ఉమన్ ఇన్ వైట్' వల్ల ప్రభావితుడైన స్టోకర్ ఈ పద్ధతిని అనుసరించాడంటారు. సుమారు నాలుగు వందల పేజీల ఈ నవలలో విలన్ డ్రాకులా చాలా కొద్దిసార్లు మాత్రమే దర్శనమిస్తాడు. ఈ పాత్ర చుట్టే తిరుగుతుంది కథ. రాజవంశానికి చెందిన కౌంట్ డ్రాకులాగాక ఒక పేదవాడైతే, కథ ఇంత ఉత్కంఠభరితంగా వుండదు. దుష్ట, సంపన్న శక్తుల పరాజయమంటే పేదల విజయమే. రాజ వంశాల ధనికులకు అతీంద్రియ శక్తుల్ని కల్పించి, వాళ్లను ప్రతినాయకులుగా చిత్రించటానికి తనకంటే ముందే రాసిన సామ్యూల్ రిచర్డ్‌సన్ నవలలు పామెలా (1740), క్లారిసా (1747)ల నుండి బ్రాం స్టోకర్ ప్రేరణ పొంది వుండవచ్చునంటారు విమర్శకులు. కులీన వర్గాల దుష్టశక్తులు, పేద, మధ్యతరగతి అమాయకులను హింసించటం, తమ అధీనంలో పెట్టుకోవడం వర్గదోపిడీకి ప్రతీక అన్నారు సామాజిక విశ్లేషకులు. ఈ కథ వెనక వున్న తాత్వికత యిదే.

ర్శించటానికి డ్రాకులా వద్ద కొందరు స్త్రీ వాంపైర్లుంటారు కదా! ఈ విపరీత పరిణామానికి విస్తుపోయిన వాన్‌హెల్సింగ్, లూసీ శవపేటికను తెరవటానికి డాక్టర్ సెవార్డ్‌ను రమ్మంటాడు. శవపేటికను తిరిగి తెరవటం మతాచార విరుద్ధం. కాని, గురువు ఆదేశం కాదనలేడు సెవార్డ్.

ఈలోగా మినా, జోనాథన్ పెళ్లి చేసుకుని ఇంగ్లండుకు తిరిగి వస్తారు. జోనాథన్ ట్రాన్సిల్వేనియాలో రాసుకున్న డైరీ, జాగ్రత్తగా అధ్యయనం చేస్తాడు వాన్‌హెల్సింగ్. అతడి సందేహం దృఢపడుతుంది. లూసీ మీద ఒక వాంపైర్ దాడి చేసిందనీ, ఫలితంగా ఆమె వాంపైర్‌గా మారిందనీ ఆమె పాతమిత్రుల సమక్షంలో ప్రకటిస్తాడు. ఆత్మను రక్షించాలంటే, ఆమె హృదయంలో ఒక కర్ర ముక్కను కొట్టి, తల నరికి, దాంట్లో వెల్లుల్లి కూర్చటం ఒక్కటే మార్గమంటాడు. వాదప్రతివాదాల తర్వాత అందరూ దానికి అంగీకరిస్తారు.

ఇక డ్రాకులా కోసమూ, అతడు తీసుకు వచ్చిన యాభై పెట్టెల మట్టి కోసమూ అన్వేషణ ప్రారంభమవుతుంది. జోనాథన్, మినా, డాక్టర్ సెవార్డ్, వాన్ హెల్సింగ్, హోంవుడ్, క్విన్సీ మారిస్‌లు కలిసి ఒకే బృందంగా బయల్దేరుతారు. అందరి లక్ష్యం ఆ వాంపైర్‌ను నాశనం చెయ్యటమే. కాని కొద్ది రోజుల్లోనే మినాలో ఏదో మార్పు కనిపిస్తుంది. ఒక కాళరాత్రి వాన్ హెల్సింగ్, సెవార్డ్ ఆమె పడకగది తలుపులు బద్దలుకొట్టి లోపలికి ప్రవేశిస్తారు. అక్కడి భయానక దృశ్యం హేతువాదులైన డాక్టర్లను కూడా భయకంపితుల్ని చేస్తుంది. మినా బలవంతంగా, డ్రాకులా ఛాతీ మీద గాయం నుండి నెత్తురు తాగుతుంటుంది. ఆగంతకులను చూసిన డ్రాకులా అదృశ్యమైపోతాడు.

పలు ప్రయత్నాల తర్వాత, ఈ అన్వేషణా బృందం మట్టితో నిండిన నలభై తొమ్మిది పెట్టెలను నాశనం చేస్తారు. ఒకటి మాత్రం తిరిగి, ట్రాన్సిల్వేనియాలో డ్రాకులా దుర్గానికి పంపించారని తెలుస్తుంది. దాన్ని కూడా వెదికి పట్టుకోవాలి. మినా మీద హిప్నాసిస్ ప్రయోగించి, కొంత సమాచారం తెలుసుకుని, డ్రాకులాను ట్రాన్సిల్వేనియాలోని బోర్గో పాస్ దాకా వెంటాడుతారు. అక్కడ మట్టితో నిండిన చివరి పెట్టె కనిపిస్తుంది. కొందరు జిప్సీలు దాన్ని డ్రాకులా దుర్గానికి మోసుకుపోతుంటారు. వాళ్లను అడ్డగించి, పెట్టెను బలవంతంగా లాక్కుని, మట్టిని కిందకు గుమ్మరిస్తారు. అందులో కనిపిస్తుంది డ్రాకులా శరీరం. జోనాథన్ అత


# చతుర ప్రవేశిక


## మార్చి - 2010

మార్చి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. వెంకన్న పెద్ద కొడుకు పేరు?
2. గోపి ప్రేమించిన అమ్మాయి పేరు?
3. పట్నం వస్తే సాయం చేస్తానని వెంకన్నను మోసగించింది?
4. ఆత్మహత్య చేసుకున్న ర్యాంక్ విద్యార్థి?
5. మల్లిక భర్త పేరు?
6. సరస్వతీ నారద విలాపం ఎవరి రచన?
7. డ్రాకులా నవలా రచయిత?
8. ఆశా పూర్ణాదేవి ఏ నవలకు జ్ఞానపీఠ పురస్కారం వచ్చింది?
9. నర్సింగ్‌దాదా శిష్యుడి పేరేమిటి?
10. స్వామినాథ అయ్యర్‌కోసం త్యాగరాజు పాడటం మానేసిన రాగం?

పంపినవారి పేరు: ---------------------------- వయసు ( )

చిరునామా: ----------------------------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 16

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

ని తల నరికివేస్తాడు. మారిస్ అతడి గుండెల్లో ఒక పిడిబాకు గుచ్చుతాడు. కౌంట్ ధూళిగా మారిపోతాడు. జిప్సీలతో పెనుగులాడినప్పుడు గాయపడిన క్విన్సీ మారిస్ తర్వాత మరణిస్తాడు.

★ ★ ★

చివరికి ఇదంతా నిజంగా జరిగిందని చెప్పటానికి ఆధారమేదీ లేదంటూ నవల ముగిస్తాడు స్టోకర్. "హార్కర్ రాసుకున్న డైరీతో సహా, ఇతర వివరాలన్నీ మరెవరో టైప్ చేయగా ఆ సమాచారం నుండి అల్లిన కథ ఇది" అంటాడు.

కాలక్షేపం కోసం ఏకబిగిన చదివించే నవల 'డ్రాకులా'.

– ఎం.వసంత


అశా పూర్ణాదేవి

# నారీలోకానికి ఆశారేఖ

**వంగ దేశ విభజనతో సంక్షుభిత పరిస్థితులు నెలకొన్న దశలో ఆశాపూర్ణాదేవి సంపన్న సనాతన కుటుంబంలో జన్మించారు. పాఠశాల ప్రాంగణం ప్రవేశించే అవకాశంలేని కట్టుబాట్ల మధ్య పెరిగి, కేవలం స్వయం కృషితో సరస్వతీ కటాక్షం పొందారు. బెంగాలీ సాహితీ క్షేత్రంలో శిఖరప్రాయులతో సమస్కంధంగా విలక్షణ స్థానం అలంకరించడమే కాక, భారతీయ జ్ఞానపీఠ పురస్కారం స్వీకరించిన తొలి విదుషీమణి ఆశాపూర్ణాదేవి. మహిళాభ్యుదయ సాధనే లక్ష్యంగా రచనలు సాగించి సమాజంలో స్త్రీ స్థానం విషయమై కొత్త ఆలోచనలకు తెరతీశారు. 'ప్రథమ ప్రతిశ్రుతి' నవల వెలయించిన ఆశాపూర్ణాదేవిని 1976 సంవత్సరానికి జ్ఞానపీఠ పురస్కారంతో భారత ప్రభుత్వం సత్కరించింది.**

వంగసీమలో ధనిక కుటుంబాల బాలికలు గడప దాటరాదనే నిబంధన వుండేది. అలాంటి కుటుంబంలో 1908 జనవరి 8న ఆశాపూర్ణాదేవి కోల్‌కత నగరంలో జన్మించింది. విద్యాగంధం, సంస్కారం వున్న కుటుంబం ఆమెది. తండ్రి గొప్ప చిత్రకారుడు. తల్లి సారస్వతమూర్తి. విద్యాబుద్ధులన్నీ ఆశాపూర్ణాదేవి ఇంట్లోనే నేర్చింది. వారింట్లో మంచి గ్రంథాలయముండేది. వారింటికి ప్రవాసి, భారతి, మానసి, అర్చన, సాహిత్య, భరతవర్ష, మర్మబాణి వంటి పత్రికలు వచ్చేవి. బెంగాలీ సాహిత్య పరిషత్తు, జ్ఞానవికాస్ లైబ్రరీ, చైతన్య పుస్తకాలయ్ నుంచి గ్రంథాలు రప్పించేవారు. చిన్నతనంలోనే ఆశాపూర్ణాదేవిలో సాహిత్యాభిలాష వర్ధిల్లింది. దీనికి తగినట్లు తల్లిదండ్రుల ప్రోత్సాహం లభించింది.

రాజారామ్‌మోహన్‌రాయ్ సంస్కరణ ప్రభావం సమాజంపై కొంత ప్రసరించినప్పటికీ, కుటుంబ సంప్రదాయానుసారం ఆశాపూర్ణాదేవికి పదిహేనవయేటనే వివాహమయింది. అప్పటికే రచనా వ్యాసంగంలో ప్రవేశించిన ఆమె అటు గృహిణిగా, ఇటు రచయిత్రిగా ఉభయ బాధ్యతలు అంకితభావంతో నిర్వహించగలిగింది. బాల సాహిత్యంతో ఆమె రచనా రంగంలో అడుగుపెట్టింది. 'శిశుపతి' పత్రికలో ఆమె కవిత ప్రచురితమైన నాటికి ఆమె వయస్సు కేవలం పదమూడేళ్ళు. ఆమె బెంగాలీ సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. ఆమె రచనలు అన్ని వయోవర్గాలవారిని అబ్బుర పరిచాయి. 'ఆనందబజార్' పత్రికలో వెలువడిన 'పలీ ఓ ప్రేయసి' అనే కథ సంచలనం సృష్టించింది. ఆనాటి మహిళలు పురుషుల ఆదేశాలు పాటించే జీవులుగా మాత్రమే మనుగడ సాగించేవారు. ఆశాపూర్ణాదేవి కథలు, నవలలు ఈ పరిస్థితిని బలీయంగా నిరసించాయి. అంతేకాదు, స్త్రీ బాహ్య రూపురేఖలు మాత్రమే వర్ణించే రచయితల వైఖరిని సాకల్యంగా మార్పు చేస్తూ ఆమె రచనలు స్త్రీ మానసిక సౌందర్యానికి, సంఘర్షణలకు, మనోభావాలకు, ఆశలకు, ఆకాంక్షలకు, వేదనలకు పెద్దపీట వేశాయి. బెంగాలీ సాహి-




త్యంలో స్త్రీని ఈ కోణంలో శక్తిమంతంగా చిత్రించిన మొదటి సాహితీమూర్తి ఆశాపూర్ణాదేవే. గృహ జీవనంలో స్త్రీ పాత్రను ఆమె చూపిన తీరు పాఠకలోకాన్ని సంభ్రమాశ్చర్యాలకు లోను చేసింది. ఆమె రచనలు స్త్రీమూర్తిని సర్వసమగ్రంగా ఆవిష్కరించాయి. 'జల్ ఓ ఆగున్' అనే కథా సంపుటి 1940లో వెలువడింది. భారతీయ కథా సాహిత్యంలో స్త్రీని ఇంత ప్రబలంగా

చూపిన మరో ఉదాహరణ అప్పటికి లేదని నాటి విమర్శకులు భావించారు. ఆమె తన అనుభవం లోకి, తన పరిశీలనలోకి వచ్చిన వాటినే వస్తువుగా స్వీకరించారు. నవలా రచన కొంత ఆలస్యంగా ప్రారంభించినా ఆమె తొలి నవల 'ప్రేమ్ ఓ ప్రయోజన్'లోని సమస్యలు, సందేశం ఈనాటికీ వర్తిస్తాయి. 'ముఖర్ రాత్రి' నవల దైన్యస్థితికి చేరిన ఒక కుటుంబ వృత్తాంతం. దీనిలోనూ కుటుంబంలో స్త్రీలు ఎదుర్కొనే సమస్యల్ని వేలెత్తి చూపారు. ఆత్మకథాత్మక ప్రక్రియలో కథనం సాగుతుంది. ఆమె నవలల్లో విస్తృత వైవిధ్యం చోటు చేసుకుంది. సమాజంలోని వైరుధ్యాలను, తారతమ్యాలను, మానసిక ప్రవృత్తులను, వ్యక్తుల స్వభావాలను, స్త్రీల స్వేచ్ఛా రాహిత్యాన్ని, బడుగు వర్గాల పేదరికాన్ని ఇంకా అనేక సామాజిక పార్శ్వాలను ఆమె బలీయంగా చిత్రించారు. అగ్ని పరీక్ష, నిర్జన పృథ్వీ, నేపథ్య నాయిక, శశిబాబుర్ సంసార్, అతిక్రాంత్, నవజన్మ, ఉత్తరాయణ్, యోగ్ వియోగ్, ఆంశిక్, 'ప్రేమ్ యుగే యుగే, ప్రథమ ప్రతిశ్రుతి వంటి నవలలు, స్వర్ణశర్వరి, పూర్ణపత్ర్, మనోనయన్, పాంఛీమహల్, కేశవతీ కన్యా, సోనాలీ సంధ్యా, ఆకాశ్‌మాటీ, జల్ భవి, ఛాయాసూర్య, త్రినయనీ మొదలైన కథా సంపుటాలు ఆశాపూర్ణాదేవి రచనా వైభవానికి అద్దం పడతాయి. గంపెడు సంసారం నడుపుతూనే ఆమె 24 కథా సంపుటాలు, 120 నవలలు, 25 బాలసాహిత్య రచనలు రాయగలగడం ఆశ్చర్యం కలిగించక మానదు.

జ్ఞానపీఠ పురస్కృతి పొందిన ఆమె 'ప్రథమ ప్రతిశ్రుతి' వంగ నవలా సాహిత్యంలో ఒక మణిదీపంగా భాసిల్లింది. ఇతివృత్తంలో, పాత్ర చిత్రణలో, కథనశైలిలో రచయిత్రి విలక్షణ మార్గం అనుసరించారు. వాస్తవానికి ఆశాపూర్ణాదేవి ప్రతిఘటన భావజాలానికి ఇది ప్రతిరూపు. బెంగాలీ మహిళా లోకాన్ని స్వేచ్ఛా పథంవైపు నడిపించే గొప్ప నవల ఇది. భారతీయ జ్ఞానపీఠ పురస్కారం అందిస్తూ పలికిన ప్రశంసావాక్యాలు యథాతథంగా- "ప్రథమ ప్రతిశ్రుతి ఉన్‌కీ ఉత్కృష్ట రచనా హై! ఇస్‌మె బంగీయ నారీకీ ఉన్నీస్‌వీ శతాబ్దికె ప్రారంభ్ సే లేకర్ క్రమిక్ విముక్తికో ఉద్ఘాటిత్ కియా గయాహై!"

'ప్రతి శ్రుతి' అంటే వాగ్దానం అని అర్థం. ఈ నవల ఆశాపూర్ణాదేవి నిజ జీవితంలో పెంచుకున్న ఆలోచనలకు అక్షరరూపం. దీని కొనసాగింపుగా రచించిన 'సువర్ణలత', 'బకుళ కథ' నవలల్లో సహితం ఇదే ధోరణి కనిపిస్తుంది. రాజా రామమోహనరాయ్ ప్రతిపాదించిన మహిళా విమోచనను ఈ నవలాత్రయం బలపరుస్తూ, అందుకు అనుగుణమైన పాత్రల రూపకల్పన జరిగింది. 'ప్రథమ ప్రతిశ్రుతి'లో ముఖ్యపాత్ర సత్యవతి. పందొమ్మిదో శతాబ్దినాటి సామాజిక పరిస్థితులు స్త్రీని వంటింటికి పరిమితం చేశాయి. రకరకాల రుగ్మతలు సమాజాన్ని పట్టి పీడించాయి. సత్యవతికి చిన్ననాటి నుంచి స్వతంత్ర భావాల ధికం. ఆమె భర్త నవకుమార్. మితిమీరిన అతని అదుపాజ్ఞలను ఆమె నిరసించింది. ఎదిరించింది. తన స్వేచ్ఛను కాపాడుకునేందుకు భర్తతో సమరమే సాగించింది. కుమార్తె వివాహం విషయంలో వచ్చిన వివాదంలో చివరకు భర్తకు దూరమయ్యేందుకు కూడా సత్యవతి వెనుకాడలేదు. ఆశాపూర్ణాదేవి స్వేచ్ఛాభావాలకు సత్యవతి ప్రతిబింబం. సత్యవతి కుమార్తె సువర్ణలత. ఈమె పోరాట పటిమ అసామాన్యం. స్త్రీజాతి చైతన్యానికి జీవితాన్ని అంకితం చేసింది. ఈమె కథే రెండవ నవల. సువర్ణలత తనయ బకుళ. స్త్రీ జాతి విముక్తికి పరాకాష్ఠ ఈ పాత్ర. సువర్ణలత మేనకోడలు శంపాయిక. బకుళ రచయిత్రి. వ్యక్తిగత జీవితంలో ఓటమి పాలయింది. కాగా శంపాయిక విజయం సాధించింది. ఇది చివరి నవలలోని కథ. ఈ నవలాత్రయం ద్వారా ఆశాపూర్ణాదేవి మహిళాభ్యుదయ పథాన్ని బలీయంగా నిర్దేశించింది. అందుకే 'ప్రథమ ప్రతిశ్రుతి' మహిళా లోకానికి ఆదర్శంగా నిలిచింది.

ఆశాపూర్ణాదేవి అనేక పురస్కారాలందుకున్నారు. కోల్‌కత విశ్వవిద్యాలయం లీలా పురస్కారం, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం రెయిన్ డ్రాప్ స్మారక పురస్కారం అందజేశాయి. భువన మోహినీ స్వర్ణ పతకం, హర్‌నాథ్ ఘోష్ స్వర్ణపతకం, జగత్తరణ స్వర్ణ పతకాలను ఆమె స్వీకరించారు. ఫెలోషిప్‌తో కేంద్ర సాహిత్య అకాడమి, 'పద్మశ్రీ'తో భారత ప్రభుత్వం ఆమెను గౌరవించాయి. తమిళ రచయితల సంఘం, పంజాబీ లేఖక్ సమాజం తదితర మరెన్నో సంస్థలు ఆమెను ఘనంగా సత్కరించాయి.

ఆశాపూర్ణాదేవి 1995 జూలై 13వ తేదీన దివంగతులయ్యారు. రచనల ద్వారా మహిళా సాధికారతకు, అభ్యుదయ మార్గ గమనానికి బాటలు వేసిన గొప్ప రచయిత్రిగా ఆమె యశోనామం శాశ్వతమై నిలుస్తుంది.

**-గోవిందరాజు రామకృష్ణారావు**

# FORM IV (See Rule 8)

**Statement about ownership and other particulars of CHATURA.**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO, VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2010

Printed, Published, Edited & Owned by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. www.eenadu.net.





# వారెవ్వా!

ఆకులో ఆకుగా
కొమ్మలో కొమ్మగా
ప్రకృతిలో లీనమై
మనుగడ సాగించే
ప్రాణులివి..









